నివర్తించి, యాచార్యుని (పురోహితుని) యింటికిం జని, తానొనర్పంబోవు వ్రతోద్యాపనంబున కాచార్యునిగా వరించి, ప్రాగుక్తవిధానంబున స్నాన మాచరించి పరిశుద్ధప్రదేశంబున నలికి ముగ్గులువెట్టి సర్వతో భద్రమండలం బేర్పఱచి, యందు స్వర్ణరజతతామ్ర మృణ్మయపాత్రములలో నేదియైన నియమించు కొని, వాసించునట్టి నీళ్లు పోసి, దానిమెడయందు వస్త్రయుగ్మము చుట్టి, పంచగంధాక్షతలచే నర్చించి, మధ్యాహ్నమున సకల పూజా ద్రవ్యములతో సప్తర్షులను షోడశోపచారములచే నర్చించి, యేడుసంవత్సరము లాచరించిన నావరించిన మొదటిగాని, నడుమగాని, కడపటగాని యుద్యాపనంబు చేయవలయును. అయ్యుద్యాపనమునకై యేడ్వురు ఋత్విక్కులను వరించి, బంగారు ప్రతిమలను శక్తికొలఁది జేయించి, యేడు కలశంబులను నునిచి, వానియందు సప్తఋషుల నావాహనంబు చేసి, పురాణోక్త కల్పప్రకారంబుగాఁ బూజించి, యారాత్రి పురాణశ్రవణంబుచే జాగరణంబు గావించి, మఱునాఁడు తెల్లవారి స్నానసంధ్యా వందనాదికృత్యములు నెఱవేర్చి, వారివారి యథాశాఖల ననుసరించి వేదోక్తమంత్రములచేఁగాని పురాణోక్తమంత్రంబు లచేఁగాని తిలాజ్యహోమంబు నష్టోత్తరసహస్ర సంఖ్యచే నైనను, నూటయెనిమిదిమాఱు లైనను హోమంబు గావించి తర్వాతఁ బునఃపూజఁ గావించి, యాకలశవస్త్రప్రతిమాదులను ఋత్విక్కులకొసఁగి, యాచార్యుని స్వర్ణాంగుళీయకదానాదు లచే సంతుష్టునిం గావించి, యేడు గోదానంబులు గావించి, తర్వాత నాచార్యుని, ఋత్విక్కులను షడ్రసోపేతంబులైన భక్ష్య భోజ్యాదులచే సంతృప్తులం గావించి, వారికి దక్షిణాతాంబూ లాదులనిచ్చి యావల విప్రోత్తములకు భోజనంబులును ప్రడ్డి

శ్రీ ర స్తు

# వ్రతరత్నాకరము

## మథనద్వాదశీవ్రతము.



శుభేశోభనే ముహూర్తే—ఏవంగుణవిశేషణవిశిష్టాయాం శుభతిథౌ మథనద్వాదశ్యాం తులసీ దేవతాపూజనం కరిష్యే ఇతి సంకల్ప్య. కలశపూజాం అనంతరం గణాధిపతి పూజాం తులసీదేవతా ప్రాణ ప్రతిష్ఠాపనం చ కృత్వా తతః తులసీదేవతాం పూజయేత్.

తులస్యమృతజన్మాసి సదా త్వం కేశవప్రియే,
కేశవార్చనయోగ్యే మే వరదా భవ సర్వదా.

తులసీదేవీం ధ్యాయామి.

కృష్ణానందాశ్రుసంభూతే వరదే తులసి స్వయం,
త్వామద్యావాహయామ్యద్య కమలాపతివల్లభే.

శ్రీతులసీదేవీమావాహయామి.

అనేకహారసంయుక్తం సువర్ణ మణిసంయుతం,
రత్నసింహాసనం దివ్యం ప్రీత్యర్థం ప్రతిగృహ్యతామ్.

శ్రీతులసీదేవ్యై రత్నసింహాసనం సమర్పయామి.

క్షీరోదధిసముత్పన్నే దేవాసురసుపూజితే,
విష్ణుప్రియే మయా దత్తం గృహాణార్ఘ్యం నమోఽస్తు తే.

శ్రీతులసీదేవ్యై అర్ఘ్యం సమర్పయామి.

పద్మనాభప్రియే దేవి పాద్యమేతన్మయార్పితం,
సంగృహాణ శుభే శ్యామే వరదే లోకపావని.

శ్రీతు......పాద్యమ్.

ఏలాలవఙ్గకర్పూరచన్దనాద్యైః సువాసితం,
పానీయం తు మయాఽనీతం సమ్యగాచమనీయకమ్

శ్రీతు......ఆచమనీయమ్.

క్షీరాజ్యేక్షురసైః పుణ్యైర్దధ్నా చ మధునా తథా,
పఞ్చామృతైః స్నాపయిష్యే తులస్యై తే నమోనమః.

*శ్రీతు......పఞ్చామృతస్నానమ్.

సుశీతలం సుప్రసన్నం సర్వౌషధిసమన్వితం,
మయాఽఽహృతం జలం దేవి స్నానం కురు హరిప్రియే.

ఆపోహిష్ఠామయోభువః;......చనః.

శ్రీతులసీ......శుద్ధోదకస్నానమ్.

పీతవస్త్రయుగం దేవి సర్వాభీష్టప్రదాయిని,
సర్వలక్షణసమ్పన్నే శుభే తే ప్రదదామ్యహమ్.

శ్రీతులసీదేవ్యై వస్త్రయుగ్మమ్.

కఞ్చుకం కాఞ్చనం దివ్యం బ్రహ్మణా నిర్మితం పురా,
అహం దాస్యామి దేవేశి విష్ణుపత్ని నమోఽస్తు తే.

శ్రీతు......వ్యై కఞ్చుకాభరణమ్.

---

* పంచామృతమంత్రము వ్రతరత్నాకరము మొదటిభాగము వినాయకవ్రతమునందుఁ జూడవలెను.

స్వచ్ఛం నిర్మలముక్తాఢ్యం పురస్తాత్ కృతం శుభం,
కంఠసూత్రం గృహాణ త్వం మహాభాగ్యప్రదాయిని.

శ్రీతు...స్యై ఆభరణాని.

చన్దనాగరుకర్పూరకస్తూరీనాభిసమన్వితం,
గన్ధం గృహాణ దేవేశి దేవదేవాంగభూషణే.

శ్రీతు...స్యై గంధమ్.

శాలీయాంస్తణ్డులాన్ శుభ్రాన్ హరిద్రామిశ్రితాన్ శుభాన్,
అక్షతాంస్సర్వదే సుభద్రం గృహాణ శ్రీహరిప్రియే.

శ్రీతు...స్యై అక్షతాన్.

మయా దత్తమిదం పుష్పం తులసీదళసంయుతం,
మాల్యం గృహాణ దేవేశి వరదే విష్ణువల్లభే.

శ్రీతు...స్యై పుష్పాణి పూజయామి.

అథాంగపూజా.

పూజయామి అని ప్రతినామముకడను జేర్పవలెను.

తులస్యై నమః గుల్ఫౌ
విష్ణుప్రియాయై నమః పాదౌ
రంభోర్వై నమః ఊరూ
క్షీరాబ్ధితనయాయై నమః కటిం
సకలసురపూజ్యాయై నమః నాభిం
ఇందిరాయై నమః ఉదరం.
బృన్దావనవాసిన్యై నమః వక్షః
మహాలక్ష్మ్యై నమః స్తనౌ.
సుభుజాయై నమః భుజౌ.
పద్మహస్తాయై నమః హస్తౌ.
సుముఖాయై నమః ముఖం.
రమాయై నమః లలాటం.
ఇన్దుసోదర్యై నమః శిరః.
తులస్యై నమః సర్వాణ్యంగాని

తతః శ్రీమహావిష్ణుపూజాం కృత్వా పుష్పైరర్చయేత్.

చందనాగరుకర్పూరఘృతగుగ్గులుసంయుతం,
గృహాణ ధూపం తులసి వన్దేఽహం భక్తవత్సలే.
శ్రీతుల...వై ధూపమాఘ్రాపయామి.
ఘృతవర్తిషు దీప్తం తే మయాఽర్పితమిదం శుభే,
గృహాణ మంగళం దీపం సర్వైశ్వర్యప్రదాయిని.
శ్రీతు...వై దీపం దర్శయామి.
క్షీరం చ గుడసంయుక్తం సర్పిషా యుతమాదరాత్,
మయా నివేదితం భుక్త్వా పక్ష్యభక్ష్యసమన్వితమ్.
శ్రీతు...వై నైవేద్యం సమర్పయామి.
పూగీఫలైశ్చ కర్పూరైర్నాగవల్లీదళైర్యుతం,
తాంబూలం గృహ్యతాం దేవి వరదా భవ శోభనే.
శ్రీతుల...వై తాంబూలమ్.
వ్రతపూర్తిమహాకీర్తిదివ్యసూర్తిం హరిప్రియే,
ప్రాప్తుకామ ఇదం దేవి సౌవర్ణం పుష్పమర్పయే.
శ్రీతు...వై సువర్ణపుష్పమ్.
పద్మనాభప్రియే నిత్యం పద్మసద్మనపూజితే,
పద్మపత్రవిశాలాక్షి వరదా భవ మే సదా.
శ్రీతు...వై నీరాజనమ్.
సర్వమంగళమాంగల్యే శివే సర్వార్థసాధకే,
శరణ్యే త్ర్యంబకే దేవి నారాయణి నమోఽస్తు తే.
శ్రీతుల...వై మంత్రపుష్పం సమర్పయామి
యాని కాని చేతి ప్రదక్షిణామ్.

నమస్కరోమి దేవి త్వాం విష్ణువక్షఃస్థలే స్థితాం,
ప్రణతార్తిహరే నిత్యమభీష్టఫలదా భవ.

శ్రీతు...స్యై నమస్కారాన్.

యస్య...భక్తిహీనం తులసీదేవి. యత్పూజితం మయా దేవి పరిపూర్ణం తదస్తు తే అనయా కల్పోక్తప్రకారేణ కృతయా పూజయా తులసీదేవీ సుప్రీతా సుప్రసన్నా వరదా భవతు. మయా ఆచరితస్య వ్రతస్య ఫలసిద్ధిరస్తు.

ఇతి పూజావిధానమ్.

---

## మథనద్వాదశీ వ్రతకథా.

శ్రీకృష్ణఉవాచ.—నారదాశేషధర్మజ్ఞ లోకానాం హితకారణ, కథయస్వ మహాభాగ వ్రతం దేవర్షిసత్తమ ౧. నారద ఉవాచ వ్రతానాముత్తమం పుణ్యం సర్వసౌభాగ్యకారణం, సర్వసంపత్ప్రదం శీఘ్రం పుత్రపౌత్రప్రవర్ధనమ్ ౨. [illegible] మాసి సితే పక్షే హ్యేకాదశ్యాముపోషితః, తులసీం చ సమభ్యర్చ్య పూజయిత్వా సమాహితః. ౩. పంచ పద్మాన్యలంకృత్య పంచ దీపాన్ ప్రకల్పయేత్, గంధాద్యైశ్చ తథా నైవేద్యతాంబూలాని సమర్పయేత్. ౪. ప్రదక్షిణనమస్కారాన్ పంచ పంచ ప్రకల్పయేత్, తదాదిమాసపర్యన్తం ప్రత్యహం చ సమాచరేత్. ౫. ఊర్జే మాసి సితే పక్షే హ్యేకాదశ్యాముపోషితః, పూర్వవత్తులసీపూజాం కృత్వా నియమపూర్వకమ్ ౬. రాత్రౌ జాగరణం కుర్యాదధశ్శాయీ జితేంద్రియః, తతః ప్రభాతవేళాయాం స్నాత్వా శుచిరలంకృతః. ౭. కుడపేన తు పిష్టేన కారయేత్పిష్టకత్రయం, ఏకం తులస్యై దత్వా తు బ్రాహ్మణాయైక

మేవచ. ౮. ఉలూఖలేఽన్యత్సంస్థాప్య చేతుమూలేన ఘట్ట
యేత్, యావన్తః క్షీరపృషతః స్వశరీరే పతన్తి హి. ౯. తావ
న్త్యబ్దసహస్రాణి స్వర్గే లోకే మహీయతే. శ్రీకృష్ణః. పూర్వ
మాచరితం కైస్తు వ్రతమేతత్ఫలైషిభిః. ౧౦. తద్వ్రతాచరణా
త్కిం వై ఫలం ప్రాప్తం మహామునే. నారదః. పురా కశ్చిన్మ
హాతేజా బ్రాహ్మణోఽభూన్మహాప్రభో. ౧౧. వేదశాస్త్రార్థ
తత్త్వజ్ఞో దేవదత్త ఇతి స్మృతః, స కదాచిద్ద్విజశ్రేష్ఠో విచి
న్త్యాస్మీత్యపుత్త్రకః ౧౨. ఆరాధయామి దేవేశం విష్ణుం త్రై
లోక్యపావనం, ఇతి సంచిన్త్య మనసా తపశ్చక్రే సుదుర్లభమ్.
౧౩. వృద్ధబ్రాహ్మణరూపేణ ప్రాదుర్భూత్వా తదన్తికే, తప
శ్చరన్తం తం దృష్ట్వా జిష్ణుః ప్రాహ మహావిభుః. ౧౪. కిమర్థం
కృతవానాశ్చర్యం తపో వద సువ్రత ద్విజ, శ్రుత్వా తద్వాక్యమ
చిరాత్ప్రణమ్య శిరసా హరిమ్. ౧౫. దేవదేవ జగన్నాథ త్రాహి
మాం పురుషోత్తమ, అద్య మే సఫలం జన్మ త్వత్పాదాంభోజ
దర్శనాత్. ౧౬. మదీప్సితం చ సఫలం భవిష్యతి న సంశయః,
అపుత్త్రోఽహం మహాదుఃఖీ శరణం త్వాం వ్రజామ్యహమ్. ౧౭.
పుత్త్రం దేహి మహాదేవ సర్వలోకవరప్రద. నారాయణ ఉవాచ.
ఆయుర్హీనం సుతం వాపి సుతాం వా మృతభర్తృకామ్. ౧౮.
తయోరేకం వృణీష్వాథ దదామి తవ సువ్రత, దేవదత్త ఉవా
చ. స్వగృహం ప్రాప్య భార్యాయా ఏతాం వార్త్తాం నివేద్యచ.
౧౯. ఉభయోరేకమిచ్ఛామి హ్యాగమిష్యామి కేశవ, ఇతి
ప్రణమ్య శిరసా జగామ స్వగృహం ప్రతి. ౨౦. నివేద్యసమ్య
గ్భార్యాయై బహుధాఽఽలోచ్య చిన్తితః, భార్యోవాచ.
సుతాం హి యాచ్యా భోః స్వామిన్ భర్తృహీనాపి చ త్వ

యా. ౨౧. తథేత్యుక్త్వా స విప్రేన్ద్రః పున స్తీరం ప్రవిశ్య చ, నారాయణ నమ స్తేఽస్తు పుత్రికాం దాతుమర్హసి. ౨౨. తథేత్యుక్త్వా మహావిష్ణు ర న్తర్ధానం యయౌ తదా, అదృష్ట్వా తం మహావిప్రః పశ్చాత్స్వగృహమాగతః ౨౩. కించిత్కాలే వ్యతీతే తు పుత్రీ జాతాస్య వై శుభా, సర్వలక్షణసమ్పన్నా సర్వరోగవివర్జితా. ౨౪. పితుర్గృహేతు సా కన్యా వర్ధితా చ సురూపిణీ, తతః కాలేతు సమ్ప్రాప్తే వివాహమకరోత్పితా. ౨౫. జన్మాన్తర కృతాత్పాపా త్సా జాతా మృతభర్తృకా, జననీజనకౌ తస్యా స్తతః స్వర్గమవాపతుః ౨౬. తద్గృహే విధవా సాపి సర్వధర్మవివర్జితా, నాస్తి నారాయణేత్యుక్తిం వద న్తీ మృతభర్తృకా. ౨౭. అతిథిం నార్చయత్యేవ నదాపి స్వగృహాగతం, ఏవం కఠినచిత్తా సా స్థితా నిష్ఠురభాషిణీ. ౨౮. శశ్వదుచ్చార్యతే సాధ్వ్యై మన్నామాధవయా తయా, ఇతి తుష్టో హృషీకేశో ద్విజో భూత్వా సమాగతః. ౨౯. తాము యాచత విష్ణుశ్చతద్వచస్సాబ్రవీత్పునః, కాలోఽపన్నాసతిథీకా కిమర్థముపమన్యసే. ౩౦. ఇతి బ్రువాణం తం విష్ణుం రుషా లేపాంశుకం దదౌ, తన్మధ్యే చాఢకం బీజం దృష్ట్వా హరిరహాపయత్. ౩౧. మృతా కాలేన సా కీటో భూత్వా తత్పర్ణభుక్ స్థితా. తతః కదాచిత్తాం స్మృత్వా దేవీం హరిరువాచ హ. ౩౨. ద్రష్టుం యాస్యామి హే దేవి ఏహి నారాయణాభిధాం, ఇత్యుక్త్వాఽథ గతే విష్ణౌ సహ తేన రమా యయౌ. ౩౩. ఆగత్య కిం సుభద్రం తే హరిరిత్యన్వయుఙ్క్త తాం, కీటఉవాచ. ఏవం తిష్ఠామ్యహం దేవ ప్రసీద జగదీశ్వర. ౩౪. ఇతి ప్రణమ్య శిరసా కీటస్తూష్ణీం స్థిత స్తదా, దేవ్యువాచ. కిమర్థమేషా

కీటోఽభూ ద్దేవదేవ వదస్వ మే. ౩౫. ఇతి పృష్టస్తయా విష్ణు స్తస్య వృత్తాన్తమువాచత, తచ్ఛ్రుత్వా కమలా దేవీ తన్మోక్షం చాప్యపృచ్ఛత. ౩౬. శ్రీభగవానువాచ. ఊర్జే మాసి సితే పక్షే ద్వాదశ్యామస్తి యద్వ్రతం, తద్వ్రతస్య ఫలం కించిద్దాతుమర్హసి శోభనే. ౩౭. ఇక్షుబిన్దుఫలేనైన ముచ్యతే పాపబంధనాత్, తథేతి శ్రీర్దదౌ తస్మై కీటోఽపి స్త్రీత్వమాప హి. ౩౮. స్త్రీఉవాచ. అద్య మే సఫలం జన్మ జీవితం చ సుజీవితం, వ్రతాని సఫలాన్యద్య భవత్పాదాబ్జదర్శనాత్. ౩౯. ఇతి స్తుత్వాఽథ సా నారీ శ్రియం ప్రాహ ముదా యుతా, అహమేతద్వ్రతం దేవి కరిష్యామి వదస్వ మే. ౪౦. దేవ్యువాచ కార్త్తికే చ సితే పక్షే హ్యేకాదశ్యాముపోష్యచ. తులసీం పూజయిత్వాఽథ ఇక్షుదణ్డైశ్చ చూర్ణకైః ౪౧. ఇక్షుదణ్డైరలఙ్కృత్య ధూపదీపాదిభిః క్రమాత్, రాత్రౌ జాగరణం కృత్వా పురాణపఠనాదిభిః ౪౨. తతః ప్రభాతవేళాయాం స్నాత్వా ధృత్వామ్బరం శుచిః, తులసీం పూజయిత్వాజ్య కృత్వా హ్యపూపకత్రయమ్. ౪౩. ఏకం తులస్యా ఏకం తు బ్రాహ్మణాయ నివేదయేత్, అవశిష్టం తు యచ్చైకం నిధాయోలూఖలే పచేత్. ౪౪. ప్రోక్తేష్వేషు ముహూర్తేషు నారీ సా హాన్యా త్వత్సర్వాజ్ఞనాన్వితా, కీర్త్తనీయా మహావిష్ణోః కథాస్తల్లగ్నచేతసా. ౪౫. షడ్రసోపేతమన్నం చ దద్యాద్దక్షిణయా సహ, స్వయం చాపి హి భుంజీయాదిష్టకామార్థసిద్ధయే. ౪౬. ఏవం ఇక్ష్వాబ్దపర్యన్తమాచరేత్సుసమాహితః, ఆదావన్తేచ మధ్యేచ కుర్యాదుద్యాపనం ముదా. ౪౭. లక్ష్మీవిష్ణ్వోశ్చ

ప్రతిమే కుర్యాచ్ఛక్త్యనుసారతః, గోమయేనానులిప్యాథ రఙ్గ వల్లీం ప్రకల్పయేత్. ౪౮. తన్మధ్యే పంచ కుడపాన్ సంస్థాప్య శ్వేతతణ్డులాన్, నిక్షిప్య ప్రతిమాయుగ్మం తత్ర నారాయణం రమామ్. ౪౯. లక్ష్మీనారాయణం దేవం పూజయేచ్ఛక్తిపూర్వకమ్. అఖండితం నవం వస్త్రమేకైకస్య పృథక్ పృథక్. ౫౦. గన్ధపుష్పాక్షతైర్ధూపైర్దీపైర్నైవేద్యసంయుతైః, నానావిధోపచారైశ్చ పూజయిత్వా యథావిధి ౫౧. ప్రదక్షిణప్రణామాంశ్చ పంచ పంచ క్రమేణ తు, రాత్రౌ జాగరణం కుర్యాత్పురాణశ్రవణాదిభిః ౫౨. తతః ప్రభాతవేళాయాం నద్యాం స్నాత్వా సమాహితః, గృహమాగత్య మేధావీ పునః పూజాం సమాచరేత్. ౫౩. ఏవంకృత్వా విధిజ్ఞాయ ఆచార్యాయ కుటుంబినే, సుశీలాయ సుశాన్తాయ ప్రతిమాదానమాచరేత్. ౫౪. సువాసినీద్వయం పంచదశ బ్రాహ్మణసత్తమాన్, కృత్వా తుష్టాన్ భోజనాద్యైర్వస్త్రాద్యైశ్చ విశేషతః ౫౫. బ్రాహ్మణాన్భోజయేత్పశ్చాత్స్వయం భుంజీత బంధుభిః, ఏవం శక్త్యనుసారేణ విత్తశాఠ్యం న కారయేత్. ౫౬. నోద్యాపయేద్వ్రతం యాతు పునఃకీటా భవిష్యతి, ఏవమాచరితం హ్యేతత్సర్వాభీష్టప్రదం వ్రతమ్. ౫౭. తేషాం భుక్తిశ్చ ముక్తిశ్చ భవత్యత్ర న సంశయః, ఇత్యుక్త్వాऽథ మహాలక్ష్మీరన్తర్ధానం యయౌ తదా. ౫౮. ఏవం క్రమేణ సా కన్యా కృత్వా వ్రతమనుత్తమం, ఇహ భుక్త్వాధికసుఖమన్తే స్వర్గం జగామ హి. ౫౯. యే పఠన్తీదమాఖ్యానం శృణ్వన్తి శ్రద్ధయాన్వితాః, తే సర్వే పాపనిర్ముక్తా యాస్యన్తి పరమాం గతిమ్. ౬౦

ఇతి భవిష్యోత్తరపురాణే మదనద్వాదశీవ్రతకథా సంపూర్ణా.

---

## కథాప్రారంభము.

సూతపౌరాణికుండు శౌనకాదిమహర్షులం జూచి మీా కొక్క వ్రతంబు చెప్పెద వినుండని యిట్లనెను. తొల్లి యొక ప్పుడు శ్రీకృష్ణుండు సత్యభామతోడ వనవిహారంబు సల్పు టకై బృందావనంబునకు వేంచేసియుండఁగా, అట్టి యెడ నారదుండు శ్రీకృష్ణమూర్తిదర్శనము చేయుటకై యచ్చటికి వచ్చెను. అప్పుడా కృష్ణుండు నారదమహాముని నర్ఘ్యపాద్యాది సత్క్రియలచే గౌరవించి; తగిన పీఠమునందుఁ గూర్చుండఁజేసి, "మునీంద్రా! మీారు త్రిలోకసంచారులు. సకలధర్మముల నెఱింగినవారు. లోకంబునకు హితంబుచేయువారలు. కావున మీారొక్కవ్రతోత్తమంబు నా కెఱింగింప వేఁడెదను" అని యడుగఁగా, నారదుఁ డిట్లనియె. ఓయశోదానందనా, నే నిప్పుడు బ్రహ్మలోకంబునుండి వచ్చుచున్నాను. బ్రహ్మదేవుఁడు సరస్వతీదేవి కానతిచ్చిన యొకవ్రతంబు నీ కెఱింగించెద నాల కింపుము. ఆవ్రతంబు వ్రతంబులలో నుత్తమంబు; ఆవ్రతం బాచరించువారికి పుత్రపౌత్రాదులును, సకలసంపదలును గలు గును. ఆవ్రతంబును జేయవలసినవిధానంబు చెప్పెద నాలకిం పుము. ఆశ్వయుజ శుక్లపక్షైకాదశినాఁ డుపవాసంబొనర్చి, తులసికోటనుండుగా నైదుపద్మములు ముగ్గులువెట్టి, యైదు దీపములు వెలిఁగించి, యచ్చట తులసిదేవిని మహావిష్ణుసమేత ముగా నారాధించి, గంధపుష్పాక్షతలతోఁ బూజించి, యైదు విధములయిన భక్ష్యఫలాదులను నివేదనచేసి, యైదుతాంబూ లము లిచ్చి, యయిదుప్రదక్షిణములను, అయిదునమస్కారంబు లను జేయవలయును. ఇట్లు, ఆశ్వయుజశుద్ధఏకాదశి మొదలు

కార్తికశుద్ధ ఏకాదశి పఱకుఁ బూజచేయుచుండి, ఆ యేకాదశి నాఁడు ఉపవాసముచేసి, మొదటఁ బూజచేసినట్లే సంకల్పోక్త నియమములతో, తులసీదేవీపూజను విష్ణుమూర్తిపూజను గావించి, చాఁప మొదలైనవి పఱచుకొనక నేలమీఁదఁ బరుండి, రాత్రి జాగరణము చేయవలయును. మఱునాఁడు ద్వాదశినాఁ డుదయంబున లేచి, స్నానమాచరించి, శుభ్రవస్త్రములు ధరించి, యథాభరణాలంకృతులై, యొకమానెఁడు బియ్యపుఁబిండితో మూఁడుపిష్టకములు (పిండిముద్దలు) చేసి, యొకటి తులసీదేవికి నివేదనచేసి, మఱియొకటి బ్రాహ్మణునికి వాయనమొసఁగి, మఱి యొక్కటి రోటిలోనుంచి, పాలుపోసి చెఱకుగడలతో దంచవలెను. అట్లు దంచునప్పుడు పాలచుక్కలెన్ని తన దేహమునఁ బడుచున్నవో, యన్ని వేలయేండ్లు స్వర్గలోకంబునఁ బూజింపఁ బడుచున్నాఁడు. అని నారదుండు చెప్పఁగా, శ్రీకృష్ణుఁడు మునీంద్రా! ఆవ్రతంబు నెవ్వ రాచరించిరి? ఆవ్రతంబు చేయుటచే వారికెట్టిఫలంబుగలిగెను? అనియడుగఁగా నారదుఁ డిట్లనియె. ఓ మహాప్రభూ! పూర్వము దేవదత్తుఁ డను పేరు గల యొక బ్రాహ్మణుం డుండెను. అతఁడు బ్రహ్మతేజస్సుగల వాఁడు. వేదవేదాంగములు జదివి వానియర్థము నెఱింగిన వాఁడు. ఆబ్రాహ్మణుఁడు సంతతిలేమిచే "నేను సంతతిహీనుఁ డయియున్నాను. కావున జగన్నాథుండగు విష్ణుమూర్తిని భజించెదను" అని మనమునఁ దలపోసి, సామాన్యజనులచేఁ జేయ వలనికాని తపంబొనరించెను. అప్పుడు విష్ణుమూర్తి యతని తపస్సునకు మెచ్చి, ముసలిబ్రాహ్మణరూపముతో నా దేవదత్తుని ముందఱ నిలిచి, "ఓ బ్రాహ్మణోత్తమా! యేల యిట్టియుగ్ర తపంబు నేయుచున్నా"వని యడుగఁగా, ఆబ్రాహ్మణోత్తముఁడు

వెంటనే విష్ణుమూర్తికి వందనముఁజేసి, "ఓదేవదేవా! ఓజగన్నాథా!! ఓపురుషోత్తమా!!! నన్నుఁగావవే. తమపాదారవిందముల దర్శనముచే నాజన్మము పావనంబయ్యె. ఇఁక నా మనోరథంబు సిద్ధింపఁగలదని నేను నమ్మెద"నని యనేకవిధంబుల విష్ణుమూర్తిం బొగడఁగా, అంత విష్ణుమూర్తి తన్ననేకవిధంబుల నుతించుచున్న యాబ్రాహ్మణోత్తముం జూచి, "ఓవిప్రోత్తమా! నీకేవరంబు గావలయును వేఁడు" మనిన నాద్విజశ్రేష్ఠుండు "దేవదేవా! నాకు సంతతిలేదు 'అపుత్రస్య గతిర్నాస్తి' యని ధర్మశాస్త్రము లఘోషించుచున్నవి గావున, నాకట్టి హీనగతి లేకుండునట్లు, పుత్త్రుండు గలుగునట్లు వరం"బిమ్మని యడిగెను.

అంతట శ్రీమన్నారాయణుండు బ్రాహ్మణునిం జూచి, "విధి యొక్కరిని దప్పింప వీలుగాదు. నీకు ఆయుస్సులేని కొమరుండు గలుగవలయునా? లేక బాల్యముననె వైధవ్యమును జెందు కొమరిత గావలయునా" యని యడిగెను. అందులకాబ్రాహ్మణుఁడు, "కేశవా! నేను నాయింటికేగి, ఈవిషయంబు నాభార్యకుఁ దెలియఁజెప్పి యావల విన్నవించెద" నని చెప్పి, తనయింటికి వెళ్లి యీసంగతి భార్యతోఁ జెప్పఁగా, ఆవిప్రుని యిల్లాలు "నాథా! ఆయుస్సు లేనిపుత్త్రునిఁ గోరుటకంటె విధవయగుకూఁతునుగోరుటయే మేలు! మనముండట నెద్దుమొద్దుగానైనఁ బడియుండును గదా!" అని చెప్పఁగా, బ్రాహ్మణుఁడు తన పత్నియొక్క యభిమతంబు గనుఁగొని, మరల దేవదేవుఁడయిన జగన్నాథుసన్నిధికేతెంచి విధవయయినను, కూఁతునే యిమ్మని వేఁడెను. విష్ణుమూర్తియు నట్లే యగుఁగాక యని యాబ్రాహ్మణుని కనుగ్రహించి, యంతర్ధానమయ్యెను. ఆబ్రాహ్మణునికిఁ

దర్వాతఁగొంత కాలమునకుఁ గుమార్తెగలిగెను ఆకన్యక సర్వ శుభలక్షణములతోఁగూడినదై, యారోగ్యవంతురాలై, శుక్ల పక్షచంద్రునిపగిది దినదినప్రవృద్ధురాలై యుండెను. ఆమెను వయసురాఁగా, నామె రూపలావణ్యాతిశయంబుచే మదనుని రాణియగు రతీదేవింబోలియుండెను. అట్టిసౌందర్యరాశియనఁ దగునాకన్యకు వివాహయోగ్యప్రాయంబు రాఁగానే యా బ్రాహ్మణుఁడాపెకు వివాహంబు గావించెను. అట్టియాబ్రాహ్మ ణునిపుత్రిక లావణ్యవతియయ్యు, పూర్వజన్మకృత దుష్కృత కర్మమువలన విధవ యాయెను. ఆపిల్లయొక్క తల్లిదండ్రులు మనోదుఃఖముచే శీఘ్రకాలముననే పరలోకంబు చెందిరి. తర్వాత, ఆవిధవయే యాయింటికిఁ బెద్దయై, యన్నిధర్మములను వదలిపెట్టి, తనయింటి కేయతిథి వచ్చి యేది యాచించినను, "లేదునారాయణ, లేదునారాయణ" అని చెప్పుచుఁ. గఠినచిత్తు రాలై, వచ్చినవారినందఱను బొమ్మనుటయే కాని, యెుక్కరికైనఁ బిడికెఁడు బియ్యమైనను బెట్టియెఱుఁగదు. అట్లుండఁగా, విష్ణు మూర్తి నారాయణ నారాయణ యని తననామము నుచ్చరించు చుండుటనందులకై, మనంబున సంతసించి, బ్రాహ్మణవేషముతో నావిధవయింటికి వచ్చి యుపాదానమడుగఁగా, ఆమె యందఱి కిను జెప్పినట్లె 'లేదు నారాయణ'అని యుత్తరమిచ్చెను. ఆపలు కులు విని విష్ణుమూర్తి మరల నావిధవతో ·'ఎందులకమ్మా! యీలాగుఇంటికివచ్చినవారినెల్ల నవమానించెదవు' అనఁగానే ఆవిధవ కోపము చేఁగన్నులెఱ్ఱఁజేసి, తానిల్లలుకుచు అల్కుచుఁ దనచేతనున్న పేడనీటితోనిండియున్న యలుకుచుట్ట నాబ్రాహ్మ ణునిమెుడిలో వేసెను.. తర్వాత నాబ్రాహ్మణరూపి యగువిష్ణువు వెలుపలికివచ్చి యాఅలుకుచుట్టను విదిలించిచూడఁగా దాని

యంవోకకందిగింజ యొక్కటి గాన్పించెను. శ్రీమహావిష్ణువు ఆ కందిగింజను మొలవవేయఁగా, అది మొలకయెత్తి చెట్టుగాఁ బెరిగియుండెను. తర్వాత, ఆవిధవ కొంతకాలమునకు మృతయై చీడపురుగై పుట్టి యాకందిచెట్టునందలియాకులం దినుచుండెను.

తర్వాతఁ గొంతకాలమునకు మహావిష్ణువు ఆవిధవ చీడపురుగై కందిచెట్టునందలియాకులం దినుచుండుటను జ్ఞప్తిదెచ్చుకొన్నవాఁడై, తనదేవేరింజూచి, ప్రియా! నారాయణయను చుండు నామెకడకుం బోదమని లక్ష్మీసమేతుఁడై వచ్చి యాకందిచెట్టున కీటకరూపమున నున్న యావిధవంజూచి, నేఁడుమితో నున్నావా? యని యడుగఁగా, జగదీశ్వరా! తమకుఁదెలియనిదేమియున్నది? నేనిచ్చట నీరీతినున్నానని చెప్పఁగా, లక్ష్మీదేవి నాథునిఁగాంచి, 'దేవదేవా! యేల యీవనితకుఁ జీడపురుగు జన్మమెత్తవలసివచ్చెను?' అని యడుగఁగా, లక్ష్మీదేవికి విష్ణుమూర్తి పూర్వజన్మవృత్తాంతము వినిపించెను. అట్లయిన నామె కెన్నఁడు జన్మమోక్షముగలుగునని మఱల లక్ష్మి విష్ణుమూర్తి నడుగఁగా, "ఓదేవీ! నీవు కార్తికశుద్ధ ద్వాదశినాఁడాచరించిన మథన (చిలుకు) ద్వాదశీవ్రతఫలంబిమ్ము. చెఱకుపాల బొట్టుపఁఘటవలని ఫలముచేతనే దీనికిముక్తిగలుగునని చెప్పెను. వెంటనే లక్ష్మియు నట్లె యామెకు మథనద్వాదశీఫలంబు నొసంగెను. ఆఫలప్రభావముచే నామె కీటకజన్మము విడిచి, స్త్రీ జన్మముధరియించెను. వెంటనే యాస్త్రీలక్ష్మీదేవితోఁడఁ దనముందట నిలుచున్న విష్ణుమూర్తిం గాంచి, వారిరువురకుఁ బ్రదక్షిణ నమస్కారములు గావించి, లక్ష్మీదేవింజూచి, "రాజగజ్జననీ, మీపాదదర్శనముచే నానోము లెల్ల ఫలించినవి. నాజన్మము పావనంబయ్యెను. ఈవ్రతంబు నాకుపదేశింపుము. నేనాచరించె

దను" అని యడుగఁగా, మహాలక్ష్మి యిట్లనియెను. కార్తీకశుక్ల పక్షైకాదశినాఁ డుపవాసముచేసి, తులసికోటమునందలి పంచ వన్నె ముగ్గులతో నైదుపద్మములు రంగవల్లులు దీర్చి తులసీదేవిని, శ్రీమహావిష్ణువును షోడశోపచారపూజలఁ బూజించి, రాత్రి జాగరణముచేసి, పురాణము మొదలగు వానిచేఁ గాలంబు పుచ్చి, మఱునాఁడు వేకువ స్నానమాచరించి [illegible], మరలఁ దులసీదేవికిని, విష్ణుమూర్తికిని పూజఁ గావించి, [illegible] పిండిముద్దలు చేసి, యొక్కటి తులసికి నైవేద్యము చేసి మఱియొక్కటి బ్రాహ్మణునకు వాయన మిచ్చి, మిగిలినయొక్కటి [illegible] చేసి పాలుపోసి చెఱకుగడలతోఁ బెక్కండ్రు ముత్తైదువలతోఁ గూడ పాటలుపాడుచు దంచవలెను. అట్లు దంచిన తర్వాత, బ్రాహ్మణులకును సుమంగలులకు దక్షిణతాంబూలములు మొదలగువాని నొసఁగి, షడ్రసోపేతమయినభోజనంబు బెట్టి పిదపఁ దానును భుజింపవలెను. "ఇట్లయిదువత్సరములు చేయుచు నోము మొదలుపెట్టునప్పుడు గాని, మధ్యఁగాని కడపటఁగాని యుద్యాపనము గావింపవలెను. వారివారి శక్తికొలఁది లక్ష్మీనారాయణుల ప్రతిమలను గావించి, యింటఁ బరిశుద్ధమగు నొకస్థలమునఁ బంచవర్ణపు ముగ్గులు పెట్టి, అందయిదుమానికల బియ్యమును పోసి, యందా లక్ష్మీనారాయణప్రతిమలనునిచి, ప్రాణప్రతిష్ఠను గావించి పూజచేసి నమస్కారములు గావింపవలెను. అట్లు పూజించి యా రాత్రి పురాణశ్రవణాదులచేఁ గాలముగడపి, మఱునాఁడుదయమున నదియందు స్నానముచేసి, యింటికివచ్చి పునఃపూజయొనరించి, శమదమాది సంపదగల సదాచారసంపన్నుఁడైన కుటుంబియైన తనపురోహితునకుఁ బ్రతిమాదానము చేయవలెను. తర్వాత ఇరువురు ముత్తయిదువులకును, పదునైదుగురు బ్రాహ్మ

ణోత్తములకును షడ్రసోపేతంబయిన భోజనంబులు పెట్టి వారిని వస్త్రభూషణ తాంబూలాదుల సంతోషపఱచి, తర్వాత బ్రాహ్మణసమారాధన మొనరించి, తానును దన బంధుజనులతోడ భుజింపవలయును. ఈవ్రతంబునకుఁ దన శక్తి వంచనసేయక యుద్యాపనంబు చేయవలెను. వ్రతోద్యాపనముచేయని యెడలఁ బురుగులై పుట్టుచున్నారు. విధిప్రకార మీవ్రతంబుచేయువా రిహపరంబులందు సకల సౌఖ్యములందుదురని లక్ష్మీదేవి వ్రతవిధానంబుఁ జెప్పి యంతర్ధానంబుఁ నొందెను. తర్వాత, ఆవనితయు మథనద్వాదశీ వ్రతం బొనర్చి యిహలోకంబున సకలసౌఖ్యముల ననుభవించి, పిదప విష్ణుసాయుజ్యము నొందెను. ఎవ రీవ్రతకథను జదువుచున్నారో, లేక వినుచున్నారో, వారు సకలపాపముల నుండి తొలఁగినవారై యుత్తములోకములను బొందుదురు.

ఇది మథనద్వాదశీవ్రతకథ
సంపూర్ణము.

---

# అమావాస్యాసోమవతీ వ్రతము.

---

ఆచమ్య దేశకాలౌ సంకీర్త్య. శుభే శోభనే...ఏవంగుణ విశేషణవిశిష్టాయామమాస్యాం శుభతిథౌ అహం సమస్తజన్మసు సౌభాగ్యసిద్ధ్యర్థం ఇహజన్మజన్మాంతరే చ సకలపాపక్షయార్థం పుత్రపౌత్రాద్యభివృద్ధ్యా సంతతిచిరజీవిత్వపరమసౌభాగ్య కామాఅస్యాంసోమవత్యామమాయాం బ్రహ్మావిష్ణుశివాత్మకాశ్వత్థవృక్షే యథామిలితోపచారైః లక్ష్మీనారాయణపూజాం కరిష్యే. తదాదౌ నిర్విఘ్నకామా గణపతిపూజాం కలశపూజాంచ కరిష్యే. ఇతిసంకల్ప్య. ఆదౌ కలశపూజాం కృత్వా గణపతి పూజాంకృత్వా, పీఠపూజాం ద్వారపూజాం చకృత్వా. అశ్వత్థ మూలే ఉదక సేచనం కృత్వా.

"అతో దేవాఅవన్తునఃయతో విష్ణుర్విచక్రమే, పృథివ్యా స్సప్తధామభిః"—

ఇతి మన్త్రేణ అశ్వత్థమూలేవిష్ణుం ధ్యాత్వా స్పృష్ట్వా పూజయేత్.

"అశ్వత్థే వో నిషదనం పర్ణే వోవసతిః కృతా, గోభాజ ఇత్కిలాసథయత్సనవథపూరుషమ్."

ఇతి మన్త్రేణ "మూలతో బ్రహ్మరూపాయ మధ్యతో విష్ణురూపిణే, అగ్రతః శివరూపాయ వృక్షరాజాయతే నమః."

ఇతి పురాణ మన్త్రేణ అశ్వత్థస్య షోడశోపచారాన్ కుర్యాత్.

ఇంద్రాదిసురసంసేవ్య యోగనిద్రాపరాయణ, లక్ష్మ్యా సహ సురశ్రేష్ఠ సుస్థిరో భవ సర్వదా. దేవదేవ మహాప్రాజ్ఞ లోకేశ సురపూజిత, యావత్పూజాం సమాప్యేఽహం తావత్త్వం సుస్థిరో భవ.

సర్వవ్యాపక విశ్వేశ కృపయా దీనవత్సల, మయోపపాదితాం పూజాం గృహాణేమాం హి మాధవ. (శరణం మే జగన్నాథ శరణం భక్తవత్సల, వరదో భవ హేనాథ కరుణాకర శాశ్వత) మూలాని బ్రహ్మణో యస్య ఋగ్వేదోఽంగాని పల్లవాః, ఫలాని యజ్ఞశాఖాశ్చ నారాయణ దయాం కురు. (ఓం నమో వాసుదేవాయ సత్యానన్దచిదాత్మనే, రత్నసింహాసనం తుభ్యం దాస్యామి స్వీకురు ప్రభో.) సూర్యకోటిప్రభానాథ సర్వవ్యాపిన్ రమాపతే, ఆసనం కల్పితం భక్త్యా గృహాణ పురుషోత్తమ. ఆసనమ్. నారాయణ జగద్వ్యాపిన్ జగదానంద కారక, విష్ణుక్రాన్తాది సంయుక్తం గృహ్ణా పాద్యం మయార్పితం, (గజవావాన సర్వజ్ఞసర్వలక్షణసంయుత, పాద్యంగృహాణ మద్దత్తం శ్రియా సహ సురోత్తమ) పాద్యమ్. ఫలగన్ధాక్షతైర్యుక్తం పుష్పపూగసమన్వితం, అర్ఘ్యం గృహాణ భగవన్ విష్ణో సర్వఫలప్రద. (పరిత్రాణపరానన్ద పద్మపత్రేక్షణ ప్రభో, గృహాణార్ఘ్యం మయా దత్తం కృష్ణ విష్ణో జనార్దన) అర్ఘ్యమ్. కర్పూరైలాలవఙ్గాదిశీతలం సలిలం విభో, రమారమణ దేవేశాచమనం ప్రతిగృహ్యతామ్ ఆచమనీయం. నమో నిత్యాయశుద్ధాయ యోగధ్యానపరాయణ, మధుపర్కంగృహాణేదం సర్వలోకైకనాయక. మధుపర్కమ్. పఞ్చామృతం మయానీతం పయో దధి ఘృతం మధు, శర్కరాదిసమాయుక్తం స్నానార్థం ప్రతిగృహ్యతామ్. సంస్నాపనం కరిష్యామి లక్ష్మీనారాయణప్రభో, స్నానేనానేన దేవేశ మమ పాపం వ్యపోహతు. పంచామృతస్నానమ్. గంగా కృష్ణా గౌతమీ చ కావేరీ చ శతద్రుదా, తాభ్య ఆనీతముదకం స్నానార్థం ప్రతిగృహ్య

తామ్. గంగోదకం సమానీతం సువర్ణ కలశస్థితం, స్నానార్థం మయా నీతం గృహాణ పరమేశ్వర. శుద్ధోదకస్నానమ్. (గంధాదిపూర్వపూజాం సమాప్య అభిషేకం కుర్యాత్ ) తతః. పీతవాసస్త్వయివిభో మయాన్యత్సముదాహృతం, వాసః ప్రీత్యా గృహాణేదం పురుషోత్తమ కేశవ. దేవదేవ జగన్నాథ నమః శ్రీవత్సధారిణే, వస్త్రయుగ్మం ప్రదాస్యామి సంగృహాణ జనార్దన. వస్త్రయుగ్మమ్. ఉపవీతం సోత్తరీయం మయా దత్తం సుశోభనం, విశ్వమూర్తే గృహాణేదం నారాయణ జగత్పతే. (లక్ష్మీశాయ నమస్తేఽస్తు త్రాహి మాం భవసాగరాత్, బ్రహ్మసూత్రం చోత్తరీయం గృహాణ ప్రార్థితో మయా యజ్ఞోపవీతమ్. అశ్వత్థహుతభుగ్వాస గోవిన్దస్య సదాశ్రయ, అశేషం హర మే పాపం వృక్షరాజ నమోఽస్తు తే. అలంకారాన్ సూత్ర వేష్టనమ్. మలయాచలసంభూతం ఘనసారం మనోహరం. విలేపనం సురశ్రేష్ఠ చందనం ప్రతిగృహ్యతామ్. కర్పూరాగురుకస్తూరీ కుఙ్కుమోన్మిశ్రచన్దనం, తుభ్యం దాస్యామి దేవేశ సంగృహాణ నమోఽస్తుతే.) గంధాన్. తండులాన్నార్ద్రికాన్ స్వచ్ఛాన్ మహాప్రీహిసముద్భవాన్, అక్షతాన్నర్పయే తుభ్యం గృహాణ పరమేశ్వర. అక్షతాన్. తులసీజాతికమలమల్లికాచంపకానిచ, పుష్పాణి హర గోవిన్ద గృహాణ పరమేశ్వర. (మాల్యాని చ సుగన్ధీని మాలత్యాదీనిచ ప్రభో, మయాఽహృతాని పూజార్థం గృహాణ కమలాధిప. నానావిధ పుష్పాణి

అథాంగపూజా.

"పూజయామి" అని కడపటఁ జేర్చుకొనవలెను.

నారాయణాయ నమః పాదౌ
కేశవాయ నమః గుల్ఫౌ
హరయే నమః జఙ్ఘే
సంకర్షణాయ నమః ఊరూ
వరాహాయ నమః కటిం
పద్మనాభాయ నమః నాభిం
దామోదరాయ నమః ఉదరం
కాలాత్మనే నమః స్తనౌ
రామాయ నమః స్కన్ధౌ
వైకుంఠాయ నమః కంఠం
అనిరుద్ధాయ నమః బాహూ
పరమేశ్వరాయ నమః హస్తౌ
దేవాదిదేవాయ నమః ముఖం
పుష్కరనేత్రాయ నమః నేత్రే
వాసుదేవాయ నమః శ్రోత్రే
సర్వవ్యాపినే నమః శిరః
సర్వేశ్వరాయ నమః సర్వాణ్యఙ్గాని పూజయామి.

అథ నామావళిః.

ఓం పరమాత్మనే నమః
పరమేశ్వరాయ
పరబ్రహ్మణే
విరిఞ్చయే
శివాయ
రుద్రాయ
నారాయణాయ
వనస్పతయే
వృక్షరాజాయ
వేదాత్మనే
ప్రకృతయే
దేవాత్మనే
త్రిమూర్త్యాత్మనే నమః
ఊర్ధ్వమూలాయ
ఛన్దఃపర్ణాయ
అవ్యయాయ
పాపఘ్నాయ
జ్ఞానవృక్షాయ
భూతవాసాయ
పుణ్యాయ
శివాకారాయ
మహామూలాయ
ఋషిసేవితాయ
తపఃఫలాయ

అగ్నిగర్భాయ నమః
అరణయే
సమిదాకరాయ
సూర్యాశ్వజాయ
విభూతయే
శమీపతయే
అశ్వత్థాయ
కేశవాయ
హరయే
సంకర్షణాయ
వరాహాయ
పద్మనాభాయ
దామోదరాయ నమః
కాలాత్మనే
వైకుంఠనాథాయ
అనిరుద్ధాయ
పరమేశ్వరాయ
దేవాదిదేవాయ
పుష్కరనేత్రాయ
వాసుదేవాయ
సర్వవ్యాపినే
సర్వేశ్వరాయ
అశ్వత్థనారాయణస్వామినే
నమః

నానావిధపరిమళపత్రపుష్పాణి సమర్పయామి

గుగ్గులం ఘృతసంయుక్తం నానాగంధైఃసుసంయుతం, ధూపం గృహాణ కృపయా సుప్రీతో వరదో భవ. ధూపమ్. అజ్ఞానదమనాయేతి జ్ఞానబుద్ధి ప్రదో భవ, వహ్నినా యోజితం దీపం గృహాణ పరయా ముదా దీపమ్. దివ్యాన్నం పత్రసోపేతం నానాభక్ష్యైశ్చ సంయుతం, మయా ప్రదత్తం నైవేద్యం సంగృహాణ శ్రియా సహ. భక్ష్యం భోజ్యం లేహ్యపేయేచోష్యం ఖాద్యం మయాహృతం, ప్రీతయే పరమేశస్య దత్తంమే స్వీకురు ప్రభో. నైవేద్యమ్. ప్రాణాయ స్వాహా అపానాయస్వాహా వ్యానాయ స్వాహా ఉదానాయ స్వాహా సమానాయ స్వాహా. గంగోదకం సమానీతం పానార్థం పరమం శివం, హృషీకేశ నమస్తుభ్యం గృహాణ పరయా ముదా. మధ్యేమధ్యేపా

నీయమ్ ఉత్తరాపోశనం హస్తప్రక్షాళనం, ముఖప్రక్షాళనం చ కరోద్వర్తనార్థే చందనమ్. ఇదం ఫలమితి ఫలాని. పూగీఫల మితితాంబూలమ్. హిరణ్యగర్భేతిదక్షిణామ్ త్వద్భాసా భాస తే లోకః కోటిసూర్యసమప్రభ, నీరాజయిష్యే త్వాం విష్ణో కృపాం కురు మయి ప్రభో, హిరణ్యపాత్రం మధోఃలిమంత్రే ణ చ నీరాజనమ్. శ్రీమతే సర్వభూతాత్మన్ త్రాహి మాం భవసాగరాత్, మధుసూదన దేవేశ గృహాణ కుసుమాఞ్జలిమ్. మంత్రపుష్పాఞ్జలిమ్. మయా కాయేన మనసా వాచా జన్మశతా ర్జితం, పాపం ప్రశమయ శ్రీశ ప్రదక్షిణపదేపదే. ప్రదక్షిణ త్రయం దేవ ప్రయత్నేన కృతం మయా, తేన పాపాని సర్వాణి నాశయాశు మమావ్యయ. ప్రదక్షిణమ్. వ్యక్తావ్యక్తస్వరూ పాయ సృష్టిస్థిత్యంతకారిణే, ఆదిమధ్యాన్తహీనాయ విష్టరశ్ర వసేనమః నమస్కరోమ్యహం భక్త్యా సర్వపాపహరావ్యయ, కు రు మే సఫలం జన్మత్వత్పాదామ్భోజవన్దనాత్. నమస్కారాన్. లక్షీశ సర్వలోకేశ సర్వసంపత్ప్రదోభవ, గృహాణార్ఘ్యం మ యా దత్తం కృపయా పరయా ముదా. ప్రసన్నార్ఘ్యమ్. దేవ దేవ జగన్నాథ సృష్టిసంహార కారక, శరణం త్వాం ప్రపన్నోఽ స్మి త్రాహి మాం పురుషోత్తమ. నిమగ్నోఽస్మి మహాఘోరే సంసారే దుఃఖసాగరే, మాముద్ధర హృషీకేశ భోభో భవభ యాపహ. ప్రార్థనా. అమాసోమపూజా. అమాయై చ నమస్తు భ్యం సోమాయ చ నమోస్తుతే, ఉభయోః సంగమే విష్ణుపూ జాఫలమవాప్నుయాత్. అమాయై సోమాయచ నమః సర్వో పచారార్థే గంధాక్షతపుష్పధూపదీపనైవేద్యాదీని సమర్ప యామి. అనేన మంత్రేణ షోడశోపచారైః పంచోపచారైర్వా

పూజయేత్. ఇత్యమాసోమపూజా. యస్యస్మృత్యాచ...పూజయా లక్ష్మీనారాయణౌ సుప్రీయేతామ్. అద్యపూర్వోక్త ఏవంగుణ విశిష్టాయామమాస్యాం శుభతిథౌ కల్పోక్త ఫలసిద్ధ్యర్థం అశ్వత్థమూలేఽముక ద్రవ్యేణ అష్టోత్తరశత ప్రదక్షిణాఖ్యం కర్మ కరిష్యే ఇతి సంకల్ప్య. మూలతో బ్రహ్మరూపాయ మధ్యతో విష్ణురూపిణే, అగ్రతః శివరూపాయ వృక్షరాజాయతే నమః ఇతిప్రతిప్రదక్షిణముచ్చరన్ ఉక్తద్రవ్యం ప్రతిప్రదక్షిణం వృక్షస్యాగ్రేస్థాప్య ఏవమష్టోత్తర ప్రదక్షిణాని కార్యాణి. తద్ద్రవ్యం బ్రాహ్మణాయ దద్యాత్. వాయనమంత్రః. అశ్వత్థః ప్రతిగృహ్ణాతు అశ్వత్థో వై దదాతి చ. అశ్వత్థః తారకోభాభ్యాం అశ్వత్థాయ నమోనమః అస్మై బ్రాహ్మణాయ శ్రీ లక్ష్మీనారాయణస్వరూపాయ ఇదం ద్రవ్యం అశ్వత్థనారాయణప్రీతిం కామయమానస్తుభ్యమహం సంప్రదదే న మమ. దేవస్య... గృహ్ణామి. ఇతి పూజావిధిః

అథ కథా.

శరతల్పగతం భీష్మముపగమ్య యుధిష్ఠిరః, కృతప్రణామో ధర్మాత్మా హితం వచనమబ్రవీత్. ౧. యుధిష్ఠిరః. హతేషు కురుముఖ్యేషు భీమసేనేన కోపినా, తథాఽపరేషు భూతేషు హతేషు యుధి జిష్ణునా. ౨ దుర్యోధనకుమన్త్రేణ జాతోఽస్మాకం కులక్షయః, న సన్తి భువి భూపాలా బాలవృద్ధాతురాన్నృతే. ౩. అవశిష్టా వయం పంచ వంశే భారతసంజ్ఞకే, ఏకాతపత్రమపిచ రాజ్యం మహ్యం న రోచతే. ౪. జీవితేఽపి జుగుప్సా స్యాన్మృతేనసుగతిః క్వచిత్, దష్ట్వా స న్తతివిచ్ఛేదం సంతాపోహృదయేఽనిశమ్. ౫. అశ్వత్థామాస్త్ర

నిర్ధగస్తూత్త రాగర్భసంభవః. అతో మే ద్విగుణం దుఃఖం
పిణ్డవిచ్ఛేదదర్శనాత్. ౬. కింకరోమి క్వ గచ్ఛామి పితామహ
వదాధునా, యేన సంపద్యతే సద్య స్సంతతి శ్చిరజీవినీ. ౭.
భీష్మః. శృణు రాజన్ ప్రవక్ష్యామి వ్రతానాముత్తమంవ్రతం,
యస్యానుష్ఠానమాత్రేణ సన్తతిశ్చిరజీవినీ. ౮. అమావాస్యా
యదా పార్థ సోమవారయుతా భవేత్, తస్యామశ్వత్థ
మాగత్య పూజయేచ్చ జనార్దనమ్ ౯. అష్టోత్తరశతం కుర్యా
త్తస్మిన్ వృక్షే ప్రదక్షిణాన్, తావత్సంఖ్యాన్యుపాదాయ
రత్నధాతుఫలానిచ. వ్రతరాజమిదం రాజన్ విష్ణోః ప్రీతికరం
శుభం, బ్రహ్మాదిలయకర్తారః ప్రసీదన్తి తదాత్మకాః ౧౦ మూ
ర్తిత్రయాత్మకోఽశ్వత్థః సర్వదేవమయస్తథా, పూజయా వేద
వృక్షస్య సర్వేష్టార్థా నవాప్నుయాత్. ౧౧ ఉత్తరాం కార
య ప్రాజ్ఞ గర్భో జీవితమాప్స్యతి, భవిష్యతి గుణైః పుత్ర
స్త్రిషులోకేషు విశ్రుతః. శ్రుత్వా పితామహప్రోక్తం ప్రత్యువా
చ యుధిష్ఠిరః. యుధిష్ఠిరః. తద్వ్రతం వ్రతరాజాఖ్యంవిస్తరేణ
ప్రకాశయ, కేన ప్రకాశితం మర్త్యే కేనేదం విహితంవిభో.
భీష్మః. అస్తి మాసర్వవిఖ్యాతా కాంచీసంజ్ఞా మహాపురీ రజతా
చలసంకాశ సౌధసంఘైర్విరాజితా, సువేషైర్నాగరజనైర్నారీ
భిరుపసేవితా. బ్రహ్మక్షత్రియ విట్ఛూద్రైః స్వస్వకర్మరతై
ర్వృతా, రూపచాతుర్యయుక్తాభి ర్వేశ్యాభిః సమలంకృతా.
అత్ర రాజా మహాసేనో బభూవామితవిక్రమః, తస్మిన్ వసతి
భూపాలే జనానన్దకరే శుభే. తస్య రాజ్యేఽవసద్విప్రః దేవ
స్వామీతి విశ్రుతః, తస్య స్త్రీ రూపసంపన్నా నామ్నా ధన
వతీ శుభా. యథార్థనామధేయా సా లక్ష్మీరివ సువిగ్రహా,

తస్యాం సంజనయామాస సప్తపుత్త్రాన్ గుణాన్వితాన్. ఏకాం దుహితరం రమ్యాం నామ్నా గుణవతీం నృప, కృతదారాశ్చ తే పుత్త్రా విహరన్తి యథాసుఖమ్. కన్యా కుమారికా చాసీ దనురూపప్రియార్థినీ, అత్రాన్తరే ద్విజః కశ్చిద్భిక్షార్థం సముపాగతః. దీప్యమానః స్వతేజోభి ర్మూర్తిమానివ పావకః, ద్వారదేశముపాగత్య ప్రయుయోజాశిషం తదా. దేవస్వామిస్స్నుషాస్సప్త సముత్థాయ ససమ్భ్రమం, భిక్షాం ప్రత్యేకమానిన్యుర్దదుస్తస్మై ద్విజన్మనే అవైధవ్యాశిషం ప్రాదాత్తాభ్యః సౌభాగ్యసంపదః, తతో గుణవతీమాత్రా ప్రహితా సహ భిక్షయా. విప్రాయ భిక్షాం ప్రదదౌ కృత్వా పాదాభివన్దనం, ఆశిషంచ దదౌ విప్రః శుభే ధర్మవతీభవ. సావై లక్ష్యంగుణవతీశ్రుత్వా గత్వా యయౌ గృహం, మాత్రే నివేదయామాసచాశిషం తేన యోజితామ్. శ్రుత్వాధనవతీపుత్త్రీం కరేధృత్వాసమాయయౌ, ప్రణతిం కారయామాస పునస్తస్మై ద్విజన్మనే, తథైవాశిషముచ్చార్య పునస్తా మభ్యనందయత్, శ్రుత్వాఽఽశిషం ధనవతీ సచింతా ప్రత్యువాచ హ. ధనవతీ. ప్రసీద భగవన్ విప్ర వచనం మేఽవధారయ, స్నుషాభ్యః ప్రణతాభ్యోమే త్వయా దత్తావరాశిషః. అవైధవ్యకరాః పుత్త్రసుఖసౌభాగ్యదాయకాః, సుతాయాం ప్రణతాయాం మే విపరీతం త్వయోదితం, భద్రేధర్మవతీ భూయా ఇత్యుదీర్య పునః పునః, ఆశీః ప్రయుక్తా విప్రర్షే కారణం వద సత్వరమ్. ధన్యాసి త్వం ధనవతి ప్రఖ్యాతచరితా భువి, యథాయోగ్యం ప్రయుక్తేయం మయాశీర్దుహితుస్తవ. ఇయం సప్తపదీమధ్యే వైధవ్యం సమవాప్స్యతి, ధర్మాచరణమత్యర్థం కర్తవ్యమనయా శుభే. అతో మయా

శీఘ్రత్తేయంశుభే ధర్మవతీ భవ, శ్రుత్వా ధనవతీవాక్యం చింతా కులితచేతనా. ఉవాచ వచనం దీనం ప్రణిపత్య పునఃపునః ధనవతీ. ఉపాయం వేత్సి విప్రేంద్ర వద శీఘ్రం దయాం కురు, అపాయం వేత్సి చేద్విప్ర కిం కరోమి దయానిధే. ద్విజః. యదాఽఽగతా భవేత్సోమా గృహే వై తవ సున్దరి, తస్యాః పూజనమాత్రేణ భవేద్వైధవ్యనాశనమ్ ధనవతీ, కా సా సోమా త్వయా ప్రోక్తా కా జాతిః కుత్ర సంస్థితిః. యస్యా ఆగమమాత్రేణ భవేద్వైధవ్యభంజనం, ఏతద్వద మహాభాగ సకలం విస్తరస్వమే. ద్విజః. సోమా సా రజకీ జాత్యా స్థితిస్తస్యాశ్చ సింహళే, సా చేదాయాతి తే వేశ్మ భవేద్వైధవ్యభఞ్జనం, ఇత్యుక్త్వా బ్రాహ్మణోఽన్యత్ర గతో భిక్షాప్రతీక్షయా, ధనవత్యపి పుత్రేభ్యః ప్రోవాచ వచనం తదా. ఇయం దుర్గలితా పుత్రాః స్వసా గుణవతీ శుభా, సోమాగమనమాత్రేణ భవేన్నైధవ్యభఞ్జనమ్. యస్యాస్తే భక్తిః పితరి మాతృవచనగౌరవం, స ప్రయాతు సహ స్వస్రా సోమాం మానయితుం ధ్రువమ్. పుత్రా ఊచుః. జ్ఞాతం మాత స్తవ స్వాన్తం పుత్రీస్నేహవశం గతమ్. యాత దేశాంతరం పుత్రాః ప్రఖ్యాపయసి దుర్గమం, అన్తరేదుస్తరస్సింధుః శతయోజన విస్తరః, అశక్యం గమనం తత్ర న క్షమా గమనే వయమ్. దేవస్వామ్యువాచ — అపుత్రస్సప్తభిః పుత్రైరహం యాస్యామి సింహళమ్. ఆనయిష్యామి తాం సోమాం పుత్రీవైధవ్యనాశినీమ్ ఏవం వాదిని సక్రోధే దేవస్వామిని తత్క్షణం, శివస్వామీ కనిష్ఠస్తు పుత్రః ప్రోవాచ సమ్మతః. తాత మా వద చైవం త్వం రోషావేశవశం గతః, మయి తిష్ఠతి కశ్శక్తోగస్తుం

ద్వీపం హి సింహళమ్. ఇత్యుక్త్వా సహసోత్థాయ ప్రణమ్య
శిరసా ముదా, ప్రతస్థే సహితః స్వస్రా ద్వీపం సింహళసంజ్ఞి
తమ్. స కియద్భిర్దినైర్గత్వా తీరం ప్రాప సరిత్పతేః, తద్గంతుమ
మ్బుధిం తత్ర ప్రయత్నమకరోద్ద్విజః. స దదర్శ సువిస్తీర్ణం
న్యగ్రోధద్రుమమన్తికే, తత్కోటరే సుఖాసీనా గృధ్రరాజస్య
బాలకాః. తత్పాదపతలే స్థిత్వా తాభ్యాం నీతం తు తద్దినం,
శాబకానాం కృతే గృధ్రో గృహీత్వా శిశుభోజనమ్ ప్రావా
న్న శాబకా గృధ్రాద్భోజనం జగృహుర్భృశం, పప్రచ్ఛ
బాలకాన్ గృధ్రశ్చిన్తాకులితమానసాన్ గృధ్ర ఉవాచ —
కథం న భుఞ్జతే పుత్రా భవన్తః క్షుధితా అపి, ఆనీతం కోమ
లం మాంసం భవద్భోగ్యమిదం మయా. ఏతద్వృక్షతలే తాత
మానవావత్ర తిష్ఠతః, అభుఞ్జతోస్తయోరద్య కథం భుంజామ
హే వయమ్. ఏతచ్ఛ్రుత్వా తు గృధ్రస్తు కరుణాహృష్టచేతసః,
తయోరన్తికమాగత్య వచనం సమభాషత. గృధ్రః—జాతస్తు
యువయోః కామో వక్తవ్యోఽత్ర మమ ద్విజ, క్రియతే సర్వథా
విప్ర భోజనం కర్తుమర్హసి. ద్విజ ఉవాచ—సింహళం గన్తుకా
మోఽహం జలధేః పారమద్య వై, సోమానయనమిచ్ఛామి స్వస్రు
వైధవ్యనాశనమ్. గృధ్రః. త్వామహం పారయిష్యామి జలధేః ప్ర
తరే సహి, సోమాగృహామపి బ్రహ్మన్ దర్శయిష్యామి సింహళే,
తతో రాత్ర్యాం వ్యతీతాయాముదితే చ దివాకరే. పారముత్తారి
తౌ తౌ తు గృధ్రరాజేన వేగినా, సింహళద్వీపమాగత్య స్థితౌ
సోమాగృహాన్తికే. తతః ప్రత్యూషసమయే సమ్మృజ్యాఙ్గణ
మణ్డలం, లేపనం చక్రతుస్తస్యా దివసే దివసే శుభమ్. ఏవం
విదధతోస్తత్ర పూర్ణస్సంవత్సరో గతః, స్నుషాః పుత్రాణ

సమాహూయ సోమా పప్రచ్ఛ విస్మితా. మార్జనం లేపనం కోఽత్ర కరోతి మమ కథ్యతే, ఏకశ్చైవాథ జగదుస్సర్వాః కృత్యమిదం హినః. తతః కదాచిద్రజకీ నిభృతా సంస్థితానిశి, దదర్శ బ్రాహ్మణీం కన్యాం మార్జయన్తీం గృహాఙ్గణమ్. లింపన్తమజ్కణం ప్రాప్తం ఖాతరం చ శుచివ్రతం, సోమా పప్రచ్ఛ తౌ గత్వా కౌ యువాం కథ్యతాం మమ. ఊచతుస్తౌ తదా సోమా మావాం బ్రాహ్మణపుత్రకౌ. సోమోవాచ— దగ్ధాస్మి! బత! నష్టాస్మి!! బ్రాహ్మణౌ గృహ మార్జకౌ. కాం గతిం బత యాస్యామి పాపాదస్మాదసంశయం, పాపజాతి రహం ఖ్యాతా రజకీ సర్వథా ద్విజ. కథం త్వం బ్రాహ్మణో భూత్వా విరుద్ధం మే చికీర్షసే, శివస్వామ్యువాచ—ఏషా గుణవతీ నామ్నా స్వసా మమ సుమధ్యమా. అస్యాః సప్తపదీ మధ్యే వైధవ్యం సంప్రపత్స్యతే, తవ సాన్నిధ్యమాత్రేణ భవేద్వైధవ్యభఞ్జనమ్ అతో హేతోః సహ స్వస్రా పాపకర్మ కరోమి తే సోమోవాచ—ఇతః పరం న కర్తవ్యమాయామి తవ శాసనాత్. ఇత్యుక్త్వా సా సమాగత్య స్నుషాభ్యః ప్రత్యువాచ హ, యః కశ్చిన్మమ గేహేఽస్మిన్ మ్రియతే మానవః క్వచిత్. తథైవ రక్షణీయోఽసౌ యావదాగమ్యతే మయా, కస్యచిద్వచనాత్కోఽపినైవ దాహ్యః కథంచన. తథేత్యుక్తా స్నుషాభి స్సా సోమా యాతా మహాంబుధిం, పారముత్తార యామాస క్షణేన ద్విజపుత్రకౌ. స్వయమాకాశమార్గేణ సోత్తతార మహార్ణవం, ప్రాప్తాః కాఞ్చీపురీం సర్వే నిమేషాత్తత్పరిభావతః. సోమాం దృష్ట్వా ధనవతీ హృష్టా పూజామథాకరోత్, అత్రాన్తరే శివస్వామీ తదా దేశాన్తరాత్స్వ

సుః, సదృశం వరమానేతుం జగామోజ్జయినీం ప్రతి, ఆని
నాయ వరం తత్ర దేవశర్మసుతం సుధీః. బ్రాహ్మణం రుద్రశ
ర్మాణం గుణినం సదృశం స్వసుః, తతః సా రజకీ సోమా
వైవాహికమథాకరోత్. సులగ్నే చ సునక్షత్రే దేవస్వామీ
తు కన్యకాం, దదౌ తస్మై గుణవతీం గుణినే రుద్రశర్మణే.
తతో వైవాహికైర్మన్త్రైర్ధ్యాయమానే హుతాశనే, తతః
సప్తపదీమధ్యే రుద్రశర్మా మృతస్తథా. రురుదుర్బాన్ధవాః స
ర్వే స్థితా సోమా నిరాకులా, ఆక్రన్దశ్చ మహానాసీల్లోకా
నాం తత్ర పశ్యతామ్ గుణవత్యై చ సా తూర్ణం వ్రతరాజ
ప్రభావజం, పుణ్యం సంకల్ప్య విధివద్దదౌ మృత్యువినాశనమ్.
రుద్రశర్మాపి తస్మాచ్చ వ్రతరాజప్రభావతః, ఆససాద తదా.
జీవం సుప్తవత్సహసోత్థితః. ఏవం వివాహం నిర్వర్త్య వ్రత
రాజం నివేద్య చ, ఆమన్త్ర్య తాం ధనవతీం సోమా ప్రాయా
ద్గృహం ప్రతి. ఏవం సా రజకీ సోమా జీవయిత్వా మృతం ద్వి
జమ్. చచాల హర్ష సంపూర్ణపూర్ణాకామా స్వరుద్దిశమ్, అత్రా
న్తరే గృహే తస్యాః ప్రథమం తనయామృతాః. పునస్స్వామీ
మృతస్తస్యా జామాతా చ తతో మృతః ఆగచ్ఛన్త్యాస్తదా
తస్యాః సోమవారాన్వితాతిథిః, అమావాస్యాబభూవాథ మృత
సంజీవినీ తిథిః సా దదర్శ జలోపాన్తే వృద్ధాం కాంచిత్ స్త్రి
యంతదా, తూలభారభరాక్రాంతాం క్రన్దమానాంసుదుఃఖితాం,
వృద్ధోవాచ. అవతారయ మే పుత్రి తూలభారం శిరః స్థితం,
ఏతద్భారభరాక్రాన్తాం క్రన్దమానాం సుదుఃఖితామ్ సోమో
వాచ. అమావాస్యాద్య హే వృద్ధే సోమవారయుతా తిథిః,
తూలకం న స్పృశామ్యద్య నియమోఽయం మయా కృతః.

పునర్దదర్శ యాన్తీం సా మూలభారవతీం స్త్రియం, సా చోవాచ తతః పుత్త్రి మూలభారో మహానితి. అవతీర్య్యక్షణం తిష్ఠ సజ్జే యాస్యామ్యహం తవ, అద్య మూలం తథా తూలం న స్పృశామి కదాచన. తతోఽశ్వత్థతరుం ప్రాప్య నదీతీరభవం శుభం, స్నాత్వా దేవం సమభ్యర్చ్య శర్కరాభిః ప్రదక్షిణాః. సా చకార మహాభాగా తత్రైవాష్టోత్తరం శతమ్. భీష్మః. యదా ప్రదక్షిణశతం కృతం శర్కరయా స్తయా. తదా జీవితవ స్తస్తేజామాతృపతిపుత్త్రకాః, నగరం శ్రీసమాకీర్ణం తద్గృహం చ విశేషతః. అథ యాతా మహాభాగా సోమా స్వభవనం ప్రతి, జీవితం వీక్ష్య భర్తారం పుత్త్రాన్ జామాతరం తథా. అభిజ్ఞాతాన్ సమాసాద్య జగామ కృతకృత్యతాం, ప్రణిపత్య స్నుషాః సర్వాః పప్రచ్ఛుస్తాం తపస్వినీమ్. మృతాస్తేతనయా దేవి పతిజామాతృ బాన్ధవాః, జీవితాస్తే కథంసోమే మృతాస్తే చ కథం వద. సోమోవాచ-గుణవత్త్యై మయాదత్తం వ్రతరాజస్య పుణ్యకం, మృతాస్తే తద్విపాకేన పతిజామాతృపుత్త్రకాః తూలకం న మయా స్పృష్టం మూలకంచ తథా స్నుషాః, అశ్వత్థే దేవమభ్యర్చ్య కృతాస్తత్ర ప్రదక్షిణాః. శర్కరాహస్తయా తత్ర కృతమష్టోత్తరం శతం, జీవితాస్తత్ప్రసాదేన హ్యద్య జామాతృ పుత్త్రకాః సర్వాభిః క్రియతా మద్య వ్రతరాజోవిధానతః, భవిష్యతి నవైధవ్యం సౌభాగ్యం సంభవిష్యతి. స్నుషాస్తాః కారయామాస తథా సోమా వ్రతేశ్వరం, భుక్త్వా భోగాన్బహూం స్తత్రపుత్త్రపౌత్త్రాదిభిస్సహ. తైశ్చస తైస్సహపరివృతావిష్ణులోకమవాపసా, ఇత్యేతత్కథితంపార్థవిస్తరేణమయాతవ. యుధిష్ఠిరః. మాహాత్మ్యంవ్రతరాజస్య కోవిధి

ర్వాద విస్తరాత్, కర్తవ్యం కేన భీష్మేదం నారీభిః పురుషేణ వా. అమావాస్యా యథా పార్థ సోమవారాన్వితా భవేత్, తదాపుణ్యతమః కాలో దేవానామపి దుర్లభః. ప్రాతరుత్థాయ విధినా స్నానం కార్యం జలాశయే, స్నాత్వా మౌనేన కౌశేయం పరిధాయ వ్రతీ తతః. గత్వా చాశ్వత్థవృక్షస్య సమీపం కురునన్దన, అశ్వత్థమూలే కర్తవ్యం విష్ణ్వాద్యమరపూజనమ్. వ్యక్తావ్యక్తస్వరూపాయ సృష్టిస్థిత్యన్తకారిణే, ఆదిమధ్యాన్తహీనాయ విష్టరశ్రవసే నమః ఇతివిష్ణుముఖాన్దేవానర్చయేద్విధిపూర్వకం, ఛన్దోమయే వృక్షరాజే సర్వే దేవాః సమాహితాః మూర్తిత్రయాత్మన్యశ్వత్థ నారాయణ సమాహ్వయే, పూజితే విశ్వరూపేఽసౌ పూజ్యతే భగవాన్ హరిః. అశ్వత్థేవో నిషదనం త్వారాత్తే అగ్నిరస్త్వితి. నమస్కృత్వా తేచోర్ధ్వమూలం తద్విష్ణుమన్త్రతః. ఆత్వావహన్తు దేవా వై బ్రహ్మజజ్ఞానమిత్యపి, పూజయేత్సర్వదేవాంశ్చ విష్ణు సర్వాత్మకం తథా మూలతో బ్రహ్మరూపాయ మధ్యతో విష్ణురూపిణే, అగ్రతః శివరూపాయ వృక్షరాజాయ తే నమః. ఏవం సంపూజ్య దేవేశం పీతవస్త్రాక్షతైః ఫలైః, కుసుమైర్వివిధైశ్చైవ భక్ష్యభోజ్యైస్తథావిధైః. అశ్వత్థపూజనం కార్యం ప్రోక్తమన్త్రేణ పాండవ, అశ్వత్థ హుతభుగ్వాస గోవిందస్య సదాప్రియ. అశేషం హర మే పాపం వృక్షరాజ నమోఽస్తు తే, ప్రాణిసంజీవన స్వామిన్ భూతావాస వనస్పతే. అశ్వత్థ రుద్రరూపోఽసి వృక్షరూప నమోఽస్తు తే, ఏవం పూజావిధిం కృత్వా తతః కుర్యాత్ప్రదక్షిణాన్. ముక్తికైః కాంచనైరౌప్యైర్హీరకైర్మణిభిస్తథా, కాంస్యపాత్రైస్తామ్రపాత్రైర్భ

క్ష్యపూర్ణైః పృథక్పృథక్. గృహీత్వా భ్రమణం కార్యం యావ
దష్టోత్తరంశతం, సమర్పితంచ యద్ద్రవ్యమర్పయేద్గురవే శుభమ్.
సువాసిన్యశ్చ సంపూజ్యాఃసోమాసంతుష్టిహేతవే, దద్యాచ్చా
న్నంతు విప్రేభ్యః స్వయం భుంజీత వాగ్యతః ఏష తే కథితో
భూప వ్రత రాజవిధిర్మయా, ద్రౌపదీం చ సుభద్రాం చ కార
యస్వ తథోత్తరామ్. ఉత్తరాగర్భసంస్థస్తు జీవితం చ లభేచ్చి
రాత్ —యుధిష్ఠిరః యా స్వల్పవిభవా నారీ కాంచనాద్యై
ర్వినాకృతా, సా కథం లభతే పూర్ణం వ్రతరాజఫలం వద.
ఫలైః పుష్పైస్తథా భక్ష్యైర్వస్త్రాద్యైరపి పాండవ, కుర్యా
త్ప్రదక్షిణావర్తం సాపి పూర్ణం. లభేత్ఫలమ్ వ్రతమిదమ
ఖిలం నరేన్ద్ర విష్ణోర్విబుధగణస్యచ కీర్తితం మయాద్య, పతిసు
తధనమిచ్ఛతి పుంస్త్రీ సపది కరోతు ఫలాని సన్తు నిత్యమ్.
అథోద్యాపనవిధిః. శృణు పార్థ ప్రవక్ష్యామి హ్యుద్యాపనవిధిం
శుభం, యం వినా పూర్ణతా న స్యాద్వ్రతరాజస్య వైనృప. కా
రయేత్సర్వతో భద్రం తన్మధ్యే కుంభముత్తమం, వృక్షరాజం
సువర్ణస్య పఞ్చరత్నస్య వేదికామ్. తన్మూలే ప్రతిమాం విష్ణోః
సౌవర్ణీం చ చతుర్భుజం, లక్ష్మీం వాహనసంయుక్తాం మాష
ద్వయఫలావధి. బ్రహ్మరుద్రాది దేవానాం యథాశక్తి తు
కారయేత్, రిక్తస్య సర్వదేవాత్మా విష్ణురేవ విశిష్యతే ఉప
చారైరనన్తైశ్చ యథావిభవవిస్తరైః, నైవేద్యైః పుష్పధూ
పైశ్చ దీపైశ్చ పరితఃస్థితైః. రాత్రౌజాగరణంకుర్యాత్ప్రభాతే
హోమమాచరేత్, సమిద్భిః పైప్పలాభిశ్చ పాయసేన తిలైస్త
థా. ఇదంవిష్ణుర్వ్రతిమన్త్రేణ హుత్వాచ ప్రణవేన చ, విష్ణ్వష్టాక్ష
రమన్త్రేణ శివపంచాక్షరేణ వా. సర్వదైవతమన్త్రైశ్చ విష్ణుర

త్ర విశిష్యతే, మూర్తిత్రయాత్మకాశ్వత్థవృక్షం పూర్ణాహూతిం చరేత్. ఆచార్యం పూజయేత్పశ్చాద్గాశ్చ దద్యాత్పయస్వినీం, బ్రహ్మాణం వస్త్రభూషాద్యైస్సదస్యం చ ప్రపూజయేత్. బ్రహ్మణే కలశశ్చైకో విష్ణో రేకః ప్రధానకః, రుద్రాదిసర్వదేవానాం దశానుగమతః స్మృతాః, ఏవం ద్వాదశ దద్యాద్వై తదశక్తో ద్వయం తథా, ఋత్విజోఽత్ర క్రమాత్పూజ్యా ఘృతపాయసభోజనైః ఉపవీతాని వస్త్రాణి తేభ్యో దద్యాచ్చ దక్షిణామ్, ప్రణమ్య దణ్డవద్భూమౌ ప్రార్థయిత్వా విసర్జయేత్. ఏవం ద్వాదశవర్షేషు మధ్యే చాదౌ సమాచరేత్. కృత్వా హ్యుద్యాపనం సమ్యగ్వ్రతరాజఫలం భవేత్. సర్వం నివేదయేత్ప్రీతమాచార్యాయ సదక్షిణమ్ అచ్ఛిద్రం వాచయేత్పశ్చాత్స్వయం భుఞ్జీత వాగ్యతః. ౧౪౦. ఇతి శ్రీభవిష్యోత్తరపురాణే సోమవత్యమావాస్యా వ్రతకథా సంపూర్ణా.

---

## అమావాస్యాసోమవతీవ్రతకథ.

భీష్ముఁడు శరతల్పమున శయనించియుండఁగా ధర్మరాజు భీష్మునికడకేతెంచి, అతనికి మ్రొక్కి తనకు మేలుఁగోరి యిట్లనియె. దుర్యోధనుని దురాలోచనలమూలమున భీమార్జును లిద్దరు కోపముచెంది, కౌరవవీరుల ననేకులను, మఱి యితర రాజులను సంహరించిరి. దానివలన మనవంశమునకు క్షీణదశ వచ్చెను. పిన్నలు, పెద్దలు రోగులు తప్పఁ దక్కినరాజులందఱు గతించిరి. ఈ భారతవంశమునకు మే మైదుగురముమాత్రము శేషించితిమి. ఈ ఏకచ్ఛత్రాధిపత్యము నైతము నాకు రుచింపకున్నది. జీవితమునందును రోఁతపుట్టుచున్నది. మరణమునొంది

నను పుణ్యగతి గలుగుచున్నది లేదు. ఈసంతతిక్షయము తలఁచిన మాకు మనస్సున నోర్వరానివ్యసనంబు గలుగుచున్నది. ఉత్తరయొక్క గర్భము అశ్వత్థామయొక్క యస్త్రముచే మాడ్చి వేయఁబడినది గనుక, ఇఁక వంశము క్షయించునని తలంపు మనసునకు వచ్చుటచే నాకు మొదటనున్న వెత రెట్టించుచున్నది. ఓహాహా! నేనిప్పుడేమిచేయుదును? ఎందుఁబోదును! దీర్ఘకాల ముండునట్టిసంతతి గలుగుట కుపాయమేది? చెప్పుము. అని ధర్మరాజడుగఁగా, భీష్ముం డతని కిట్లనియె. "ఓయుధిష్ఠిరా, తలంచినమాత్రముననే చిరకాలజీవి యగుసంతతి నొసఁగునట్టివ్రతములలో నుత్తమోత్తమం బగువ్రతం బొక్కటి గలదు దానింగూర్చిచెప్పెద వినుము. అమావాస్య సోమవారముతోఁగూడవచ్చినతిథినాఁ డశ్వత్థవృక్షముకడ కేఁగి యచ్చట శ్రీమహావిష్ణువు నారాధించి, యావల, నూటయెనిమిది రత్నములనో, పండ్లనో, పువ్వులనో తీసుకొని, యారావిచెట్టునకుఁ జుట్టును నూటయెనిమిది ప్రదక్షిణములు చేయవలయును.

ఈవ్రతోత్తమము శ్రీమహావిష్ణువునకుఁ బ్రీతినిగలిగించునది. ఈ యుత్తమవ్రతంబు నోఁచినయెడల, బ్రహ్మరుద్రాదులు సంతోషింతురు. అశ్వత్థవృక్షము త్రిమూర్తిస్వరూపమై సర్వదేవమయం బయియుండుటచేత, అశ్వత్థవృక్షమును బూజచేసినయెడల, జనులయొక్క సర్వాభీష్టములును నెఱవేఱుచున్నవి. ఉత్తరచేత నీవ్రతంబుఁ జేయింపుము. దానిగర్భము ప్రాణములతోనుండఁగలదు. ముల్లోకంబులందుఁ బ్రసిద్ధిచెందినపుత్త్రుఁడు బుట్టఁగలఁడు." అని భీష్ముఁడు పలుకఁగా, ధర్మరాజు పితామహుం జూచి "ఓపితామహా! ఆవ్రతరాజముంగూర్చి వివ

రించి చెప్పుము. ఈవ్రతంబును మనుష్యలోకంబున నెవ్వరు ప్రకటించిరి. ఎవరు మొదట నీనోమును జేసిరి. అనతీయవల యును." అని యడుగఁగా భీష్ముఁ డిట్లనియె. కైలాసపర్వతముం బోలు మిద్దెలు మేడలతో నించిన కాంచీపురి యను పేరుపడసిన పట్టణ మొక్కటి గలదు. అచ్చటి స్త్రీపురుషులందఱు చక్కని యలంకారములఁ దాల్చియుందురు. బ్రాహ్మణులు మొదలు నాలుగువర్ణములవారును తమతమ కార్యములను దప్పక చేయుచుందురు. అచ్చట వేశ్యలు రూపలావణ్యములతో నొప్పారుచుఁ దమచాకచక్యములచే జనులను వశపఱుచు కొనుచుందురు. అట్టి కాంచీనగరమును రత్నసేనుండను రాజు సకలజనరంజకముగాఁ బాలించుచుండెను. ఆపట్టణమున దేవస్వామియను నొక బ్రాహ్మణుఁడు గలఁడు. అతనికి లక్ష్మీదేవివలె సౌందర్యవతి యైన ధనవతియనుభార్య గలదు. ఆబ్రాహ్మణునికి ఆధనవతియం దేడుగురు కొడుకులును అందఱికి కడగొట్టుదిగా ఒకకొమరితయుఁ గలిగిరి. కూఁతుపేరు గుణవతి. ఆదేవస్వామి తనకుమారుల కేడ్వురకును వివాహము చేసెను. ఆకుమారులు తమభార్యల తోడ సుఖము లనుభవించుచుండిరి. కొమరితకు యుక్త వయస్సు రాఁగానే దానితల్లిదండ్రులు దానికి తగిన వరుని వెదకుచుండిరి. ఇట్లుండఁగా నొక బ్రాహ్మణుఁడు తనతపోమహిమచే నగ్నిహోత్రమువలెఁ దేజరిల్లుచు నాదేవస్వామి యింటికివచ్చి వాఁకిట నిల్చుండి యాశీర్వాదముసల్పెను. ఆవెంటనే యేడ్వురుకొడండ్రును లేచి యాబ్రాహ్మణునికి వేవ్వేఱుగా భిక్షముఁ దెచ్చిపెట్టిరి. అప్పు డాబ్రాహ్మణుం డాయేడ్వుర స్త్రీలకును దీర్ఘసౌమంగల్యమును సకలసంపదలును గలుగునట్లు

దీవనలుచేసెను. తర్వాత ధనవతి తనకూఁతురగు గుణవతిని బ్రాహ్మణునికి బిచ్చము పెట్టుమనఁగా గుణవతి యట్లె యా బ్రాహ్మణునికి భిక్షము దెచ్చిపెట్టెను. వెంటనే బ్రాహ్మణుఁ డా చిన్నదానిం గూర్చి "ఓ చిన్నదానా! ధర్మాత్మురాల వగు దువుగాక" అని యాశీర్వదించెను. వెంటనే గుణవతి మొగము చిన్నబుచ్చుకొని యింటిలోఁపలికి వెళ్లి తల్లితో నాబ్రాహ్మ ణుఁడు దీవించినప్రకారంబుఁ దెలిపెను.

ధనవతి యామాట విని కొమార్తెను జెయిపట్టికొని వచ్చి మఱల భిక్షము దెచ్చిపెట్టింపఁగా మరల నా బ్రాహ్మణుఁడు ముందు చేసినయట్లె యాశీర్వాదము చేసెను. అప్పుడు ధనవతి బ్రాహ్మణునిఁ జూచి "ఓబ్రాహ్మణోత్తమా! నాకొడంగ్రేడు గురు నమస్కరించినప్పుడు వారలకు దీర్ఘసౌమంగల్యమును సకలసౌభాగ్యసంపదలును గలుగునట్టు లాశీర్వాదంబు గావించితివి. నాకూఁతురు నమస్కరించినప్పుడుమాత్రము నీవు ధర్మాత్మురాలవు గమ్మని దీవించితివే దీనికిఁ గారణంబు దెలుపఁ గోరెద"నని యడుగఁగా ఆబ్రాహ్మణుఁడు ధనవతింజూచి, "ఓధన వతీ! నేను వారివారివిధికిఁ దగినట్లు దీవించితిని. ఈ నీ కూఁతురు సప్తపదినడుమనే వైధవ్యంబు నొందగలఁదు కావున ధర్మముచేయవలసినది యవశ్యము అది కారణంబుగా ధర్మా చరంబు ముఖ్యమని దీవించితి" నని చెప్పెను. ఆమాటలు విని, ధనవతి మిక్కిలి చింతాక్రాంతురాలై మాటిమాటికి నా బ్రాహ్మణునికి నమస్కరించి యాబ్రాహ్మణునింగూర్చి "ఓదయా నిధీ! నీవపాయంబుమాత్రము తెలిపితివి. నేనేమి చేయు దానఁ నుపాయంబుఁ దెలుపవే.దెవను" అని యడుగఁగా "ఓ

ధనవతీ! సింహళద్వీపమున సోమ యనుచాకిత యున్నది. దానిని దోడ్కొనివచ్చితి రేని, నీకూతురి వైధవ్యంబు దొలఁగు" నని చెప్పి భిక్షాటనమునకై వేఱొక్కయింటికిఁ బోయెను.

తర్వాత ధనవతి పుత్రులం జూచి "నాయనలారా! సోమ యనుచాకిత సింహళద్వీపంబున నున్నదఁట. దానిం దోడ్కొని వచ్చి, యీమీచెలియలగు గుణవతియొక్క వైధవ్యదుఃఖము దొలఁగింపుఁడు" అనిచెప్పఁగాఁ గొమరులందఱు "తల్లీ! నీయభిప్రాయం బెఱింగితిమి, నీమనస్సు నీకూఁతునందు మిక్కిలియాసగలిగి యున్నది. మమ్ము దేశాంతరమునకు వెడలఁగొట్టఁ జూచెదవు. మార్గమధ్యమున దాఁటరానిసముద్రమున్నది. మే మెట్లు దాఁటఁ బోఁగల" మని చెప్పఁగా అపుడు దేవస్వామి నాకేడుగురు పుత్త్రు లుండియుఁ బుత్రులు లేనివాఁడనే నైతిని. నాపుత్రికయొక్క వైధవ్యంబుఁ దొలఁగుటకై నేనే యాసోమను బిలుచుకొని వచ్చెదనని కోపముతోఁ జెప్పఁగాఁ గడపటికొడుకగు శివస్వామి యనువాఁడు "తండ్రీ కోపము చేయకుము. నేనుండఁగాఁ దమ కీ శ్రమయేల?" అనిచెప్పి తనచెల్లెలిని గుణవతిని దోడ్కొని సింహళద్వీపమునకు బయలువెడలి కొన్నిదినములకు సముద్రపు గట్టు చేరి, సముద్రమును దాఁటుటకై ప్రయత్నించుచు, నచ్చట తీరంబున విశాలమైన మఱ్ఱిచెట్టునుజూచి, యానాఁటి రేయి యాచెట్టుక్రింద విశ్రమించిరి. ఆ చెట్టునం దొకగ్రద్ద పిల్లఁబెట్టి యుండెను. ఆగ్రద్ద ప్రతిదినము బయటసంచరించి యెరను దెచ్చి తనపిల్లలకుఁ బెట్టుట వాడుక. ఆవాడుకప్రకార మాగ్రద్ద యారాత్రి యెర తెచ్చి పిల్లలకుఁ బెట్టఁగా నవి యాయెరను

దినవయ్యెను. అప్పుడు వానితల్లి మీరేల నేను దెచ్చినయొరను దినరైతిరి యని యడుగఁగా, ఆకూనలుసుతల్లినిజూచి, "తల్లీయీ చెట్టుక్రింద నిద్దఱువూనవులున్నారు. వారు భోజనములేక పస్తు పడియుండఁగా, మేమెట్లుభోజనంబుచేయఁగలవార"మనిచెప్పిరి. అంతట నాగ్రద్ధ దయాళువై క్రిందికి దిగివచ్చి, "ఓ విప్రా! మీ యిష్టము నేనెఱిఁగితిని. మీకార్యము సాధించెదను" అని చెప్పఁగా, శివస్వామి గ్రద్ధంజూచి, "నేను సముద్రముదాఁటి, సింహళద్వీపముచేరి, నా చెలియలివైధవ్యంబుఁ బోకార్చుటకై సోమయనుదానిం బిలుచుకొని రాఁగోరుచున్నాను" అని చెప్పఁగా, గ్రద్ధయు, "ఓబ్రాహ్మణోత్తమా! నేను తెల్లవాఱిన తర్వాత మిమ్ములను సింహళమునకుఁ గొనిపోయి, సోమయొక్క గృహమును జూపించెదను"అనిచెప్పి తనకూన లుండుగూటికి వెళ్లెను. ఆబ్రాహ్మణుఁడును, వానిచెలియలును రాత్రి యచ్చట శయనించియుండిరి. మఱునాఁటి యుదయమున, ఆగ్రద్ధ యా బ్రాహ్మణుని, వానిచెలియలిని సింహళద్వీపంబునకుఁ గొనిపోయి సోమ యనుచాకితయింటివాకిలింజూపెను. వారా సోమయింటిని జూచినది మొదలు ప్రతిదినమును తెల్లవాఱునంతలోపల ఆ సోమయింటివాకిలి పెంటయూడ్చి, పేన్నీళ్లుచల్లి ముత్తెలలికి పోవుచుండిరి. ఇట్లు వారొక్క సంవత్సరము ప్రతిదినము సోమ యింటివాకిటిపని సేయుచుండిరి. తర్వాత సోమ తనకొడుకులను కోడండ్రనుజూచి, ఎవ రీలాగు ప్రతిదినము వాకిలిపనిచేసి, నీరుచల్లి ముగ్గులుపెట్టిపోవుచున్నారని యడుగఁగా, అవియెల్ల మా కార్యములనియే వారుచెప్పిరి. తర్వాత, సోమ నిక్కంబు గనిపెట్టుటకై కదలక యొకమూల నిలచియుండి, తనయింటి

వాకిలి ముంగిలి యూడ్చుచుండు గుణవతిని, ముంగిలి యలుకు చుండు శివస్వామిని జూచి మీరెవ్వరు? ఇక్లేల పని చేయు చున్నారని యడిగెను. "మేము బ్రాహ్మణుల చిన్న నాండ్రము" అని వారు చెప్పిరి. "అక్కటా! యేమియన్యాయము! మీరు బ్రాహ్మణులరై యుండి నాయింటివాకిటఁ బని చేయుచుండు రేని, నే నీపాపమునుండి యెట్లు విముక్తురాలనగుదును. నే నేగతిఁ బడిపోవుదునో! నేనో హీనకులం బగుచాకలిజాతి దానను. మీరు బ్రాహ్మణులై యుండియు ఏలయిట్లు విపరీతంబునడచు కొందు" రని యడుగఁగా, శివస్వామి యిట్లనియె. "ఓచాకితా! ఇది గుణవతి యనుపేరుగలది నాకుఁ జెలియలు. ఇది సప్తపదీమధ్యముననే వైధవ్యంబు నొందఁగలదు. ఆవైధవ్యంబు దొలఁగుటకై నీవు సన్నిధానంబుననుండుటయవశ్యము. కావున నిన్నుఁదోడ్కొనిపోవవచ్చి, యిట్టు లీయధమవృత్తి చేయుచున్నా"మని యాశివస్వామిచెప్పఁగా, సోము వారింజూచి "మీ యిష్టప్రకారము వచ్చెదను" అని చెప్పి, లోపలికివచ్చి తనకోడండ్రనుజూచి, మీరు నేను వచ్చునంతవఱకు మనయింట నెవ్వరైన మృతినొందినను వారినిదహింపక యొక్కచోట పదిలముగా నుంచి కాపాడుఁడు. అని యానతిచ్చి, యచ్చటినుండి వెడలి వచ్చి, వారిని సముద్రమునుదాఁటించి తాను ఆకాశమార్గమున సముద్రమును దాఁటివచ్చి యొక్కనిమిషములోపల కాంచీపురంబు చేరెను. వారట్లు చేరఁగానే, ధనవతి సంతుష్టాంతరంగురాలయి సోమను బహుభంగుల మర్యాదలు గావించెను.

తర్వాత శివస్వామి తనచెలియలికిఁ దగినవరుం దెచ్చుటకై దేశాంతరమున కేఁగి యుజ్జయినీనగరంబుఁజేరి యచ్చట

దేవశర్మకుమారుఁడయిన రుద్రశర్మ యనువానిని దోడితెచ్చి, శుభముహూర్తమున గుణవతి నాతనికిచ్చివివాహము చేయింప నిర్ణయించెను. సోమయు దగ్గఱనుండి వివాహము జరిపించెను. అప్పుడు శుభలగ్నమున శుభముహూర్తమున దేవస్వామి తన కూఁతును గుణవతినిరుద్రశర్మకుఁగన్యాదానంబుచేసెను. తర్వాత వివాహప్రధానహోమంబు జరుగుచుండఁగా, సప్తపదీమధ్యమున రుద్రశర్మ మృతినొందెను. అప్పుడు బంధువులందఱు విలపించిరి. సోమమాత్రము నిశ్చలమనస్కురాలై యుండెను. ఆ వివాహమహోత్సవంబు చూడవచ్చిన వారందఱా బాలగోపాలముగా గగ్గోలుగావించిరి. ఆసోమ వెంటనే మరణముంబోఁగొట్టు వ్రతరాజప్రభావంబువలని ఫలంబును సంకల్పముచేసి గుణవతికొసఁగెను. రుద్రశర్మయు నావ్రతరాజప్రభావంబువలన జీవితుఁడై నిద్రలేచినవానికైవడి లేచి కూర్చుండెను. సోమయు నిర్విఘ్నంబున వివాహంబు నెఱవేర్చి, వ్రతోత్తమమయిన యమావాస్యాసోమవతీవ్రతంబు వారికుపదేశించి, తనగృహంబునకు బయలువెడలెను. ఇట్లు సోమ మృతుఁడయినబ్రాహ్మణుని బ్రతికించి సంపూర్ణమనోరథంబుతో వచ్చునంతలోపల దాని యింట మొదటఁగొడుకులును తర్వాత భర్తయు నటుతర్వాత నల్లుఁడును మృతినొందిరి. ఆసోమ తననివాసమునకు వచ్చుచుండఁగా, చచ్చినవారిని బ్రతికించునట్టి సోమవారయుతమైన యమావాస్యవచ్చెను. అప్పుడు మార్గమధ్యమున నొకముసలిది కనఁబడి, "ఓయమ్మా! నే నీదూదిమూటను మోయఁజాలకున్నాను. దీనిని గొంచెము దింపుము" అనెను. సోమయు "ఓ ముసలిదానా! నేఁ డమావాస్యాసోమవారము. నేను నేఁడు

దూఁదినిముట్టను ఈలాటినియమంబు పూనితిని" అని చెప్పి, మఱి కొంతదవ్వేఁగఁగా మఱియొక్క స్త్రీకనఁబడి ముళ్లంగిదుంపల గంపనెత్తికొనిపోవుచు, సోమనుజూచి దీనిని గొంచెము దింపు మని యడిగెను. సోమయు ముందటివలెనే యుత్తరముచెప్పి, నదీతీరంబుచేరి, యచ్చట స్నానంబుచేసి యచ్చటనున్న యశ్వత్థ వృక్షమూలమున శ్రీమన్నారాయణమూర్తి నారాధించి గులక ఱాళ్లుగొని నూటయెనిమిది ప్రదక్షిణంబులుగావించెను. ఎప్పుడు సోమ ఱాళ్లఁగైకొని యశ్వత్థవృక్షమునకుఁ బ్రదక్షిణము చేయ నారంభించెనో యప్పుడే యాసోమయొక్క కొడుకులు, మగఁడు, అల్లుఁడును లేచి కూర్చుండిరి. పట్టణమంతయు కాంతితో నిండియుండెను. అందును, వారియిల్లు సకలవైభవం బులతోఁ దులతూఁగుచుండెను. తర్వాత భాగ్యశాలిని యగు సోమ తనయిల్లుచేరి తనకొడుకులు, మగఁడు, అల్లుఁడు పునరు జ్జీవితులైనవార్త విని మిక్కిలి సంతోషము నొందెను. తర్వాత కోడండ్రందఱు అత్తగారికి నమస్కరించి "అమ్మా! మీకొడు కులును మామామగారును మీయల్లుఁడును మృతులైరి. మృతులైనవార లెట్లు మరల నుజ్జీవితులైరి? మాకుఁజెప్పవే" యని యడుగఁగా, సోమ కోడండ్రనుజూచి "నేను వ్రతరాజ ప్రభావంబువలనిపుణ్యమును గుణవతికొసఁగితిని. కావున నాపతి పుత్త్రజామాతలు మృతులైరి. నేను మరలివచ్చునప్పుడు అమా వాస్యాసోమవాసరము రాఁగా నేను దూఁది నుల్లంగిని దాఁకక యశ్వత్థవృక్షముకడకేగి లక్ష్మీనారాయణులం బూజించి నూటయెనిమిది ప్రదక్షిణంబులు గావించితిని. ఆశ్రీమన్నారా యణుని ప్రభావంబుచే నాపతిపుత్త్రజామాతలు పునర్జీవితు

లైరి. ఓకోడండ్రారా! మీరందఱీవ్రతంబుఁ బట్టుఁడు. మీకు దీర్ఘసౌమంగల్యమును, సౌభాగ్యమును గలుగఁగలదు" అనిచెప్పి వారిచేత నావ్రతంబుచేయించి, పెక్కువిధంబులయిన సుఖంబు లనుభవించి, యంతకాలమున వారందఱితోఁ గూడ వైకుంఠమునొందెను. ఓ ధర్మనందనా! నే నీవ్రతప్రభావంబు విస్తరించిచెప్పితిని. నీవట్లుచేయుమని భీష్ముఁడు ధర్మరాజుతోఁ జెప్పఁగా, ధర్మరాజును మరల భీష్మునిఁజూచి, ఓ పితామహా! ఆవ్రతరాజమునకు విధియెట్లు? మహిమయెట్టిది? పురుషులా? లేక స్త్రీలా యీవ్రతంబుచేయవలసినది? నాకు విస్తరించి చెప్పుమని యడుగఁగా, భీష్ముఁడిట్లనియె. "ధర్మనందనా, అమావాస్య యెన్నఁడు సోమవారముతోఁ గూడివచ్చునో, ఆదినము మహా పుణ్యదినము. అట్టికాలము దేవతలకుఁగూడ దొరకుట యరుదు. వ్రతముచేయువారు తెల్లవాఱఁగానే లేచి, విధిపూర్వకముగా స్నానమాచరింపవలెను తర్వాత మానముతో పట్టుబట్టలు కట్టుకొని, యశ్వత్థవృక్షముకడకుఁబోయి, యశ్వత్థవృక్షమూలము నందు "వ్యక్తావ్యక్త...నమః" అనుమంత్రముతో విష్ణ్వాదిదేవతలనుబూజించి, తర్వాత. 'అశ్వత్థేవోనిషదనమ్' "ఆనాత్తేఅగ్నిరస్తుతే" "నమశ్చగృత్స్యతేరుద్రాయ" "ఊర్ధ్వమూలమధశ్శాఖం" "తద్విష్ణోః పరమంపదమ్" "ఆత్వావహన్తు హరయస్సచేతసః" "దేవావై యదజ్ఞైకుర్వత" "బ్రహ్మజజ్ఞానం ప్రథమం పురస్తాత్" "మూలతో బ్రహ్మ...తే నమః" ఇత్యాదిమంత్రములచే దేవదేవుఁడగు శ్రీమన్నారాయణమూర్తిని బూజించి, తర్వాత త్రిమూర్తిస్వరూపం బయిన యశ్వత్థవృక్షమును "అశ్వత్థ...నమోఽస్తుతే. ప్రాణిసంజీవక...నమోస్తుతే" అను

మంత్రములచే నారాధించి, ముత్యములు, వెండి, బంగారు నాణెములు, పచ్చలు, రవలు, భక్ష్యభోజ్యములతో నిండిన తామ్రకాంస్యలోహపాత్రములు మొదలగువానింగైకొని నూటయెనిమిది ప్రదక్షిణములుచేయుచు నొక్కొక్క ప్రదక్షిణము చేయునపుడు నొక్కొక్కటి వృక్షమూలమునసుంచి, తర్వాత నానూటయెనిమిదింటిని గురువునకు దక్షిణతాంబూలముతోడ నొసఁగవలయును. సోమయొక్క ప్రీత్యైకై ముత్తైదువులను గంధపుష్పదీపతాంబూలాదులతో నర్చింపవలయును. తర్వాత శక్తికొలఁది బ్రాహ్మణసంతర్పణంబు గావించి, తర్వాత తానునుమౌనముతో భుజింపవలయును. ఓధర్మనందనా! యీవ్రతోత్తమవిధానంబు నీకెఱుఁగఁజెప్పితిని. నీవీవ్రతంబును ద్రౌపది సుభద్ర యుత్తరలచేత నోమించుము. ఉత్తరాగర్భమందున్నవాఁడు చిరకాలజీవియై మనును" అని భీష్ముఁడు సెప్పఁగా, ధర్మనందనుఁడు భీష్మునింగాంచి, కొంచెపాటివిత్తముగలస్త్రీ బంగారుమొదలగునవి లేనిచో నెట్లు వ్రతరాజముయొక్క పూర్ణఫలంబు నొందునని యడుగఁగా, "అట్టిస్త్రీ పండ్లు, పూవులు, భక్ష్యములు, వస్త్రములు మున్నగునవి వేయుచుఁ బ్రదక్షిణంబుసేసి యీవ్రతముయొక్క పూర్ణఫలంబు నొందును. ఓ నరేంద్రా! సకలదేవతలును, ముఖ్యముగా మహావిష్ణువును ప్రీతిజెందునట్టి యీవ్రతంబును నేను నీకుఁ జెప్పితిని. ధనధాన్యసంపదను, పతిసౌభాగ్యమును, పుత్రపౌత్రాభివృద్ధిని గోరునట్టి ముత్తైదువలీవ్రతంబులుచేసి రేని, సకలవిధములైనఫలంబుల నొందుదురు.

## ఉద్యాపనవిధి.

ఓధర్మరాజా, ఈవ్రతమున కుద్యాపనవిధి చెప్పెదను వినుము. నోముపట్టి యుద్యాపనము చేయనియెడల, వ్రతంబు పూర్తిగానేరదు. ఓయుధిష్ఠిరా, సర్వతోభద్రకుండల మేర్పఱచి, దానినడుమ కలశముసుస్థాపించి, బంగారుతో అశ్వత్థవృక్షమును జేయించి, రత్నములతోఁ దిప్పనొక్కదానిని జేయించి, చతుర్భుజుం డగువిష్ణువుప్రతిమను, లక్ష్మీదేవిప్రతిమను రెండు గురిగింజలయెత్తుకు తగ్గనీక, పలమెత్తువఱకు నుండు నట్లు లక్ష్మీనారాయణ ప్రతిమను జేయించవలయును. తక్కిన బ్రహ్మరుద్రాదిదేవతలకు శక్తిలోపము లేకుండఁ బ్రతిమలను జేయింపవలెను. అన్నిప్రతిమలుచేయింప శక్తిలేనియెడల, లక్ష్మీనారాయణప్రతిమ యొక్కటిచేయించిన నదియే సకల దేవతలకు ప్రీతికరము. అట్లు కలశస్థాపన చేసి, షోడశోపచారపూజలు గావించి, రాత్రి జాగరణముచేసి, మఱునాఁడుదయమున అశ్వత్థసమిధలతోను, పాయసముతోను, తిలలతోను, "ఇదం విష్ణు ర్విచక్రమే" అను మంత్రముతోఁగాని, ప్రణవముతోఁగాని, అష్టాక్షరితోఁగాని, పంచాక్షరితోఁగాని, సకల దేవతాస్తోత్రము లగు మంత్రములతోఁగాని హోమంబు చేయవలెను. విష్ణుస్తోత్రరూపమంత్రమే మిక్కిలి శ్రేష్ఠము. ఆహోమ మైనతర్వాత త్రిమూర్తిస్వరూపుం డగు అశ్వత్థనారాయణస్వామిం గూర్చి హోమంబుచేసి, తర్వాత పూర్ణాహుతి చేయవలయును. తర్వాత ఆచార్యునిఁ బూజించి, గోదానంబుచేసి, బ్రాహ్మణులను వస్త్రాభరణాదులచే ప్రీతులం గావించి, సదస్యునిఁ బూజింపవలయును. బ్రహ్మ కొక్కకలశ

మును, విష్ణువున కొక్కకలశమును ముఖ్యముగా నుండవల యును. తక్కినరుద్రాది దేవతలకు శక్తిననుసరించి, పండ్రెండు గాని, లేక దానిలో సగముగాని, దానికి శక్తిచాలనివాఁడు రెండుకలశములనైనంగాని యియ్యవలయును. తర్వాత ఋత్విక్కులకు షడ్రసోపేతంబుగా భోజనంబు పెట్టి వస్త్ర యజ్ఞోపవీత దక్షిణతాంబూలముల నొసఁగి, వారిని సంతు ష్టులంజేసి, వారికి సాష్టాంగముగాఁ బ్రణమిల్లి, వారిని బంప వలయును. ఇట్లు పండ్రెండుదినము లీవ్రతంబుసేయుచు నంతే లోపల మొదటఁగాని, నడుమఁగాని యుద్యాపనంబు లెస్సగాఁ గావించి, మండలము మొదలగువాని నాచార్యుని కొసఁగి, యతనిచేత దీవనలు పొందవలయును. తర్వాత తాను వ్రానముతో భుజింపవచ్చును. అని భీష్ముఁడు ధర్మరాజునకు అమావాస్యాసోమవతీవ్రతరాజప్రభావంబు చెప్పఁగా, నతఁ డుత్తర మొదలగువారిచే నావ్రతంబు సేయించినందున సుత్తరా గర్భసంభూతుఁడు జీవితుఁడై యుత్తరోత్తరాభివృద్ధి నందెను. అని సూతుఁడు శౌనకాదిమహర్షులకుఁ జెప్పెను.

ఇది శ్రీభవిష్యోత్తరపురాణాంతర్గత

అమావాస్యాసోమవతీవ్రతకథ

సంపూర్ణము.

---

# కృష్ణాష్టమీవ్రతము.



* ప్రాతః కృతనిత్యక్రియః ప్రాఙ్ముఖో దేశకాలౌ సంకీర్త్య తత్తత్కాలే సప్తమ్యాదిసత్త్వేఽపి ప్రధానభూతామష్టమీమేవ సంకీర్త్య శ్రీకృష్ణప్రీత్యర్థం జన్మాష్టమీవ్రతం కరిష్యే, జయన్తీయోగసత్త్వే జన్మాష్టమీవ్రతం జయన్తీవ్రతం చ కరిష్యే. ఇతి సంకల్పయేత్. తామ్రపాత్రే జలం గృహీత్వా. వాసుదేవం సముద్దిశ్య సర్వపాపప్రశాన్తయే, ఉపవాసం కరిష్యామి కృష్ణాష్టమ్యాం నభస్యహమ్. తదశక్తౌ ఫలాని భక్షయిష్యామీత్యాది. ఆజన్మమరణం యావద్యన్మయా దుష్కృతం కృతం, తత్ప్రణాశాయ గోవిన్ద ప్రసీద పురుషోత్తమ. ఇతి పాత్రస్థం జలం క్షిపేత్.

తతః సువర్ణరజతాదిమయ్యా మృణ్మయ్యా వా భిత్తిలిఖితా వా ప్రతిమాః యథాకులాచారం కార్యాః. తా యథా—

---

*ప్రాతఃకాలమున లేచి స్నానాదిక్రియలు నిర్వర్తించుకొని, తూర్పు మొగముగాఁ గూర్చుండి, సప్తమ్యాది తిథులున్నను, అష్టమియే ముఖ్యము గనుక, అష్టమి యని చెప్పుకొని కృష్ణాష్టమీవ్రతముం జేసెదనని సంకల్పము చేయఁబోవుచున్నానని సంకల్పము చేయవలయును. జయంతియుండెనేని, జయంతీవ్రతమునుగూడఁ జేసెదను అని సంకల్పముచేయవలయును. తర్వాత తామ్రపాత్రమునం దుదకము నుంచికొని, "సర్వపాపములు క్షయించునిమిత్తమై వాసుదేవు నుద్దేశించి యుపవాసంబుండెదను" అనియు శక్తిలేనియెడ, ఫలాహారము గైకొనియుండెద" ననియు సంకల్పముచేసి, యాజలము పాఱఁబోయవలయును. తర్వాత శక్తికొలఁది బంగారు, వెండి, తామ్రము మొదలగు లోహములతోఁగాని, మంటితోఁగాని ప్రతిమలను జేయింపవలెను. లేదా, గోడయందు వ్రాయింపవలయును. అదెట్లనఁగా:—దేవకి పాన్పునఁ

పర్యంకే ప్రసుప్తదేవక్యాః స్తనం పిబన్తీం శ్రీకృష్ణప్రతిమాం నిధాయ జయన్తీసత్త్వే త్వన్యదేవక్యా ఉత్సఙ్గే ద్వితీయాం శ్రీకృష్ణమూర్తిం నిధాయ పర్యఙ్కస్థదేవకీచరణ సంవాహన పరాం లక్ష్మీం నిధాయ భిత్త్యాదౌ ఖడ్గధరం వసుదేవం నంద గోపీగోపాలాన్ లిఖిత్వా ప్రదేశాన్తరే మంచకే ప్రసూత కన్యయా సహ యశోదాప్రతిమాం పీఠాన్తరే వసుదేవ, దేవకీ, నంద, యశోదా, శ్రీకృష్ణ, రామ, చండికా ఇతి సప్త ప్రతిమాః స్థాపయేత్. ఏతావత్ప్రతిమాకరణాశక్తౌ వసుదేవాది చండికాన్తాః ప్రతిమాః సప్త వా యథాచారం యథాశక్తి వా కృత్వా అన్యాం సర్వాః యథాయథం ధ్యాయేదితి భాతి. నిశీథాసన్న ప్రాక్కాలే, స్నాత్వా, ఆచమ్య, ప్రాణానాయమ్య శ్రీకృష్ణప్రీత్యర్థం సపరివార శ్రీకృష్ణపూజాం కరిష్యే. ఇతి సంక ల్ప్య. న్యాసాన్ కలశశంఖాదిపూజాంతం నిత్యవత్కృత్వా ధ్యాయేత్. పర్యంకస్థాం కిన్నరాద్యైరుపేతాం ధ్యాయేత్తు దేవ కీం, శ్రీకృష్ణం బాలకం ధ్యాయేత్ పర్యఙ్కే స్తనపాయినమ్. శ్రీవత్సవక్షసం శాన్తం నీలోత్పలదళచ్ఛవిం, సంవాహయన్తీం

---

బరుండియుండఁగా, కృష్ణుఁడు స్తన్యపానము చేయుచున్నట్టును, జయంతియైన యెడల మఱియొక్క కృష్ణప్రతిమను ముందటివలె మఱియొక్కటి యుంచి, దేవకికిఁ గాళ్లొత్తుచున్నట్టు లక్ష్మీప్రతిమను, గోడ మొదలగువానియందు ఖడ్గముఁ దాల్చినవసుదేవుని, గోపికా గోపులను, చిత్తరువు వ్రాయించి, మఱియొక ప్రదేశమున మంచము పుట్టినకన్యతోడ యశోదను మఱియొకపీఠ ముపై వసుదేవ, దేవకీ, నంద, యశోదా, శ్రీకృష్ణ, బలరామ, చండికల ప్రతి మలను వ్రాయించవలయును. ఇన్ని ప్రతిమలు చేయింప శక్తి లేనప్పుడు వసు దేవుఁడాదిగా చండికవఱకు గలయేడు ప్రతిమలను ఆచారానుసారముగాను, శక్త్యనుసారముగాను జేయించి, అన్నిటిని ధ్యానింపవలెను.

దేవక్యాః పాదౌ ధ్యాయేచ్ఛ తాం శ్రియమ్. ఏవం ధ్యాత్వా. సహస్రశీర్షా...దేవక్యై నమః ఇతి దేవకీమావాహ్య, మూలమన్త్రేణ శ్రీకృష్ణాయ నమః శ్రీకృష్ణమావాహయామీతి ఆవాహ్య, లక్ష్మీం చావాహ్య, దేవక్యై వసుదేవాయ యశోదాయై నందాయ కృష్ణాయ రామాయ చండికాయై ఇతి నామభిరావాహ్య శిఖాదిదేవతాః సకలపరివారదేవతాభ్యో నమః ఇత్యావాహ్య, (మూలమంత్రేణ సూక్తర్వా అత్రావాహిత దేవక్యాదిపరివార దేవతాసహిత శ్రీకృష్ణాయ నమః ఇత్యాసన, పాద్య, అర్ఘ్య, ఆచమనీయ, అభ్యంగస్నానాని దత్వా పంచామృతస్నానాన్తే చందనేనానులేపయేత్. శుద్ధోదకాభిషేకాన్తే వస్త్ర, యజ్ఞోపవీత, గంధ, పుష్పాణి ధూపదీపౌ చ, "విశ్వేశ్వరాయ విశ్వాయ తథా విశ్వోద్భవాయ చ, విశ్వస్య పతయే తుభ్యం గోవిందాయ నమోనమః. యజ్ఞేశ్వరాయ దేవాయ తథా యజ్ఞోద్భవాయ చ, యజ్ఞానాం పతయే నాథ గోవిందాయ నమో నమః." ఇతి మన్త్రాభ్యాం మూలమన్త్రాది సముచ్చితాభ్యాం దద్యాత్. "జగన్నాథ నమస్తుభ్యం సంసార భయనాశన, జగదీశాయ దేవాయ భూతానాం పతయే నమః." ఇతి నైవేద్యమ్ మూలమంత్రాదికం సర్వత్ర యోజ్యమ్. తాంబూలాదినమస్కార ప్రదక్షిణ పుష్పాంజల్యంతం కార్యమ్) అథవా ఉద్యాపనప్రకరణోక్తవిధినా పూజా సాయథా. ఉక్తప్రకారేణ ధ్యానావాహనే కృత్వా. పురుషవేదగ్ం...హాతి. దేవా బ్రహ్మాదయో యేచస్వరూపంనవిదుస్తవ, అతస్త్వాం పూజయిష్యామి, మాతురుత్సంగవాసినమ్. ఆసనమ్. ఏతావానస్య...దివి. అవతారసహస్రాణి కరోషి మధుసూదన,

నతే సంఖ్యాఽవతారాణాం కశ్చిజ్జానాతి తత్త్వతః పాద్యమ్. త్రి పాదూర్ధ్వ...అభి జాతఃకంసవధార్థాయభూభారోత్తారణాయ చ, దేవానాంచహితార్థాయ ధర్మసంస్థాపనాయుచ, కౌరవాణాం వినాశాయ పాండవానాం హితాయ చ, గృహాణార్ఘ్యం మయా దత్తం దేవక్యాసహితో హరే. అర్ఘ్యమ్. తస్మాద్విరా...పురః. సు రాసురనరేశాయ క్షీరాబ్ధిశయనాయ చ, కృష్ణాయవాసుదేవా య దదామ్యాచమనం శుభమ్ ఆచమనీయమ్. యత్పురుషేణ హ...విః నారాయణనమస్తేఽస్తు నరకార్ణవతారక, గంగోదకం సమానీతం స్నానార్థం ప్రతిగృహ్యతామ్. స్నానమ్. ఆప్యాయ స్వేత్యాది మన్త్రైః. పయోదధి ఘృతక్షౌద్ర శర్కరాస్నానము త్తమం, తృష్ట్యర్థం దేవదేవేశ గృహ్యతాం దేవకీసుత. పంచా మృతస్నానమ్. శుద్ధోదకస్నానం మహాభిషేకః ఆచమనీయమ్. తం యజ్ఞం బర్హిషి...క్షౌమం చ పట్టసూత్రాద్యం మయానీ తాంశుకం శుభం, గృహ్యతాం దేవదేవేశ మయా దత్తం సురోత్తమ. వస్త్రమ్. తస్మాద్యజ్ఞాత్సర్వ...యే. నమః కృష్ణాయ దేవాయ శంఖచక్రధరాయ చ, బ్రహ్మసూత్రం జగన్నాథ గృ హాణ పరమేశ్వర. యజ్ఞోపవీతమ్. తస్మాద్యజ్ఞా...యత. నానా గంధసమాయుక్తం చందనం చారుచర్చితం, కుంకుమాక్తాక్షతై ర్యుక్తం గృహ్యతాం పరమేశ్వర. గంధద్వారాం...గంధమ్. తస్మాదశ్వా...వయః. పుణ్యాని యాని దివ్యాని పారిజాతోద్భ వాని చ, మాలతీకేసరాదీని పూజార్థం ప్రతిగృహ్యతామ్. పు ష్పాణి. అథాంగపూజా. శ్రీకృష్ణాయనమః పాదౌపూజయామి. సంకర్షణాయ నమః గుల్ఫౌ పూ. కాలాత్మనే నమః జానునీ. విశ్వకర్మణే నమః జంఘే. విశ్వనేత్రాయ నమః కటిం.

విశ్వకర్త్రే నమః గుహ్యమ్ పద్మనాభాయ నమః నాభిమ్ పర మాత్మనే నమః హృదయమ్. శ్రీకంఠాయ నమః కంఠమ్ సర్వా స్త్రధారిణే నమః బాహూ వాచస్పతయే నమః ముఖమ్. కేశవాయ నమః లలాటమ్. సర్వాత్మనే నమః శిరః. విశ్వరూపి ణే నారాయణాయ నమః సర్వాణ్యంగాని పూజయామి. సహ స్రతులసీ అష్టోత్తరశతంవా. యత్పురుషంవ్యదధుః...తే. వనస్ప తిరసైర్దివ్యైః...గృహ్యతామ్. ధూపమాఘ్రాపయామి. బ్రాహ్మ ణోఽస్య...యత. త్వంజ్యోతిః సర్వదేవానాం తేజస్త్వం తేజ సాంపరం, ఆత్మజ్యోతిర్నమస్తుభ్యం దీపోఽయం ప్రతిగృహ్య తామ్ దీపమ్ చంద్రమా...యత. నానాగంధసమాయుక్తం భ క్ష్యంభోజ్యం చతుర్విధం, నైవేద్యార్థం మయాదత్తం గృహాణ పరమేశ్వర. నైవేద్యమ్. ఆచమనమ్ కరోద్వర్తనమ్ తాంబూలం చ సకర్పూరం పూగీఫలసమన్వితం, ముఖవాసకరం రమ్యం ప్రీత్య ర్థం ప్రతిగృహ్యతామ్. తాంబూలమ్. సౌవర్ణ రాజతం తామ్రం నానారత్నసమన్వితం, కర్మసాద్గుణ్యసిద్ధ్యర్థం దక్షిణాం ప్రతిగృ హ్యతామ్. రంభాఫలం నారికేళం తథైవామ్రఫలానిచ, పూజి తోఽసి సురశ్రేష్ఠ గృహ్యతాం కంససూదన. ఫలాని. సోమో వా...నీరాజనం, నాభ్యాఆసీద...యన్. నమోఽస్త్వనన్తాయ సహస్రమూర్తయే...ధారిణే నమః. నమస్కారాన్. సప్తాస్యా సన్...పశుమ్. యానికానిచ...ఆత్మప్రదక్షిణనమస్కారాన్. యజ్ఞేన...ఇత్యాదివేదమన్త్రైః పుష్పాంజలిమ్.అపరాధసహస్రాణి పూజాంని వేదయేత్ సర్వోపచారపూజనసమాప్త్యాద్వాదశాంగుళ విస్తారం రౌప్యమయం స్థండిలాదిలిఖితం వా రోహిణీయుతం చంద్రం సోమేశ్వరాయ సోమాయ తథాసోమోద్భవాయ

చ, సోమస్య పతయే నిత్యం తుభ్యం సోమాయ వై నమః. ఇతి సంపూజ్య, సపుష్పకుశచందనతోయం శంఖేనాదాయ. క్షీరోదార్ణవసంభూత అత్రిగోత్రసముద్భవ, గృహాణార్ఘ్యం శశాఙ్కేశ రోహిణీసహితో మమ. జ్యోత్స్నాపతే నమస్తుభ్యం జ్యోతిషాం పతయే నమః, నమస్తే రోహిణీకాన్త అర్ఘ్యం నః ప్రతిగృహ్యతామ్ ఇతి మన్త్రాభ్యాం చన్ద్రాయార్ఘ్యం దద్యాత్. తతః శ్రీకృష్ణాయార్ఘ్యం దద్యాత్. తత్ర మన్త్రః. జాతః కంసవధార్థాయ భూభారోత్తారణాయ చ, పాండవానాం హితార్థాయ ధర్మసంస్థాపనాయ చ. కౌరవాణాం వినాశాయ దైత్యానాం నిధనాయ చ, గృహాణార్ఘ్యం మయా దత్తం దేవక్యా సహితో హరే. శ్రీకృష్ణాయ నమః ఇదమర్ఘ్యమ్. తతః ప్రార్థయేత్. త్రాహి మాం సర్వలోకేశ హరే సంసార సాగరాత్, త్రాహి మాం సర్వపాపఘ్న దుఃఖశోకార్ణవాత్ప్రభో. సర్వలోకేశ్వర త్రాహి పతితం మాం భవార్ణవే, త్రాహి మాం సర్వదుఃఖఘ్న రోగశోకార్ణవాద్ధరే. దుర్గతాం స్త్రాయసే విష్ణో యే స్మరన్తి సకృత్సకృత్, త్రాహి మాం దేవదేవేశ త్వత్తో నాన్యోఽస్తి రక్షితా. యద్వాక్వచన కౌమారే యౌవనే యచ్చ వార్ధకే, తత్పుణ్యం వృద్ధిమాయాతు పాపం దహ హలాయుధ. ఇతి ప్రార్థయేత్.

ఇతి శ్రీకృష్ణపూజా సమాప్తా.

---

## శ్రీకృష్ణాష్టమీవ్రతకథా.

వాగీశాద్యాస్సుమనస స్సర్వార్థానా ముపక్రమే,
యం నత్వా కృతకృత్యాస్స్యు స్తం నమామి గజాననమ్.

నమః పరమ కల్యాణ నమస్తే విశ్వమంగళ, వాసుదే

వాయ శాంతాయ యదూనాంపతయే నమః. కరారవిందేన పదారవిందం ముఖారవిందే వినివేశయంతం, వటస్య పత్రస్య పుటే శయానం బాలం ముకుందం మనసా స్మరామి.

నారద ఉవాచః—జయన్త్యాశ్చైవ మాహాత్మ్యం శ్రీకృష్ణాష్టమ్యాస్తథైవచ, కథయస్వ మహాభాగ నమస్తే భక్తవత్సల. యచ్ఛ్రుత్వాహం గమిష్యామి తద్విష్ణోఃపరమంపదమ్.

పితామహఉవాచః—శృణు వత్స ప్రవక్ష్యామి జయంత్యాశ్చ ప్రభావకం, జయం పుణ్యంచ లభతే శీఘ్రం పాపస్య నాశనమ్. స్మరణా త్కీర్తనా త్పాపం సప్తజన్మార్జితం మునే, జయంతీ హరతే పుణ్యం కింపునశ్చోపవాసినామ్. కృష్ణజన్మాష్టమీలోకే పవిత్రా పాపనాశినీ, క్రతూనాంచఫలం తేషాం తీర్థాయుతఫలం లభేత్. కపిలాగోసహస్రంతు యో దదాతి దినే దినే, తత్ఫలం సమవాప్నోతి జయంత్యా స్సముపోషణే రత్నకోటిసహస్రాణి అశ్వానామయుతాని చ, మత్తేభానాం సహస్రాణి యో దదాతి దినే దినే. కన్యాకోటిసహస్రంతు తత్ఫలం ఋషిభిః స్మృతం, హేమభాండసహస్రాణి కురుక్షేత్రే ప్రయచ్ఛతి. గురవర్థం బ్రాహ్మణార్థంవా స్వామ్యర్థం య స్త్యజే త్తనుం, తత్ఫలం సమవాప్నోతి జయంత్యాస్సముపోషణాత్. ఆపన్నార్తిహరాణాంచ తీర్థసేవారతాత్మనాం, సత్యవ్రతానాం యత్పుణ్యం జయంత్యాస్సముపోషణాత్. యత్ఫలం శ్రాద్ధకర్తౄణాం పితౄణామిందుసంక్షయే, గంగాయాం నర్మదాయాంచ సరయూచంద్రభాగయోః. అన్యేషు పుణ్యతీర్థేషు యః స్నానం కురుతే నరః, ద్వాదశీనాంతు సర్వాసాం యత్ఫలంకృష్ణజన్మని. జయంత్యేకోపవాసేన జాగరేణ తు తత్ఫలం, అంబరీషేణసూర్యేణశిశుపాలేనగాధినా, ఏతైశ్చాన్యైశ్చ రాజన్యై

ధర్మజ్ఞై స్సత్యవాదిభిః. తుష్ట్యర్థం దేవకీసూనోర్జయంత్యాం సముపోషితం, కృత్స్నం రాజ్యం మహీం భుంక్త్వా ప్రాప్తే శాశ్వతీం గతిమ్. జయంత్యాశ్చోపవాసేన విష్ణోర్లోకం గతాశ్చ తే, వాలఖిల్యాదయో విప్రాః వశిష్ఠాద్యా ద్విజోత్తమాః గౌతమేన చ గార్గ్యేణ జామదగ్న్యేన ధీమతా. వాల్మీకినా కృతం పూర్వం మహాతాపసరూపిణా, కృతం రామాయణం యేన విష్ణోః పరమముత్తమమ్. ప్రాజాపత్యర్క్ష సంయోగేన భోమాసే౽సితే౽ష్టమీ, తస్యామేవ చ కర్తవ్యం తుష్ట్యర్థం చక్రపాణినః. జన్మోపార్జిత పాపం చ జన్మాంతరకృతాని చ, బ్రహ్మహత్యాదయస్సర్వే నశ్యంతి స్మరణాదపి పురతో వాసుదేవస్య జయంత్యాఖ్యా కామదా, కోటిజన్మార్జితంపాపం జ్ఞానాజ్ఞానకృతం తథా. తస్యాముపోషణేనైవ యామార్ధేన విలీయతే, శూద్రాన్నేన తు యత్పాపం శవహస్తేనభోజనమ్. తత్పాపంసమవాప్నోతి జయంత్యాంభోజనే కృతే, నభః కృష్ణాష్టమీ ప్రాప్తే భువసేతు ద్విజాధమాః. త్రైలోక్యసంభవం పాపం భుంజత్యేవ న సంశయః, బ్రహ్మఘ్నస్య సురాపస్య గోఘ్నస్య స్త్రీవధస్య చ. నరకో మునిశార్దూలః జయంతీవిముఖస్యచ, ప్రజాహీనస్య మూర్ఖస్య పరాన్నం భుంజతోపిచ నతస్యసుకృతో లోకః జయంతీవిముఖస్యచ. యే కుర్వంతి హరేఃపూజాం జయంతీవాసరే మునే, సుప్రసన్నో భవేత్తుష్టో దేవకీవిష్ణునా సహ. వ్రతేనారాధయేద్దేవం దేవకీసహితం హరిం, త్యక్త్వాయమపురీం ఘోరాం యాంతి విష్ణోఃపరంపదమ్ జన్మాష్టమీవ్రతం యే వై ప్రకుర్వంతి ద్విజోత్తమాః, ఆరాధయంతి విప్రేంద్ర లక్ష్మీస్తేషాం ప్రసీదతి. రాజికం దైవికం చైవ భయం చాగ్నిసముద్భవం, సార్పంవిద్యుత్ప్రజాతంచవాయుజం ఖాంబు

జంతథా. స్మరణాద్వాసుదేవస్య క్షణమాత్రాద్వినశ్యతి, గావస్త
స్య వివర్ధంతే ప్రభూతా ధాన్యసంపదః. కుటుంబం వర్ధతే తస్య
మోక్షశ్చాంతే న సంశయః, దుఃఖజం వ్యాధిజం చైవ భయం
సర్వసముద్భవమ్ నకలిర్న చకాలశ్చ నోపసర్గో మహామునే, రక్ష
ణాయ కులస్యైవ సర్వత్ర విజయాయచ జయంతిబుధవారేణ
రోహిణీ సహితాయది, అన్యైశ్చ మునిశార్దూల కింకృతైర్వ్రత
కోటిభిః. సముస్కారేణ యత్పుణ్యం మాత్రాపిత్రోర్దినే తథా.
ఆచార్యపాలనాద్వత్స తత్ఫలం శతసమ్మితం, యత్ర విష్ణోః కథా
తత్రవర్తతే మునిసత్తమ.

నారదఉవాచః—సుదూరమపి గంతవ్యం యత్ర భాగ
వతో జనః, త్రేతాయాం ద్వాపరే సమ్యక్కృతే చైవ కలౌ
యుగే. కృత్వా సమ్యగ్విధానేన కర్తవ్యం పుణ్యవర్ధనం, కథ
యస్వ సురశ్రేష్ఠ జయంతీ యేన తుష్యతి. శాఃపూజాం యద్వి
ధానేన బ్రూహి మే త్రిదశేశ్వర, సమ్యగ్వ్రతఫలం యేన
బ్రూహి మే త్రిదశేశ్వర.

బ్రహ్మోవాచః—పురా సనత్కుమారేణ హరిశ్చంద్రస్య
ధీమతః, ఉక్తమేతన్మహాభాగ వ్రతమేతన్మహామునే. నియమా
త్ఫలమాప్నోతి న శ్రేయో నియమం వినా, అదన్యష్టిత్వా నిరా
హారశ్చోద్భూతే పరమేశ్వర. భక్త్యాచ దేవకీపుత్ర మస్మిన్జన్మాష్ట
మీవ్రతే, ఉపోషితస్తన్మధ్యాహ్నే స్నాత్వాకృష్ణతిలైశ్శుభైః.
ధాత్రీఫలం ధారయిత్వా మహాపుత్రాదివర్ధనం, కృత్వాతులసి
మిశ్రేణ జలంపిబతి సువ్రతీ. స్నానంవా కురుతే తత్ర తీర్థ
స్నానఫలం లభేత్, కృత్వా మాధ్యాహ్నికం కర్మ శుచిర్భూ
త్వా సమాహితః. గృహమధ్యేథవాచైవ విష్ణుస్థానేచ సువ్రతీ,
గోమయేనోపలిప్యాథ స్థాపయేన్నూతనం ఘటమ్. పూరయేచ్ఛ

ద్ధసలిలం నవరత్నైశ్చ సంయుతం, వస్త్రేణా వేష్టయేత్కుంభం తండులోపరి విన్యసేత్. తత్ర నిక్షిప్యతత్పాత్రం రౌప్యం తామ్రం మృదంతువా, పూరయేత్తండులైశ్శుభ్రైః పంచరత్నసమన్వితైః వస్త్రేణాచ్ఛాదనం కృత్వా పాత్రమధ్యేన్యసేద్ధరిం, కర్షమాత్ర సువర్ణేన బాలకృష్ణం ప్రపూజయేత్. యథావిభవసారేణశక్తి యుక్తేన చేతసా, శ్రాద్ధేదానేతథా హోమే సర్వతీర్థవ్రతేషుచ విత్తశాఠ్యం న కుర్వీత తథాచాన్యేషు సువ్రత, దేవతావ్రత కార్యేషు విత్తశాఠ్యం కరోతి యః. సర్వధర్మవినిర్ముక్తో నరకేషు నిమజ్జతి, జీవితం యాతి యఃకాలే జయంతీవాసరంవినా. తత్ఖండ మాయుషోప్యర్ధం నరాణాముపజాయతే, వ్యతిక్రమ్య గురో ర్వ్యాస్తుగురుంధర్మోపదేశకమ్. విప్రేంద్రస్స్వేచ్ఛయాధర్మంకుర్వా ణో నరకం వ్రజేత్,ధర్మమర్థంచ కామంచ యదీచ్ఛేదాత్మనః ప్రి యమ్. దద్యాచ్ఛక్తితో భక్త్యా గాంమహీం కాంచనంచయత్, ఫలంధాన్యంచ వస్త్రంచ యత్కించిద్భూరిజంతథా, దేవక్యాః ప్రసవేకాలే జాతే కృష్ణే జగత్పతౌ. జాతకర్మాదికర్తవ్య ముప దేశశ్చ చక్రిణః, పురాణోక్తేన మంత్రేణ కృష్ణం సంపూజయే న్నిశి శైత్యోపచారా న్దేవస్య తతోవిప్రాన్ప్రపూజయేత్, అది తే దేవమాత స్త్వం సర్వపాపప్రణాశిని. అతస్త్వాం పూజయిష్యా మి భీతోఽహం భవసాగరాత్. పూజితాసి యథా దేవైః ప్రసన్నా త్వం వరాననే, పూజితా చ యథాభక్త్యా ప్రసాదం కురు సువ్రతే. యస్యాంరాత్రౌ హరింలబ్ధ్వాప్రాప్తాత్వంనిర్వృ తిం పరాం, తామేవ నిర్వృతిం దేహిసుపుత్రం దర్శయస్వమే.

దేవపూజామంత్రః—అవతారసహస్రాణి కరోషి భగ వన్ విభో, తేషాం చైవతు మాహాత్మ్యం కశ్చిజ్జానాతివై భువి, దేవా బ్రహ్మాదయో యేఽపి స్వరూపం న విదుస్తవ.

కృష్ణప్రార్థనమంత్రః—అత స్త్వాం పూజయిష్యామి మాతుకుత్సంగసంస్థితమ్ వాంఛితం కురు మే తత్ర దుష్కృతం చైవ నాశయ, కృపాం కురుష్వ మే దేవ సంసారార్తిభయాపహ. ఏవం సంపూజ్య గోవిందం పాత్రే తులసిసంయుతం, చంద్రోదయేతు నిర్గత్య స్థండిలే సమలంకృతే. శంఖతోయం సమాదాయ సుపుష్పఫలచందనం, సుమంత్రమవనీం గత్వా చంద్రాయార్ఘ్యం నివేదయేత్. అర్ఘ్యమంత్రం సముచ్చార్యర్ఘ్య సర్వపాపైః ప్రముచ్యతే.

అర్ఘ్యమంత్రః—క్షీరోదార్ణవసంభూత హ్యత్రినేత్రసముద్భవ, గృహాణార్ఘ్యం మయా దత్తం రోహిణ్యా సహిత శ్శశిన్. జ్యోత్స్నాపతే నమస్తుభ్యం నమస్తే జ్యోతిషాంపతే, నమస్తే రోహిణీకాంత సుధాకర నమోఽస్తు తే.

ఇతి చంద్రార్ఘ్యమ్.

నారికేళోదకే నైవ దద్యా దర్ఘ్యం విచక్షణః, శ్రీకృష్ణ పరయా భక్త్యా శంఖే కృత్వా విధానతః.

అథ కృష్ణార్ఘ్యమంత్రః—జాతః కంసవధార్థాయ భూభారోత్తారణాయచ, పాండవానాం హితార్థాయ ధర్మసంస్థాపనాయచ కౌరవాణాం వినాశాయ వసుదేవకులోద్భవ, దేవకీగర్భసంభూత భక్తానా మభయప్రద. గృహాణార్ఘ్యం మయా దత్తం ప్రసీద పురుషోత్తమ, దధిదూర్వాక్షతైర్యుక్తం దత్వా తం శశినే మునే తతస్తు పరతో విష్ణుం నిశాంతు శశితోనయేత్, అర్ఘ్యదానేన జాతస్య ఫలస్యోయత్తతాం శృణు. యో దద్యా త్సకలామూర్వీం సర్వరత్నసమన్వితాం, అర్ఘ్యదానేన తత్పుణ్యం లభతే నాత్ర సంశయః. గీతాశాస్త్రకలాపైశ్చ కుర్యాజ్జాగరణం నిశి, ధూపం దీపం చ నైవేద్యం తాం

బూలం దాపయేన్నరః. ఫలాని చ విచిత్రాణి దివ్యాని వివిధాని చ, ధూపం నీరాజనం చైవ కుర్యా దేవం పునఃపునః. వాసరే వాసుదేవస్య గీతాం వా వాచయే త్స్వయమ్. జన్మకోటికృతం పాపం ధక్ష్యతే తృణరాశివత్, యత్ర భాగవతం శాస్త్రం శ్రూయతే హరివాసరే. తత్ర జాగరణం కుర్యా దన్యథా పాపభాగ్భవేత్. స్నానం ప్రభాతసమయే విమలే సూర్యదీపితే. కృత్వా పూర్వాహ్ణికం కర్మ ఏకాగ్రకృత మానసః, తత స్స్వయం సమశ్నీయా జ్జయంత్యాం సముపోషితః, స్త్రీబాలవృద్ధసహితో మంత్రద్విజసమన్వితః, విధినానేన సహితో జయంతీవ్రతమాచరేత్. నారీ చేత్కారయే ద్భక్త్యా పురుషేణైకవింశతిః, న దౌర్భాగ్యం నవైధవ్యం న తస్యా స్త్వశుభం గృహే. ఏకాదశ్యష్టవింశత్యః కోటయ స్సముపోషితాః, తాభిస్తుల్యా జయంతీతు తస్మాదస్యాముపోషితః. అస్యాముపోష్య విధివ ద్దేహాంతే హరిసన్నిధిం, విమానశతకై ర్దివ్యైః పతాకధ్వజశోభితైః. వేణువీణామృదంగై శ్చ కృతశబ్ద మహర్నిశం, ఆరుహ్య దేవవ త్తత్ర ముదిత స్స్వజనై స్సహ. శ్రీరత్నదండైశ్చ కుతూహలేనసంసేవ్యమానస్తుముహుర్ముహుస్సః, ప్రయాతి విద్యాధరబృందజుష్టో మార్గం చ విష్ణోఃపరమేశ్వరస్య సూర్యోయథానాశయతే. తనుశ్రమం, స్వాచారహీనః కులకీర్తిసంపదః, రాష్ట్రం యథానాశయతే కురాజా తదా జయంతీ బహుపాపసంచయమ్. సఏవ పాపీ సపశుస్స గోఘ్నస్స బంధుహీన స్సచ శోచనీయః, జన్మాష్టమీం యో న కరోతి మూఢ స్సపాపచారీ నరకేషు పచ్యతే. కిమన్నదానై ర్గజగోప్రదానైః కిం వా మఖైర్గృహ శేషుసత్కృతైః, కిమాశ్రమై ర్ధ్యానతపోభిరుగ్రైర్జయం త్యహో యేనకృతా నభక్త్యా. యథోక్తా తే మయా

విప్ర జయంతీ సర్వకామదా, యాముపోష్య సకృద్భక్త్యాకృత
కృత్యో భవేన్నరః. తస్మా త్త్వమపి దేవర్షే కురు చాప్యాము
పోషణం, ఉపోషణా ద్ధరిశ్చంద్రః పరాం స్థితి మవాప్తవాన్.
సత్యంసత్యం పునస్సత్యం పారాశర్యేణ భాషితం, నాస్తిలోకే
పరం నాన్యజ్జయంత్యాస్తు సమం వ్రతమ్. న గంగా న గయా
కాశీ నావంతీమధురాపురీ, సరయూర్గండకీచైవ జయంత్యాశ్చ
సమా మతా. ధర్మదా కామదా చైవ హ్యర్థదా మోక్షదా
కలౌ, కురుష్వ ద్విజశార్దూల జయంతీవ్రత ముత్తమమ్.
జయంతీవ్రతమాహాత్మ్యం లిఖితం యస్యమందిరే, తస్య పుణ్య
ఫలం వక్ష్యే నారాయణసమం హి తత్. యత్ర యత్ర కలౌ
ప్రాప్తం భవే జ్జన్మాష్టమీవ్రతం, తత్రతత్ర హరిర్యాతి త్రిద
శైస్సహ నారద. స్వయ మాయాతి దేవేశో గృహం జన్మాష్ట
మీదినే, తేనేష్టం జన్మసస్సారం ఫలం త్రైలోక్యదుర్లభమ్.
కలౌ గృహేతు యః కృష్ణజయంతీం శాస్త్రసమ్మతం, విత్తాను
సారవిభవై ర్భక్త్యా యశ్చ ప్రపూజయేత్. పాపకోటివినిర్ముక్తో
యాంతి విష్ణోః పరంపదం, సర్వవేదేషు యత్పుణ్యం తత్ఫలంచ
వ్రతాధికమ్. నరకే తే న మజ్జంతి యావదాభూతసంప్లవం,
జయంతీదివసే ప్రాప్తే యేఽర్చయంతి ద్విజోత్తమాన్. సప్తజన్మా
ర్జితంపాపం తత్క్షణాదేవ నశ్యతి, తస్మా ద్విత్తానుసారేణ శ్రద్ధా
భక్తిసమన్వితః. జయంత్యాస్తు వ్రతం కుర్యా త్సంసారార్ణవ
తారకమ్ కలౌ ధేనుసహస్రాణి తిలధేనుశతాని చ, దత్వా
యత్ఫల మాప్నోతి శ్రీజయంతీవ్రతే కృతే. హేమభారసహ
స్రంతు యో దద్యాద్దానముత్తమం, తత్ఫలం లభతే మర్త్యో
జయంతీ జాగరేణ వా.

ప్రతిమామంత్రః—

ఆచార్యం పూజయేత్, షోడశోపచారా న్కృత్వా.

శ్రీకృష్ణప్రతిమాదానం ఉత్తమశ్రోత్రియస్యతు, వస్త్రాలంకారభూషాద్యై స్తాంబూలం దక్షిణాసహ. శ్రీకృష్ణః ప్రతిగృహ్ణాతు శ్రీకృష్ణో వై దదాతి చ, శ్రీకృష్ణ స్తారకోభాభ్యాం శ్రీకృష్ణాయ నమో నమః

ఇతిమంత్రేణ శ్రీకృష్ణప్రతిమాదాన మాచరేత్.

కోటిజన్మకృతం పాపం సద్యోగకాలే వినశ్యతి, ఇహ భుక్త్వాఖిలాన్భోగాన్ సర్వకామఫలప్రదాన్. పుత్రపౌత్రధనం ధాన్యం భవే త్కృష్ణస్య జన్మని, కృష్ణబ్రహ్మానందరసం కృష్ణనామసుధారసం, కృష్ణపాదాంబుజరసం పిబ జిహ్వే నిరంతరమ్.

శ్రీకృష్ణపరబ్రహ్మణే నమః.

కరారవిందేన పదారవిందం ముఖారవిందే వినివేశయంతం, వటస్య పత్రస్య పుటే శయానం బాలం ముకుందం మనసా స్మరామి. న్యూనాతిరిక్తాన్యపరిస్ఫుటాని యదీహ కర్మాణి మయా కృతాని, క్షమ్యాని చైతాని మమక్షమస్వ ప్రయాహి తుష్టిం పునరాగమాయ. కాయేన వాచా మనసేంద్రియైర్వా బుద్ధ్యాత్మనావా ప్రకృతేః స్వభావాత్, కరోమి యద్యత్సకలం పరస్మై నారాయణాయేతి సమర్పయామి.

ఇతి శ్రీబ్రహ్మాండపురాణే బ్రహ్మనారదసంవాదే శ్రీకృష్ణజయంతీవ్రతకథావిధానం సంపూర్ణమ్.

---

## శ్రీకృష్ణాష్టమీవ్రతకథ.

నారదమునీంద్రుఁడు బ్రహ్మను గాంచి "ఓ మహాత్మా! భక్తులపాలి కల్పవృక్షమా, నాయందుఁ గరుణయుంచి, శ్రీజయంతిమహిమమును, గోకులాష్టమి యనఁబరఁగు శ్రీకృష్ణా

ష్టమియొక్క మహిమను దెలుపుము. నేను భక్తితో దీని నాలకించి, శాశ్వతంబగుముక్తినొందెద" ననియడుగఁగా, సకల లోకములకెల్ల సృష్టికర్తయై వెలుఁగు బ్రహ్మ నారదునిం గాంచి యిట్లనియె "వత్సా! జయంతియొక్క ప్రభావం బెఱిఁగించెద నాలకింపుము. జయంతీప్రభావంబు వినుటవలనఁగాని, పఠించుట వలనఁగాని మానవుఁడు జయమును, పుణ్యమును బొందును వాని సకలపాపంబులు క్షణంబున నశించును. ఏడుజన్మంబుల లోనిపాపంబులు సైతము మటుమాయమైపోవును. అంతియ కాక తఱుగని పుణ్యమును గలుగును. కృష్ణజన్మాష్టమినాఁ డుపవాసంబు సేయువారికి పెక్కుయజ్ఞము లొనర్చినంత ఫలం బును, పెక్కుతీర్థంబులందు స్నానమొనర్చినంతఫలంబును గలు గును. కపిలగోవులు వేయింటిని బ్రతిదినంబును దానంబొసఁ గుటచేఁ గలుగుపుణ్యము జయంతినాఁ డుపవసించుటచే మాన వుఁడు బడయఁగలఁడు. దినదినంబునఁ బెక్కువేలకోట్లగత్తను లను, లెక్కలేని యేనుఁగులను, లెక్కలేనిగుఱ్ఱములను, కోట్ల కొలఁదికన్యలను దానముసేసినంతఫలంబు జయంతినాఁ డుప వాసంబుచేఁ బడయవచ్చునని మునీంద్రులు పేర్కొందురు. జయంత్యుపవాసమువలన కురుక్షేత్రమున లెక్కలేనిబంగారు బిందెలొసఁగుటచేఁ గలుగుఫలంబును, గురువు బ్రాహ్మణులు ప్రభువు వీరినిమిత్తము ప్రాణములువీడువారికి గలుగుఫల మును నిక్కముగఁ గలుగును.

నొచ్చినవారి యాపదలఁదొలఁగించుటవలని పుణ్యంబును, తీర్థయాత్ర లొనర్చువారికిఁ గలుగుపుణ్యమును, సత్యముదప్పని వారికిఁ గలుగుపుణ్యమును, అమావాస్యలందుఁ బితరులకుఁ దర్పణాదులొసఁగువారికిఁ గలుగుపుణ్యమును, గంగాయమునా

నదులందును, నర్మదానదియందును, సరయూ చంద్రభాగా నదులందును, మఱి యనేకపుణ్యనదులందును స్నానమొనర్చు వారికిఁ గలుగుపుణ్యమును, ద్వాదశులందు బ్రాహ్మణభోజనా దులవలనఁ గలుగుపుణ్యమును కృష్ణజన్మాష్టమీదినంబున నుప వసించి, రాత్రిజాగరణముండుటచేఁ గలుగును. తొల్లి యంబ రీషమహారాజు, శిశుపాలుఁడు, గాధిమహారాజు మఱియుఁ జెక్కుంద్రురాజులెందఱో జయంతినాఁడు శ్రీకృష్ణునిప్రీతికై యుపవాసములొనర్చి, రాజ్యముం బడసి, భూమండలమెల్లఁ బరిపాలించి శాశ్వతగతినొందిరి. వాలఖిల్యాదులగు మహా మునులు, వసిష్ఠాదులగుమహర్షులును జయంతినాటియుపవాస ముచేతవిష్ణులోకముంబొందిరి. గౌతమమహాముని, గార్గ్యమునీం ద్రుఁడు, జామదగ్న్యముని, శ్రీమద్రామాయణమురచియించిన వాల్మీకిముని మొదలగు మునీంద్రులందఱు శ్రావణబహుళ మున సప్తమిరోహిణి సమేతముగవచ్చు శ్రీకృష్ణాష్టమీజయంతు లయందు ఉపవాసమునొనర్చిరి. ఆదినముననే మహావిష్ణుప్రనమఁ బ్రీతికై యుపవాసాదు లొనర్పవలయును. అట్లొనర్చుటచేత జన్మాంతరములందలిపాపములును, బ్రహ్మహత్యమున్నగుపాపం బులును నశించెడిని. జయంతియుపవాసమువలనఁ గోటిజన్మము లందలి పాపములైనను, తెలిసియో తెలియకయో చేసినవై నను నొకయరజాములోపల నశింపఁగలవు, జయంతినాఁడు భోజనము చేసినవాఁడు శూద్రాన్నమును, శవముచేతియన్న మును దిన్నంతపాపంబునఁ బడిపోవును.

కృష్ణాష్టమినాఁ డుపవసింపనివానికి బ్రహ్మహత్య, సురా పానము, గోహత్య, స్త్రీవధము మొదలగు మహాపాపంబుల నొనర్చినవారిపాపంబుగలుగును. ముల్లోకంబులలోనివారి పా

పంబు నొడిగట్టును. జయంతినాఁ డుపవసింపనివాఁడు సంతతి లేనివాఁడు, జ్ఞానహీనుఁడు, పరాన్నముఁగుడుచువాఁడు వీరందఱును నరకమునకేగుదురు. జయంతినాఁడు విష్ణువును భక్తితో నారాధించువారియెడ కృష్ణుఁడును దేవకీదేవియు దయఁగలిగి యుందురు జయంతినాఁడు కృష్ణునిఁగూర్చి వ్రతముసేయువారు యమపురికేగక, వైకుంఠమునొందుదురు. వారికి లక్ష్మీదేవి ప్రసన్నురాలై సకలసంపదల నొసంగును. వారికి రాజభయము, దైవభయము, అగ్నివలనిభయము, సర్పములభయము, మెఱుపులవలనిభయము, గాలి, యాకసము నీరు వీనివలనిభయము ఇవియెల్లను, వాసుదేవునిస్మరణముచే క్షణములోనశింపఁగలవు. వానికి గోవులసంపద మెండగు. ధాన్యసంపదలు హెచ్చును. పుత్రపౌత్రాదులు గలుగుదురు. కడపట మోక్షము సైతము గలుగును. వానికి మానసికవ్యాధులుగాని, శారీరవ్యాధులు గాని, సర్పభయముగాని, లేవు. వానికి వివాదములు లేవు అకాలమృత్యువు సంభవిల్లదు. కామము మొదలగు కష్టములు వానికెప్పటికిఁగలుగవు. వానికులమునకును, కుటుంబమునకును రక్షణముగలుగును. ఆతఁడెచ్చటికిఁబోయినను జయంబొందును.

జయంతినాఁడు బుధవారము రోహిణీనక్షత్రమును వచ్చునేని, ఆనాఁ డుపవాసమొనర్చి, శ్రీకృష్ణునిఁ బూజించి యాతని చరిత్రములు చదివిన పక్షమునఁ దక్కినవ్రతములు కోట్లకొలఁదిగ నాచరించినను; దీనివలనఁ గలుగునంతటిపుణ్యము గలుగనేరదు. ప్రతిదినము దల్లిదండ్రులకు నమస్కరించుట చేతను, గురువును సంరక్షించుటచేతను గలుగు మహాపుణ్యము నూఱింతలుగఁగలుగును. భగవంతునిచరిత్రములు గీర్తించుచు భక్తులుండుప్రదేశ మెంతదవ్వున నున్నను బ్రాలుమాలక యట్టి

ప్రదేశముల కేగవలయును. నాలుగుయుగంబులందును సకల జనులును ఈపవిత్రమైన కృష్ణాష్టమీవ్రతంబుఁ దప్పక యాచరింపవలయును.

అని బ్రహ్మదేవుఁడుపలుకఁగా, నారదమునీంద్రుఁ డతని కిట్లనియె. ఓమహాత్మా! ఆవ్రతము సేయుట యెట్లు? అనతీయవే యని యడిగిన బ్రహ్మ యిట్లనియె.

వత్సా! సావధానుండవై వినుము. తొల్లిసనత్కుమారుఁడను మునీంద్రుఁడు హరిశ్చంద్రమహారాజున కీవ్రతమహిమను దెలిపెను. ఈవ్రతంబు కడునియమముతో నాచరింపవలయును. లేనిచో సంపూర్ణఫలముగలుగదు. గోకులాష్టమినాఁటిముందటి దినముననే యేకభుక్తిగావించి, మఱునాఁడు వేఁకువనే లేచి 'నేఁడు కృష్ణాష్టమీవ్రతంబు గావించెద' నని సంకల్పించుకొని, యానాఁ డుదయము నల్లనూవులునూఱి రాచుకొని, నూఱిన యుసిరికవడియముతోఁ దల పులుముకొని, తులసీదళముతోఁ గూడిన నీటితో స్నానముగావించి, యానీటితో నాచమనము సేయవలయును. అట్లు సేసినచో, తీర్థములన్నింటను స్నానము చేసినంతఫలము గలుగును. అట్లుస్నానముచేసి, మాధ్యాహ్నికానుష్ఠానములు గావించి, పరిశుద్ధుఁడై నిర్మలమనస్సుతోఁ దన యింటినడుమగాని, దేవాలయమునందుఁగాని, గోమయంబుతో నలికి, యందు బంగారు, వెండి, రాగి, మన్ను వీనిలో దేనితోనైనను జేసిన కలశమును నీటితోనింపి, నవరత్నములనందు వేయవలయును అటుపిమ్మట నాకలశమును నూతనవస్త్రముతోఁ జుట్టి, గోమయముతో నలికినమంటపమున నాకలశమునుంచి, దానిపై తండులములఁబోసి, యాకలశమునడుమ నొకతులమునకంటెఁ దక్కువకానంత యెత్తుతోఁజేసిన గోపాలకృష్ణ

విగ్రహమును స్థాపించి, భక్తితోఁ బూజలు సేయవలయును. శ్రాద్ధము, దానము, హోమము, సకలవ్రతములు, తీర్థయాత్రలు మొదలగు సత్కార్యములందు ద్రవ్యవంచన సేయరాదు గాన, ఈకృష్ణాష్టమీవ్రతమునందును శక్తివంచనలేక, సకలపూజలను జక్కఁగాఁ జేయవలయును. అట్లు శక్తివంచన సేయువారు పుణ్యము తఱిగి నరకమునఁ బడుదురు. జయంతి వ్రతమాచరింపనివాని యాయుస్సు నానాటికిఁ గ్రుంగిపోవును. ఆచార్యు లొనరించు గురూపదేశమును వినక, స్వేచ్ఛగాఁదిరుగుచుఁ దక్కినధర్మము లెన్ని చేసినవాఁడయినను విప్రేంద్రుఁడు నరకంబునఁ బడును. ధర్మార్థకామంబులఁ గోరునట్టిమానవుఁ డీ వ్రతంబు నేసి, దీని కంగముగా షోడశమహాదానములను శక్తికొలఁదిగాఁ జేయవలయును. లోకనాయకుఁడగు శ్రీవిష్ణుమూర్తి దేవకీగర్భంబున జన్మించినప్పుడు, శ్రీకృష్ణావతారుఁడయిన యా భగవంతునికి జాతకర్మ నామకరణాది క్రియలను జరుపనగును. ఆ రేయియంతయు నాలుగుకాలములందును పురాణోక్తవిధానంబునను, వేదోక్తవిధానంబునను శ్రీకృష్ణునికి షోడశోపచార పూజలు సలుపవలయును. బ్రాహ్మణులను దక్షిణాతాంబూలాదులతో సత్కరింపవలయును.

అట్లుసత్కరించి, యావల దేవమాతయగు అదితిఁగూర్చి సకలపాపంబులఁ బోఁగొట్టునట్టి యోదేవీ, సంసారసాగరంబునుండి భీతుఁడనై నిన్ను శరణుచొచ్చితిని. నాయొనర్చుపూజలంగొని, దేవతలయెడఁ బ్రసన్నురాలవైనట్లు నాయెడఁ బ్రసన్నురాలవుగమ్ము. మహావిష్ణువు నీగర్భవాసంబున జన్మించుటచే నీకెంతయానందము గలిగెనో యంతటి యానందము నాకొసఁ

గుము. నాకు నీసుపుత్త్రునిఁ జూపుము. అని యిదిటిం బ్రార్థించి, యావల భగవంతు నిర్విధంబున ధ్యానింపవలయును.

ఓసర్వవ్యాపియగు భగవంతుఁడా, నీవెన్ని యో యవతారంబుల నెత్తితివి. ఆయవతారములమహిమ యొవఁడెఱుఁగఁ గలఁడు. బ్రహ్మాదిదేవతలుసైతము నీమహిమం బెఱుఁగఁజాలరనునప్పుడు మానవు లెట్లెఱుఁగఁగలరు. సంసారభయంబుఁ దొలఁగించునట్టి యోమహాత్మా! పాపంబులఁ బోఁగొట్టి, నా యిష్టంబులఁ దీర్చునంతదయ యొనరింపుము అని యిట్లు భగవంతునిఁ బూజించి, తులసితోఁడఁగూడిన జలమును పాత్రము నందుంచుకొని, చంద్రోదయము కాఁగానే, శంఖముతో నీటిని గైకొని గంధపుష్పాక్షతలతోఁగూడఁ జంద్రున కర్ఘ్యము నొసఁగవలయును. అట్లు చంద్రున కొసఁగునప్పుడు క్షీరోదార్ణవసంభూత=పాల్కడలియందుఁ బుట్టినవాఁడా, అత్రినేత్రసముద్భవ=అత్రిమహాముని కంటినుండి పుట్టినవాఁడా, రోహిణీసహితః = రోహిణీసమేతుఁడవై, మయాదత్తం = నే నొసఁగు, అర్ఘ్యం-గృహాణ = అర్ఘ్యముఁ గైకొనుము. జ్యోత్స్నాపతే=వెన్నెలఱేఁడా, నమస్తుభ్యం=నీకు నమస్కారము. జ్యోతిషాంపతే=వెలుఁగుఱేఁడా, నమస్తే=నీకు నమస్కారము రోహిణీకాంత=రోహిణీ ప్రాణనాథుఁడా, నమస్తే=నీకు నమస్కారము. సుధాకర=అమృతకిరణములవాఁడా, తే-నమః-అస్తు=నీకు నమస్కారము. అను నీమంత్రము సెప్పుచు నర్ఘ్యము విడువవలయును. తర్వాత శ్రీకృష్ణమూర్తికిని ఎళనీటితో శంఖము మూలమున నర్ఘ్యము లొసఁగవలయును.

వసుదేవునికి దేవకీదేవికిని నయనానందకరుఁడవుగ జన్మించిన యోమహాత్మా, భక్తులకోర్కులఁ దీర్చు చింతామణివైన

వాఁడా, దుష్టుఁడగు కంసుని దుష్టులగు కౌరవులను దుర్యో ధనాదులను సంహరించి భూమిభరువుతగ్గించుటకును, శిష్టులగు పాండవులను సంరక్షించుటకును బుడమియం దవతరించిన వాఁడవు ఓపురుషోత్తమా! నేనొసఁగునట్టి యర్ఘ్యమును గైకొ నుము. అనిచెప్పుచు కృష్ణపరమాత్మకు నర్ఘ్యమొసఁగి, పెరుగు, గఱిక, అక్షతలు వీనితోఁగూడిన యర్ఘ్యమును చంద్రునికిని నొసఁగి, చంద్రాస్తమానమగువఱకు జాగరణము సేయవల యును. అర్ఘ్యదానముచేఁగలుగు పుణ్యము కొలఁదియెంతయో చెప్పెద నాలకింపుము. సకలరత్నములతో నిండినభూమిని దానంబుసేయువానికిఁ గలుగునంతటిపుణ్యం బాయర్ఘ్యదానము చేయువానికిఁ గలుగు ఇట్లు శ్రీకృష్ణునిఁ బూజించి, భగవద్గీత మున్నగు పవిత్రగ్రంథంబులను బఠించుచుఁ బ్రతిజామునను ధూపదీపనైవేద్యాదులగుషోడశోపచార పూజలను సల్పుచు నారాత్రి గడుపవలయును. ఆకృష్ణాష్టమినాఁడు సకలదేవతా ప్రీతికై శ్రీకృష్ణవ్రతంబు సల్పి, భగవద్గీతపారాయణము సేయుచుఁ బ్రొద్దుపుచ్చినచోఁ గోటిజన్మములందుఁ జేసినపాపంబు గడ్డివామివలె మాడిపోవును. జన్మాష్టమినాఁడు విష్ణుకథాకాల క్షేపంబు జరుగుచోటులకేగి, రేయియెల్ల నాకథలను వినుచు జాగరణంబు చేయవలయును. లేనిచోఁ బాపంబు గలుగును. మఱునాఁడు వేఁకువనే స్నానముసేసి, సకల బ్రాహ్మణులతోను బంధుమిత్రాదులతోను బారణసలుపవలయును. ఇవ్విధంబున జయంతివ్రతమును నియమంబుతో నాచరింపవలయును. స్త్రీ లయినచోఁ బురుషులచే నిరువదియొకమాఱు ఈవ్రతంబును జేయింపనలయును. అట్లు చేయించినస్త్రీకి దారిద్ర్యము గలు గదు. వైధవ్యము సంభవింపదు. ఆస్త్రీయొక్కగృహమున నెట్టి

యశుభంబులును వాటిల్లనేరవు. ఇరువదియొనిమిదికోట్ల యేకా దసులం దుపవాసంబుచేసినంత ఫలము జయంతినాఁటి యుప వాసముచేఁ గలుగును. కావున నీ శ్రీకృష్ణాష్టమినాఁ డుప వసించినవాఁడు దేహావసానంబునఁ బెక్కండ్రు వేల్పులు విమాన ములలోఁ గూర్చుండి వెంటనంటి రాఁగా, కిన్నరగంధర్వాదులు వేణువీణామృదంగాదు లగు వాద్యముల వాయించుకొనుచుఁ బాటలుపాడుచుండఁగా, బంధుజనులందఱును నెంబడించి చను చుండ దేవభృత్యులు బెత్తములను జేతులఁబూని ముందు నడువ నచ్చరలు వింజామరలు వైవఁ గడుముదంబుతోడ వైకుంఠము నొందుచున్నాఁడు

సూర్యుఁడు దేహశ్రమముఁబోకార్చుచందమున, స్వధర్మ మును (=తననడవడిని) దప్పినవాఁడు కులమర్యాదను, కీర్తిని, సంపదను బోఁగొట్టుకొనుచందంబునను, చెడురాజు రాజ్యమును బోఁగొట్టుకొన్న చందమునను జయంతి సకలపాపములను బోఁ గొట్టును. శ్రీకృష్ణజన్మాష్టమీవ్రతంబును నాచరింపనిమూఢుఁడే మహాపాపి; వాఁడే గోహత్యచేసినవాఁడు; వాఁడే పశువు; వాఁడే బంధువులులేనివాఁడు; వాఁడే దరిద్రుఁడు; వాఁడే వేల కొలఁదిపాపములను జేసినంతపాపియై రౌరవాదినరకంబులను బొందుచున్నాఁడు.

జయంత్యుపవాసము భక్తితోచేయనివా రన్న దానము లెన్నిచేసినను, గజతురగంబు లెన్ని దాన మొసఁగినను, వేల కొలఁదిజన్నము లొనర్చినను, ఎన్నియాశ్రమధర్మము లొనర్చి నను, ఉగ్రతపంబులెన్ని యొనర్చినను నుపయోగంబులేదు.

ఓ నారదా, కోరికలనన్నిటి నొసఁగఁగల యీజయంతి నాఁ డుపవాస మొనర్చి శ్రీకృష్ణాష్టమీవ్రతంబు నాచరించు

వాఁడు కృతార్థతనొందుచున్నాఁడు. కావున నో దేవర్షీ! నీవును నీవ్రతంబు నాచరింపుము ఉపవాసవ్రతంబుసేయుము. తొల్లి హరిశ్చంద్రుఁ డీజయంతినాఁ డుపవాసముచేసి యుత్తము లోకంబుల నొందెను. వ్యాసుఁడు చెప్పిన యీవాక్యము ముమ్మాటికిని నిక్కము! జయంతివ్రతముతో సమానమగు వ్రతము మఱొక్కటి లేదు. గంగా, యమునా, నర్మదా, సరయూ, గండకీ, గోదావరీ, కృష్ణలు మొదలగునదీస్నానములు జయంత్యుపవాసముతో సాటికావు. కలియుగంబున నీవ్రతము చతుర్విధపురుషార్థముల నొసఁగునది.

జయంతీవ్రతప్రభావము దెల్పుగ్రంథ మెవ్వనియింట నున్నదో వాఁడు సాక్షాన్నారాయణమూర్తితో సమానుఁడు. కలియుగంబున జన్మాష్టమీవ్రతం బెచ్చటెచ్చట జరుగునో యచ్చటికి శ్రీమన్నారాయణమూర్తి సకలదేవతలతోఁడ సన్నిధి నొసఁగుచుండును.

పరమేశ్వరుఁడైన నారాయణుఁడు జన్మాష్టమినాఁ డుపవసించువానియింటికిఁ దానై సమీపించి యతనికిఁ గోర్కుల నెల్ల నొసఁగుచుండును. కలియుగంబున నీవ్రతంబును భక్తి నాచరించువారికి సకలపాపంబులు నశించును. వేదములన్నింటి యందుఁ జెప్పఁబడిన పుణ్యము గలుగును. వారు సూర్య చంద్రాదులున్నంతవఱకు నరకమునకుఁబోలేరు. జయంతినాఁడు బ్రాహ్మణోత్తములను బూజించువారికి నేఁడు జన్మములందుఁ జేసినపాపము వెంటనే నశింపఁగలదు.

కావున సంసారసముద్రమునుండి తరింపఁజేయఁగల జయంతీవ్రతంబు నాచరించి జాగర ముండువారికి వేయిగోవు లను నూఱుతిలరూపమైనగోవులను, అరువదితులముల బంగా

రును దానముచేసినవారికిఁ గలుగుఫలము గలుగును. కావున నీవ్రతంబు నాచరించి, భక్తితో నాచార్యునకు దక్షిణాతాంబూలాదులతోడ శ్రీకృష్ణుని ప్రతిమను

"శ్రీకృష్ణః ప్రతిగృహ్ణాతు శ్రీకృష్ణోవైదదాతిచ, శ్రీకృష్ణస్తారకోభాభ్యాం శ్రీకృష్ణాయ నమో నమః" అనుమంత్రమును జెప్పుచు దానముచేయవలయును. అట్లుచేయుటచేఁ గోటిజన్మలందార్జించిన పాపంబు నశించును. ఇట సకలభోగంబుల ననుభవించి, పుత్రపౌత్రాదిసంపదలను జెంది, తుదిని శాశ్వతమైన బ్రహ్మానందమునొందును. ఓనారదా! నీవు శ్రీకృష్ణుని పాదారవిందమకరందమును గ్రోలుము. శ్రీకృష్ణనామామృతమును ద్రావుము. బ్రహ్మానందరసముఁ బీల్చుము.

కేలుదమ్మిచే నడుగుఁదమ్మిని మోముదమ్మియందునుంచుకొని, మఱ్ఱియాకుపైఁ బరుండియున్న శ్రీబాలకృష్ణుని నమస్కరించెదను.

ఓమహాత్మా, నాయొనర్చుకర్మలలో లోపంబు లున్నను వానిని మన్నింపుము నేను త్రికరణములలోను, బుద్ధిపూర్వకముగనో, తనంతటనో చేయునన్ని కార్యములను శ్రీమన్నారాయణమూర్తికే యర్పించెదను. అని చెప్పుచు సకలక్రియలను జేయవలయును. అని బ్రహ్మయుపదేశించిన ప్రకారము నారదుఁ డీవ్రతంబు నాచరించెను సకలజనులును నారదునివలెనే దీనినాచరించి సకలపాపంబులఁ బోఁగొట్టికొని పుణ్యము వడయుదురుగాక.

శ్రీ బ్రహ్మాండపురాణంబున బ్రహ్మనారదసంవాదమున శ్రీకృష్ణజన్మాష్టమీవ్రతకథ సంపూర్ణము.



# శ్రీ రామ నవమీ వ్రతము.

ఆచమ్య, ప్రాణానాయమ్య, మాసపక్షాద్యుల్లిఖ్య, శ్రీపరమేశ్వరప్రీత్యర్థం మమ సమస్తపాపక్షయద్వారా శ్రీరామప్రీతయే రామనవమీవ్రతాంగత్వేనయథామిలితోపచారైః రామపూజాం కరిష్యే తత్రాదౌ నిర్విఘ్న పరిసమాప్త్యర్థం గణాధిపతిపూజాం కరిష్యే. పంచశబ్దైః పుణ్యాహవాచనం తథా రామమన్త్రేణ షడఙ్గన్యాసం కలశాద్యర్చనం చ కరిష్యే. గణాధిపతిపూజాం పుణ్యాహవాచనాది చ కృత్వా తతః ఫలపుష్పాక్షతసహితం జలపూర్ణం తామ్రపాత్రం గృహీత్వా. ఉపోష్య నవమీం త్వద్య యామేష్వష్టసు రాఘవ, తేన ప్రీతో భవ త్వం మే సంసారాత్త్రాహి మాం హరే. ఇతి మన్త్రేణ పాత్రస్థం జలం క్షిపేత్. తతః స్వశక్తితః హైమీం రామప్రతిమాం కృత్వా అగ్న్యుత్తారణపూర్వకం, కపోలౌ స్పృష్ట్వా మూలమంత్రం ప్రణవాదిచతుర్థ్యంతకనామ రామాయ దేవత్వం సంఖ్యాయ రామాయ దేవత్వం సంఖ్యాయ స్వాహేతి మన్త్రం పఠన్ ప్రాణప్రతిష్ఠాం కుర్యాత్. అథ ధ్యానమ్. కోమలాఙ్గం విశాలాక్షమిన్ద్రనీలసమప్రభం, దక్షిణాఙ్గే దశరథం పుత్రావేక్షణతత్పరమ్ పృష్ఠతో లక్ష్మణం దేవం సచ్ఛత్రం కనకప్రభం, పార్శ్వే భరతశత్రుఘ్నౌ చామరవ్యజనాన్వితౌ, అగ్రే ఉవ్యగ్రం హనూమన్తం రామానుగ్రహకాంక్షిణమ్ ఇతిధ్యాయేత్. సహస్రశీర్షా...లమ్. ఆవాహయామి విశ్వేశం జానకీవల్లభం ప్రభుం, కౌసల్యాతనయం విష్ణుం శ్రీరామం ప్రకృతేః పరమ్.

ఆవాహనమ్. శ్రీరామాగచ్ఛ భగవన్ రఘువీర నృపోత్తమ, జానక్యా సహ రాజేంద్ర సుస్థిరో భవ సర్వదా. రామచన్ద్ర మహేష్వాస రావణాంతక రాఘవ, యావత్పూజాం సమాప్యేఽహం తావత్త్వం సన్నిధౌ భవ. ఇతి సన్నిధాపనమ్. రఘునాయక రాజర్షే నమో రాజీవలోచన, రఘునన్దన మే దేవ శ్రీరామాభిముఖో భవ. ఇతి సమ్ముఖీకరణం పురుష ఏవే దగ్ంసర్వం...తి. రాజాధిరాజ రాజేన్ద్ర రామచన్ద్రమహీపతే, రత్నసింహాసనం తుభ్యం దాస్యామి స్వీకురు ప్రభో. ఆసనం. ఏతావానస్య...దివి. త్రైలోక్యపావనానన్త నమస్తే రఘునాయక, పాద్యం గృహాణ రాజర్షేనమో రాజీవలోచన. పాద్యమ్. త్రిపాదూర్ధ్వ ఉదైత్పురుషః...అభి పరిపూర్ణ పరానన్ద నమో రామాయ వేధసే, గృహాణార్ఘ్యం మయా దత్తం కృష్ణవిష్ణో జనార్దన. అర్ఘ్యమ్ తస్మాద్విరాడజాయత...పురః నమః సత్యాయ శుద్ధాయ నిత్యాయ జ్ఞానరూపిణే, గృహాణాచమనం నాథ సర్వలోకైకనాయక ఆచమనీయమ్. యత్పురుషేణ హవిషా...ద్ధవిః. బ్రహ్మాణ్డోదరమధ్యస్థైస్తీర్థైశ్చ రఘునన్దన, స్నాపయిష్యామ్యహం భక్త్యా త్వం గృహాణ జనార్దన స్నానమ్ మధువాతా...నః. నమః శ్రీవాసుదేవాయ తత్త్వజ్ఞానస్వరూపిణే మధుపర్కం గృహాణేమం జానకీపతయే నమః. మధుపర్కమ్ ఆప్యాయస్వేతి పంచమన్త్రైః పంచామృతమ్. పఞ్చామృతం మయా నీతం పయోదధి ఘృతం మధు, శర్కరాసహితం చైవ రామ త్వం ప్రతిగృహ్యతామ్ శుద్ధోదకస్నానమ్ చన్దనం పుష్పం ధూపం దీపం నైవేద్యం సమర్ప్య సంప్రార్థ్య నిర్మాల్యం విసృజ్య పురుషసూక్తేన విష్ణుసూక్తైశ్చ అభిషించేత్. ఆచ

మనీయమ్. సప్తాస్యాసన్నితివస్త్రమ్ తం యజ్ఞంబర్హిషి...యే తప్తకాంచనసంకాశం పీతామ్బరమిదం హరే, సంగృహాణ జగన్నాథ రామచన్ద్ర నమోఽస్తుతే. ఉపవస్త్రమ్. తస్మాద్య జ్ఞాత్...యే శ్రీరామాచ్యుతయజ్ఞేశ శ్రీధరానన్తరాఘవ, బ్రహ్మసూత్రం సోత్తరీయం గృహాణ రఘునన్దన. యజ్ఞోపవీతమ్. తస్మాద్యజ్ఞాత్సర్వహుతః...యత. కుంకుమాగరు కస్తూరీకర్పూరంచన్దనం తథా, తుభ్యం దాస్యామి రాజేన్ద్ర శ్రీరామ స్వీకురు ప్రభో. గంధాన్. అక్షతాః పరమా దివ్యాః...అలంకారార్థే అక్షతాన్. తస్మాదశ్వా అజాయన్త...వయః. తులసీకున్దమన్దార జాతిపున్నాగచమ్పకైః, కదమ్బకరవీరైశ్చకుసుమైః శతపత్రకైః నీలామ్బుజైర్బిల్వపత్రైశ్చంపకై రాఘవం విభుం, పూజయిష్యామ్యహం భక్త్యా సంగృహాణ జనార్దన. పుష్పపత్రాణి. తులసీకున్దమన్దారపారిజాతామ్బుజై ర్యుతాం, వనమాలాం ప్రదాస్యామి గృహాణ జగదీశ్వర. వనమాలాం సమ. అథాంగ పూజా—శ్రీరామచన్ద్రాయ నమః పాదౌపూజయామి. రాజీవలోచనాయగుల్ఫౌ. రావణాంతకాయ జానునీ. వాచస్పతయే ఊరూ. విశ్వరూపాయ జంఘే లక్ష్మణాగ్రజాయ కటిం. విశ్వమూర్తయే గుహ్యమ్. విశ్వామిత్రప్రియాయ నాభిం. పరమాత్మనే హృదయం. శ్రీకంఠాయ కంఠమ్. సర్వాస్త్రధారిణే బాహూ. రఘూద్వహాయ ముఖం. పద్మనాభాయ జిహ్వాం. దామోదరాయ దన్తాన్. సీతాపతయే లలాటం, జ్ఞానగమ్యాయ శిరః. సర్వాత్మనే సర్వాణ్యఙ్గాని. అత్ర శక్తౌ సత్యాం సహస్ర తులసీసమర్పణం అథవా అష్టోత్తరశత తులసీసమర్పణం వా కార్యమ్.

## అథ రామాష్టోత్తరశతనామావళి.

("ఓమ్" ఇతి ఆదౌ, "నమ" ఇత్యన్తే చ యోజ్యమ్.)

ఓం శ్రీరామాయ నమః
రామభద్రాయ
రామచంద్రాయ
శాశ్వతాయ
రాజీవలోచనాయ
శ్రీమతే
రాజేంద్రాయ
రఘుపుఙ్గవాయ
జానకీవల్లభాయ
జైత్రాయ 10
జితామిత్రాయ
జనార్దనాయ
విశ్వామిత్రప్రియాయ
దాన్తాయ
శరణత్రాణతత్పరాయ
వాలిప్రమథనాయ
వాగ్మినే
సత్యవాచే
సత్యవిక్రమాయ
వ్రతధరాయ 20
సదాహనుమదాశ్రితాయ
కౌసలేయాయ

ఓం ఖరధ్వంసినే నమః
విరాధవధపండితాయ
విభీషణపరిత్రాత్రే
సప్తతాళప్రభేత్రే
హరకోదండఖండనాయ
దశగ్రీవశిరోహరాయ
జామదగ్న్యమహాదర్పదళనాయ
తాటకాంతకాయ 30
వేదాన్తసారాయ
వేదాత్మనే
భవరోగస్యభేషజాయ
దూషణత్రిశిరోహన్త్రే
త్రిమూర్తయే
త్రిగుణాత్మకాయ
త్రివిక్రమాయ
త్రిలోకాత్మనే
పుణ్యచారిత్రకీర్తనాయ
త్రిలోకరక్షకాయ 40
ధన్వినే
దణ్డకారణ్యపుణ్యకృతే
అహల్యాశాపశమనాయ

ఓం పితృభక్తాయ నమః
వరప్రదాయ
జితేంద్రియాయ
జితక్రోధాయ
జితామిత్రాయ
జగద్గురవే
ఋక్షవానరసంఘాతినే 50
చిత్రకూటసమాశ్రయాయ
జయంతత్రాణవరదాయ
సుమిత్రాపుత్రసేవితాయ
సర్వదేవాధిదేవాయ
మృతవానరజీవనాయ
మాయామారీచహంత్రే
మహాదేవాయ
మహాభుజాయ
సర్వదేవస్తుతాయ
సౌమ్యాయ 60
బ్రహ్మణ్యాయ
మునిసంస్తుతాయ
మహాయోగినే
మహోదరాయ
సుగ్రీవేప్సితరాజ్యదాయ
సర్వపుణ్యాధికఫలాయ
స్మృతసర్వాఘనాశనాయ
ఓం ఆదిపురుషాయ నమః
పరమపురుషాయ
పుణ్యోదయాయ 70
దయాసారాయ
పురాణపురుషోత్తమాయ
స్మితవక్త్రాయ
మితభాషిణే
పూర్వభాషిణే
రాఘవాయ
అనన్తగుణగంభీరాయ
ధీరోదాత్తగుణోత్తరాయ
మాయామానుషచారిత్రాయ
మహాదేవాదిపూజితాయ 80
సేతుకృతే
జితవారాశయే
సర్వతీర్థమయాయ
హరయే
శ్యామాంగాయ
సుందరాయ
శూరాయ
పీతవాససే
ధనుర్ధరాయ
సర్వయజ్ఞాధిపాయ 90
యజ్వనే

జరామరణవర్జితాయ
విభీషణప్రతిష్ఠాత్రే
సర్వాగుణవర్జితాయ
పరమాత్మనే
పరబ్రహ్మణే
సచ్చిదానన్దవిగ్రహాయ
పరంజ్యోతిషే
పరంధామ్నే
పరాకాశాయ 100
పరాత్పరాయ
పరేశాయ
పారగాయ
పారాయ
సర్వదేవాత్మకాయ
పరస్మై

శ్రీరామాయ నానావిధ పరిమళపుష్పాణి.

యత్పురుషం వ్యదధుః... తే. వనస్పతిరసోద్భూతో గన్ధాఢ్యో గన్ధ ఉత్తమః, రామచన్ద్ర మహీపాల ధూపోఽయం ప్రతిగృహ్యతామ్ ధూపమ్ బ్రాహ్మణోఽస్య ముఖమాసీత్... యతే. జ్యోతిషాం పతయే తుభ్యం నమో రామాయ వేధసే, గృహాణ దీపకం చైవ త్రైలోక్యతిమిరాపహమ్. దీపమ్. చంద్రమా మనసో జాతః... యత. ఇదం దివ్యాన్నమమృతం రసైః షడ్భిః సమన్వితం, లేహ్యం పేయం చ నైవేద్యం సీతేశ ప్రతిగృహ్యతామ్. నైవేద్యమ్ మధ్యే పానీయం సమ. ఉత్తరాపోశనం సమ. హస్తప్రక్షాళనమ్. ముఖప్రక్షాళనం సమ. పాదప్రక్షాళనమ్. కరోద్వర్తనార్థమిదం చన్దనమ్ నాభ్యా ఆసీదంతరిక్షం... యుస్. నాగవల్లీదళైర్యుక్తం పూగీఫలసమన్వితం, తామ్బూలం గృహ్యతాం రామ కర్పూరాదిసమన్వితమ్. తామ్బూలమ్. ఇదం ఫలమితి ఫలమ్ హిరణ్యగర్భేతి దక్షిణా. మంగలార్థం మహీపాల నీరాజనమిదం హరే, సంగృహాణ జగన్నాథ రామచన్ద్ర నమోఽస్తు తే. రాజాధిరాజాయ ప్రసహ్య సాహినే, నమో

వయం వైశ్రవణాయ కుర్మహే, స మే కామాన్ కామకామాయ మహ్యం, కామేశ్వరో వైశ్రవణో దదాతు, కుబేరాయ వైశ్రవణాయ, మహారాజాయ నమః. నీరాజనమ్. నమో దేవాధిదేవాయ రఘునాథాయ శార్ఙ్గిణే, చిన్మయానన్తరూపాయ సీతాయాః పతయే నమః. నమస్కారః. సప్తాసాస్య. సహపరి...పశుమ్ యానికానిచ...జనార్దన. ప్రదక్షిణమ్ యజ్ఞేన యజ్ఞ... దేవాః. కోమలాంగం ఇతి పుష్పాంజలిమ్. నృత్తైర్గీతైశ్చ వాద్యైశ్చ పురాణపఠనాదిభిః, పూజోపచారైరఖిలైః సంతుష్టో భవ రాఘవ. సమస్తరాజోపచారార్థే అక్షతాన్. అశోకకుసుమైర్యుక్తం రామాయార్ఘ్యం సమర్పయేత్, దశాననవధార్థాయ ధర్మసంస్థాపనాయ చ. రాక్షసానాం వధార్థాయ దైత్యానాం నిధనాయ చ, పరిత్రాణాయ సాధూనాం జాతో రామః స్వయం హరిః. గృహాణార్ఘ్యం మయా దత్తం భ్రాతృభిః సహితోఽనఘ, శ్రీరామచన్ద్రాయ సాఙ్గాయ సపరివారాయ నమః ఇదమర్ఘ్యం సమర్పయామి. యస్య...తమచ్యుతమ్. ఆవాహనం న జానామి...మన్త్రహీనం...శ్రీరామచంద్రస్వామిన్ అనేన యథాజ్ఞానేన కృతపూర్వోక్తరాధనేన భగవాన్ శ్రీరామచన్ద్రః ప్రీయతామ్.

ఇతి శ్రీరామనవమ్యాం శ్రీరామనవమీపూజా సమాప్తా.

---

## శ్రీరామప్రతిమాదానోద్యాపనవిధిః.

ఇదం చ వ్రతం చైత్రశుద్ధనవమ్యాం పరవిద్ధాయాం మధ్యాహ్నవ్యాపిన్యాం కార్యమ్. తదుక్తమగస్త్యసంహితాయామ్—శ్లో. చైత్రశుద్ధేతు నవమీ పునర్వసుయుతా యది,

నైవ మధ్యాహ్నయోగేన మహత్పుణ్యతమా భవేత్. మాధవీయే.
దినద్వయేచబుధః యోగేమధ్యాహ్నే వ్యాప్తౌ ఏకదేశవ్యాప్తౌ
వా పరా, అన్యథా పూర్వా. తదుక్తం తత్రైవ. నవమీ చాష్ట
మీవిద్ధా త్యాజ్యా విష్ణుపరాయణైః. ఉపోషణంనవమ్యాంతు
దశమ్యాం పారణంభవేత్. చైత్రమాసే నవమ్యాంతు జాతో
రామః స్వయం హరిః, పునర్వస్వృక్షసంయుక్తా సా తిథిః సర్వకా
మదా. శ్రీరామనవమీ ప్రోక్తా కోటిసూర్యగ్రహాధికా, కేవలాపి
సదోపోష్యా నవమీశబ్దసంగ్రహాత్, తస్మాత్సర్వాత్మనా సర్వైః
కార్యం వై నవమీవ్రతమ్. అగస్త్యసంహితాయాం—
చైత్రే నవమ్యాంప్రాక్పక్షే దివా పుణ్యే పునర్వసౌ. ఉదయే
గురుగౌరాంశే స్వోచ్ఛస్థే గ్రహపఞ్చకే, మేషం పూషణి సం
ప్రాప్తే లగ్నే కర్కటకాహ్వయే ఆవిరాసీత్సకలయా కౌస
ల్యాయాం పరః పుమాన్. (వ్యా. ప్రాక్పక్షే=శుక్లపక్షే; ఉద
యే=లగ్నే; గురుగౌరాంశే = గురునవమాంశే) తస్మిన్ దినే
తు కర్తవ్య ముపవాసవ్రతం సదా, తత్ర జాగరణం కుర్యా
ద్రఘునాథపరో భువి. ("భువి"ఇతి ఖట్వాదివ్యావృత్త్యర్థమ్)
ప్రాతర్దశమ్యాం కృత్వా తు సంధ్యాద్యాః కాలికాః క్రియాః,
సంపూజ్య విధివ ద్రామం భక్త్యా విత్తానుసారతః. బ్రాహ్మ
ణాన్భోజయేద్భక్త్యా దక్షిణాభిశ్చ తోషయేత్, గోభూతిలహి
రణ్యాద్యైర్వస్త్రాలఙ్కారభూషణైః, రామం భక్త్యా ప్రయ
త్నేన పూజయేత్పరయా ముదా. ఏవం యః కురుతే భక్త్యా
శ్రీరామనవమీవ్రతం, అనేకజన్మసిద్ధాని పాతకాని బహూన్యపి.
భస్మీకృత్వా వ్రజత్యేవ తద్విష్ణోః పరమం పదం, సర్వేషా మ
ప్యయం ధర్మో భుక్తిముక్త్యేకసాధనః. అశుచిర్వాఽపి పాపిష్ఠః

కృత్వేదం వ్రతముత్తమం, పూజ్యః స్యాత్సర్వభూతానాం యథా రామస్తథైవ సః. యస్తు రామనవమ్యాంవై భుఙ్క్తే స చ నరాధమః, కుంభీపాకేషు ఘోరేషు పచ్యతే నాత్ర సంశయః. అకృత్వా రామనవమీవ్రతం సర్వవ్రతోత్తమం, వ్రతాన్యన్యాని కురుతే న తేషాం ఫలభాగ్భవేత్. రహస్యకృతపాపాని ప్రఖ్యాతాని బహూన్యపి, మహాన్తి చ ప్రణశ్యన్తి శ్రీరామనవమీవ్రతమ్ ఏకామపి నరో భక్త్యా శ్రీరామనవమీం మునే, ఉపోష్య కృతకృత్యః స్యాత్సర్వపాపైః ప్రముచ్యతే. నరో రామనవమ్యాంతు శ్రీరామప్రతిమాప్రదః, విధానేన మునిశ్రేష్ఠ స భక్తో నాత్ర సంశయః. సుతీక్ష్ణ ఉవాచ—శ్రీరామప్రతిమాదానం విధానం వా కథం మునే, కథయస్వ మునిశ్రేష్ఠ భక్తస్య మమ విస్తరాత్. అగస్త్యః—కథయిష్యామి తద్విద్వన్ ప్రతిమాదానముత్తమం, విధానం చాపియత్నేన యతస్త్వం వైష్ణవోత్తమః అష్టమ్యాం చైత్రమాసే తు శుక్లపక్షే జితేన్ద్రియః, దంతధావనపూర్వం తు ప్రాతః స్నాయాద్యథావిధి. నద్యాం తటాకే కూపే వా హ్రదే ప్రస్రవణేఽపి వా, తతః సంధ్యాదికం కుర్యాత్సంస్మరన్ రాఘవం హృది. గృహమాసాద్య విప్రేన్ద్రైః కుర్యాత్పూజాదికం పరం, దాన్తం కుటుమ్బినం విప్రం వేదశాస్త్రపరం సదా, శ్రీరామపూజానిరతం సుశీలం దంభవర్జితం, విధిజ్ఞం రామమన్త్రాణాం రామమన్త్రైకసాధనమ్. ఆహూయ భక్త్యా సంపూజ్య వృణుయాత్ప్రార్థయన్నితి, శ్రీరామప్రతిమాదానం కరిష్యేఽహం ద్విజోత్తమ. భక్త్యాఽఽచార్యో భవ ప్రీతః శ్రీరామోఽసి త్వమేవ చ, ఇత్యుక్త్వా పూజ్య విప్రేంద్రం స్నాపయిత్వా

తతఃపరమ్. తైలేనాభ్యజ్య చ స్నాయాచ్చిన్తయన్ రాఘవం హృది (తైలేన స్నాపయిత్వేత్యన్వయః) శ్వేతాంబరధరః శ్వేతమాల్యగన్ధానులేపనః, అర్చితో భూషితశ్చైవ కృతమాధ్యాహ్నికక్రియః. (అర్చితః = కృతార్చనః) ఆచార్యం భోజయేద్భక్త్యా సాత్త్వికాన్నేన విస్తరం, భుంజీత స్వయమప్యేవం హృది రామమనుస్మరన్. ఏకభుక్తవ్రతీ తత్ర సదాచారో జితేన్ద్రియః, శృణ్వన్ రామకథాం దివ్యామహశ్శేషం నయేన్మునే. సాయంసంధ్యాదికాః కుర్యాత్క్రియా రామమనుస్మరన్, ఆచార్యసహితో రాత్రావధశ్శాయీ జితేన్ద్రియః. వసేత్స్వయం నచైకాన్తే శ్రీరామార్పితమానసః, తతః ప్రాతః సముత్థాయ స్నాత్వా సంధ్యాముపాస్య చ ప్రాతః సర్వాణి కర్మాణి శీఘ్రమేవ సమాపయేత్, తతః స్వస్థమనా భూత్వా విద్వద్భిఃసహితస్తథా, స్వగృహస్యోత్తరే దేశే ద్వారస్యోత్తరమంటపం, చతుర్ద్వారం పతాకాఢ్యం సవితానం సుతోరణమ్. మనోహరం మహోత్సేధం పుష్పాద్యైః సమలఙ్కృతం, శఙ్ఖచక్రహనూమద్భిఃప్రాగ్ద్వారేసమలఙ్కృతమ్ గరుత్మచ్ఛార్ఙ్గబాణైశ్చ దక్షిణే సమలఙ్కృతం, గదా ఖడ్గాఙ్గదైశ్చైవ పశ్చిమే సువిభూషితం, పద్మస్వస్తికనీలైశ్చ కౌబేరైస్సమలఙ్కృతం, మధ్యేహస్తచతుష్కాఢ్యం వేదికాయుక్తమాయుతమ్. ప్రవిశ్య నృత్యగీతైశ్చ వాద్యైశ్చాపిసుసంయుతం, పుణ్యాహం వాచయేత్తత్ర విద్వద్భిః ప్రీతమానసః. తతః సంకల్పయేద్దేవం రామమేవ స్మరన్ మునే, అస్యాం రామనవమ్యాం చ రామారాధనతత్పరః. ఉపోష్యాష్టసు యామేషు పూజయిత్వా యథావిధి, ఇమాం స్వర్ణమయీం రామప్రతిమాం చ

ప్రయత్నతః. శ్రీరామప్రీతయే దాస్యే రామభక్తాయ ధీమతే, ప్రీతో రామో హరత్వాశు పాపాని సుబహూని మే. అనేక జన్మసిద్ధాని అభ్యస్తాని మహాన్తి చ, విలిఖేత్సర్వతో భద్రం వేదికోపరి సున్దరమ్ మధ్యే తీర్థోదకైర్యుక్తం పాత్రం సంస్థాప్య చర్చితం, సౌవర్ణే రాజతే తామ్రే పాత్రే షట్కోణమాలిఖేత్. తత్ర స్వర్ణమయీం రామప్రతిమాం పలమాత్రతః, నిర్మితాం ద్విభుజాం దివ్యాం వామాఙ్కస్థితజానకీమ్. బిభ్రతీం దక్షిణకరే జ్ఞానముద్రాం మహామునే, వామేనాధఃకరేణే శాం దేవీమాలిఙ్గ్య సంస్థితామ్. సింహాసనే రాజతేఽత్ర పలద్వయవినిర్మితే, పంచామృతస్నానపూర్వం సంపూజ్య విధివత్తతః. మూలమన్త్రేణ నియతో స్నానపూర్వమతన్ద్రితః, దివైవం విధివత్కృత్వా రాత్రౌ జాగరణం చరేత్. దివ్యాం రామకథాం శ్రుత్వా రామభక్తైః సమన్వితః, నృత్తగీతాదిభిశ్చైవ రామస్తోత్రైరనేకధా. పూజయన్విధివద్భక్త్యా దివారాత్రం నయేద్బుధః, తతః ప్రాతః సముత్థాయ స్నానసంధ్యాదికాః క్రియాః, సమాప్య విధివద్రామం పూజయేద్విధివన్మునే. తతో హోమం ప్రకుర్వీత మూలమన్త్రేణ మన్త్రవిత్, పూర్వోక్తపద్మకుణ్డే వా స్థండిలే వా సమాహితః. లౌకికాగ్నౌ విధానేన శతమష్టోత్తరం తతః, అన్నేన పాయసేనైవ స్మరన్ రామమనన్యధీః. తతో భక్త్యా సుసంతోష్య ఆచార్యం పూజయేన్మునే, కుణ్డలాభ్యాం సరత్నాభ్యాం మఙ్గులీయైరనేకధా. గన్ధపుష్పాక్షతైర్వస్త్రైర్విచిత్రైః సుమనోహరైః, తతో రామం స్మరన్ దద్యాద్దేవం మన్త్రముదీరయన్. ఇమాం స్వర్ణమయీం రామప్రతిమాం సమలఙ్కృతాం, చిత్రవస్త్ర యుగచ్ఛన్నాం

రామోఽయం రాఘవాయ తే. శ్రీరామప్రీతయే దాస్యే తుష్టో భవతు రాఘవః, ఇతి దత్వా విధానేన దద్యాద్వై దక్షిణాం పునః. అన్యేభ్యశ్చ యథాన్యాయం హిరణ్యాదీంశ్చ శక్తితః, దద్యాద్వాసోయుగం ధాన్యం యథావిభవమాదృతః. బ్రాహ్మణైస్సహ భుఞ్జీత తేభ్యో దద్యాచ్చ దక్షిణాం, బ్రహ్మహత్యాదిపాపేభ్యో ముచ్యతే నాత్ర సంశయః. తులాపురుష దానాదిఫలం ప్రాప్నోతి సువ్రత, అనేకజన్మసంపన్నపాపేభ్యో ముచ్యతే ధ్రువం, బహునా కిమిహోక్తేన ముక్తిస్తస్య కరే స్థితా కురుక్షేత్రే మహాపుణ్యే సూర్యపర్వణ్యశేషతః, తులాపురుషదానాద్యైః కృతైర్యల్లభ్యతే ఫలం, తత్ఫలం లభతే మర్త్యో దానేనానేన సువ్రతి.

ఇతి రామప్రతిమాదానోద్యాపనవిధిః.

---

## శ్రీరామనవమీవ్రతకథా.

అగస్త్య ఉవాచ.—రహస్యం కథయిష్యామి సుతీక్ష్ణ మునిసత్తమ, చైత్రమాసే నవమ్యాం తు శుక్లపక్షే రఘూత్తమః. ప్రాదురాసీత్తతో బ్రహ్మ బ్రహ్మనష్టైకకేవలః. తత్ర జాగరణం కుర్యాద్రామస్య పురతో బుధః, ప్రతిమాయాం యథాశక్తి పూజా కార్యా యథావిధి. ప్రాతర్దశమ్యాం స్నాత్వైవ కృత్వా సంధ్యాదికాః క్రియాః, సంపూజ్య విధివద్రామం భక్తివిత్తానుసారతః. బ్రాహ్మణాన్ భోజయేత్సమ్యక్ దక్షిణాభిశ్చ తోషయేత్, గోభూతిలహిరణ్యాద్యై ర్వస్త్రాలంకారభూషణైః. రామం భక్త్యా ప్రయత్నేన ప్రీణయేత్పరయా

హ్యాష్టపుత్రా భవిష్యతి, తృతీయాదీపదానేన సర్వసంపత్కరో భవేత్. చతుర్థీ దీపదానేన సర్వసౌభాగ్య కారణం, పంచమీ దీపదానేన రాజత్వం ప్రాప్నుయాన్నరః. షష్ఠ్యాం తు దీపదానేన రాజ్యప్రాప్తిం భజేన్నరః. సప్తమ్యామింద్రలోకం చ తస్య సాన్నిధ్యమష్టమే, నవమ్యాం దీపదానేన చేంద్రత్వం జాయతే ధ్రువమ్. దశమ్యాం దీపదానేన బ్రహ్మసాన్నిధ్యమాప్నుయాత్, ఏకాదశ్యాం దీపదానం బ్రహ్మలోకకరం నృణామ్. ద్వాదశ్యాం దీపదానేన విష్ణులోకం సగచ్ఛతి, త్రయోదశ్యాం దీపదానం విష్ణుసాయుజ్య కారకమ్. చతుర్దశ్యాం దీపదానం ముక్తిం దాస్యతి నారద, పౌర్ణమాస్యామమావాస్యాం చ మోక్షప్రాప్తిర్న సంశయః. మాసదీపప్రదానేన నరో మోక్షమవాప్నుయాత్, వత్సరే దీపదానేన నరః సాయుజ్యమాప్నుయాత్ హరేః. బ్రాహ్మణః క్షత్రియో వైశ్యో శూద్రో వా చరతే వ్రతం జీవం వ్రతం పంచవర్షం కుర్యాద్భక్తిసమన్వితః. దినేదినే వర్తిశతం విష్ణుప్రీత్యై దదన్నరః, ఘృతేనాహుతిర్మేధావీ ప్రీణయేచ్చ హుతాశనమ్ ఏవం యా కురుతే నారీ మోక్షప్రాప్తిర్న సంశయః, ఏతద్వ్రతస్య మాహాత్మ్యం శ్రద్ధయా శ్రూయతే యది. స నరః స్వర్గమాప్నోతి యావదాభూతసంప్లవం, యే వ్రతం దృష్టవంతోపి తేఽపి యాన్తి పరాం గతిమ్. ఏతత్తే కథితం సర్వం వ్రతానాముత్తమం వ్రతమ్.

ఇతి శ్రీబ్రహ్మాండపురాణే బ్రహ్మనారదసంవాదే

శతవర్తివ్రతకల్పః సంపూర్ణః.

---

## శతవర్తివ్రతకథ.

నైమిశారణ్యమందున్న మహర్షులందఱు తమయాశ్రమమునకు విచ్చేసిన సూతపౌరాణికుం జూచి, "మహాత్మా! మాకొక్క వ్రతంబు దెలియఁజెప్పు"డని యడుగఁగా, సూతమహాముని ఋషులకిట్లనియె. శతవర్తివ్రతంబని యొక్కటి గలదు. దానిని బూర్వము బ్రహ్మదేవుఁడు నారదుని కుపదేశించెను. ఆతెఱఁగు మీకెఱింగించెద వినుఁడు. ఒక్కనాఁడు నారదుఁడు బ్రహ్మనుజూచి, "సర్వభూతేశుఁడా! నాకొక్క వ్రతంబునుపదేశింపుము. ఆవ్రతంబుచేయు విధానంబునుగూడఁ దెల్పుము." అని యడుగఁగా బ్రహ్మ యిట్లనెను. ఓనారదా! దీపదానముకంటె మించిన వ్రతంబొక్కటిలేదు. దానివలన నన్ని సంపదలు పడయవచ్చును. ఆవునేతినిగాని, నూవులనూనెంగాని బంగారుపాత్రమునఁగాని వెండిపాత్రమునఁగాని పోసి దీపమువెలిఁగించి దానముచేసినవానికి సకలపాతకంబులు దొలఁగును. పదివత్తులు వేసి దీపము వెలిఁగించి దానముచేసిన మహాపాతకములు దొలఁగును. నూఱువత్తులు వేసి వెలిఁగించి దానముచేసిన విష్ణుసాయుజ్యమునొందును. అంతకంటె హెచ్చువత్తులువేసి వెలిఁగించి యిచ్చువారు సాక్షాత్తుగా నింద్రాదులగువేల్పులేయై స్వర్గలోకంబున సుఖంబుల నన్నిటి ననుభవించి యంతమున వైకుంఠము నొందుదురు. మఱియు, ప్రజ్ఞ, ఆయుస్సు, సంపద, సద్గుణములు, ఔదార్యము మొదలగుసుగుణములును, పూర్వజన్మజ్ఞానమును మోక్షమును గలుగును. దీపము వెలిఁగించుటకు ఆవునెయ్యి శ్రేష్ఠము, నూవులనూనె మధ్యమము, ఇప్పనూనె యధమము. తక్కినవన్ని యధమాధమములు. ఆవునేతివలన జ్ఞానమోక్ష

ములు గలుగును. తిలతైలంబువలన సంపదయు కీర్తియుఁ గలుగును. ఇప్పనూనెవలన నెక్కువసుఖంబు గలుగును. ఆవునూనె శత్రునాశము మొదలగు కామ్యార్థముల నొసఁగును. ఆముదముచే సంపదయు, ఆయువును నశించును. గేదెనేతితో దీపము వెలిగించిన, పూర్వపుణ్యముగూడ నశించును. కావున శక్తిలేనివారు కొంతయావునేతిని గలిపియైనను దీపము వెలిఁగించుట మంచిది. నాలుగువత్తులు వేసి వెలిఁగించుటచే రాజ్యమును, పదివత్తులువేసిన చక్రవర్తిత్వమును, ఏఁబదివత్తులువేసిన దేవలోకమును, నూఱువత్తులు వేసిన వైకుంఠమును, వేయి వత్తులువేసిన విష్ణురూపమును గలుగును. పుణ్యక్షేత్రమున దీపదానమువలన రెండింతలును, గంగాతీరమున మూఁడింతలును, కార్తికమాసమున నాలుగింతలును ఫలంబుగలుగును. అని బ్రహ్మదేవుఁడు సెప్పఁగా, నారదమునీంద్రుఁ డిట్లనియె. ఓభగవంతుఁడా! యీవ్రతము చేయవలసిన కాలము; దానికిఁ దగు ద్రవ్యము మొదలగునవి చెప్పుము అని యడుగఁగగా, బ్రహ్మదేవుఁడును, నారదునింజూచి, నారదా! మాఘ, వైశాఖ, కార్తిక మాసములలో దేనియందయిన నొక శుభదినమున నీవ్రతంబు నారంభించి యామాసాంతమువఱకు నిట్లు నైదుసంవత్సరములుచేయుచు, వ్రతమారంభించునప్పుడుగాని, మధ్యనుగాని, కడనుగాని యుద్యాపనము చేయవలెను. ఉద్యాపనముచేయక యుండరాదు. అప్పుడు వ్రతముచేసియు నుపయోగము లేదు. ఉద్యాపనను వారివారిశక్తి ననుసరించి చేయవలెను. మొదట పుణ్యాహము చేయుట, ఆచార్యవరణము, ఋత్విక్కులవరణము లక్ష్మీనారాయణ ప్రతిమను బంగారమున ౧౦౦ా గురిగింజలెత్తు

లోగాని, ౫౮ గురిగింజలయెత్తునఁగాని, ౨౭ గురిగింజలయెత్తునఁ గాని చేయించి, ప్రతిమాశోధనము చేయింపవలసినది తర్వాత మండపము నలంకరించి, యందు కుంచెడు బియ్యము పోసి, యందు ప్రతిమనునిచి, బంగారుతోఁగాని, వెండితోఁగాని చేసిన ప్రమిదెయందు బంగారువర్తితో గోవునేయి పోసి దీపమున జ్యోతిని వెలిఁగింపవలయును. తర్వాతషోడశోపచారపూజ గావింపవలయును. తర్వాత "తద్విష్ణో... రాతతమ్" అనుమంత్రముతో ౧౦౮ మార్లులు హోమము, తర్పణమును, అర్ఘ్యమును జేయింపవలయును. ఈవ్రతము నాచరించువారు పంచదార, నేయియు గలిపిన పాయసాన్నమును హోమమును జేయింపవలెను. తర్వాత ఋత్విక్కులకు కలశవస్త్రప్రతిమా దానంబు గావించి, తర్వాత మంటపమును, దీపమును విద్వాంసుఁడయిన తన యాచార్యునకు దానముచేయుచు, సాలగ్రామ దానము, దశదానములు మొదలగు విశేషదానములును చేయవలెను. తర్వాత నూటయెనమండ్రు బ్రాహ్మణులకు మృష్టాన్నంబు పెట్టి, తర్వాత ఋత్విక్కులకు దక్షిణాతాంబూల దానము చేయవలయును. ఈవ్రతంబు నిట్లాచరించువారికి విష్ణునిసాయుజ్యము గలుగును. ఓమునిపుంగవా! పాడ్యమి నాఁడు దీపదానము వైధవ్యనాశమును, విదియనాఁ డెనమండ్రు పుత్రులును, తదియనాఁడు సకలసంపదలును, చవితినాఁడు సువాసినీత్వమును, పంచమినాఁడు ప్రభుత్వమును, షష్ఠినాఁడు చక్రవర్తిపదవియు, సప్తమినాఁ డింద్రపదవియు, అష్టమినాఁ డింద్రసాయుజ్యమును, నవమినాఁ డింద్రత్వమును, దశమినాఁడు బ్రహ్మలోక సన్నిధియు, ఏకాదశినాఁడు బ్రహ్మలోక ప్రాప్తియు,

ద్వాదశినాఁడు వైకుంఠ ప్రాప్తియు, త్రయోదశినాఁడు విష్ణు సాయుజ్యమును, చతుర్దశినాఁడు సంసారవిముక్తియు, పున్నమ, అమావాస్యలయందు మోక్షప్రాప్తియు గలుగును. నెలదినములును దీపదానము శాశ్వతమైనమోక్షమును, సంవత్సరముపొడుగున దీపదానము విష్ణురూపప్రాప్తియుఁ గలుగును. ఈవ్రతము నేవర్ణమువారైనను స్త్రీలయినను, పురుషులయినను అయిదు సంవత్సరములు చేసిన వారు మోక్షము నొందుదురు. ఈకథ విన్నవారును, వ్రతాచరణము చూచినవారును శాశ్వతముక్తి నొందుదు రని బ్రహ్మదేవుఁడు నారదున కెఱిఁగించినచొప్పున సూతుండు శౌనకాది మునీంద్రులకుం జెప్పెను. (ఉద్యాపన విధానము మొదలగునవి లక్షవర్తివ్రతమునందువలెనే కనుక నిచ్చట వ్రాయఁబడలేదు)

ఇది బ్రహ్మాండపురాణమున బ్రహ్మనారదసంవాదరూపమయిన శతవర్తివ్రతకథ సంపూర్ణము.

---

# లక్షవర్తివ్రతము.

శ్లో. శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజం,
ప్రసన్నవదనం ధ్యాయే త్సర్వవిఘ్నోపశాన్తయే.

ఆచమ్య. శుభేశోభనే ముహూర్తే ఆద్య బ్రహ్మణః... ఏవంగుణవిశేషణవిశిష్టాయామస్యాం శుభతిథౌ మమ వ్రతకల్పోక్తసంపూర్ణ ఫలావాప్త్యర్థరజస్సంపర్కోత్పన్నకృతవ్యభిచారాదిరహస్య పాప నివృత్త్యర్థం ప్రకాశకృతసమస్తదోష పరిహా

రార్థం ధర్మార్థకామమోక్షాది చతుర్విధ ఫలపురుషార్థసిద్ధ్యర్థం శ్రీలక్ష్మీనారాయణ దేవతాముద్దిశ్య, శ్రీలక్ష్మీనారాయణ దేవతా ప్రీత్యర్థం కల్పోక్తప్రకారేణ షోడశోపచారపూజాం కరిష్యే తదఙ్గత్వేన కలశారాధనం కరిష్యే. కలశస్య...సమాశ్రితాః. మం ఓమ్. ఆకలశేషు ధావతి...రాప ఓమ్. గఙ్గే చ...కారకాః. కలశోదకేన పూజాద్రవ్యాణి దేవమంటపమాత్మానం సంప్రోక్ష్య. అథ లక్ష్మీనారాయణ ప్రాణప్రతిష్ఠాం కుర్యాత్. మం. ఓమ్. అసునీతేపున...పహ్యాయతే. ఆవాహితో భవ, సుస్థిరో భవ, వరదో భవ, సుముఖో భవ, సుప్రసన్నో భవ, స్థిరాసనం కురు. అథ ధ్యానమ్ సహస్రార్క ప్రతీకాశం పద్మపత్రనిభేక్షణం, కోటికందర్పలావణ్యం దివ్యమాల్యామ్బరావృతం, లక్ష్మీ సమేతం దేవేశం పీతకౌశేయవాససమ్. స్మితవక్త్రముదారాఙ్గం ధ్యాయేల్లక్ష్మీపతిం హరిమ్. శ్రీలక్ష్మీనారాయణస్వామినేనమః ధ్యానంసమర్పయామి. ఆవాహయేజ్జగన్నాథం లక్ష్మ్యా సహ జగత్పతే, యావత్త్వాం పూజయిష్యామి తావత్త్వం సుస్థిరో భవ. శ్రీలక్ష్మీ...నమః ఆవాహనమ్. సింహాసనం మహాద్దివ్యం హేమరత్నసమన్వితం, మయా నివేదితం తుభ్యం గృహాణ జగతః ప్రభో. సింహాసనం పాద్యం గృహాణ దేవేశ గంధపుష్పాక్షతైర్యుతం, కరుణాకర దేవేశ గంగాజలమిదం ప్రభో. పాద్యమ్. అష్టద్రవ్యసమాయుక్తం స్వర్ణపాత్రస్థితం జలం, గృహాణ దేవ సర్వజ్ఞ సర్వదేవనమస్కృత. అర్ఘ్యమ్. దేవదేవ జగన్నాథ పురాణపురుషోత్తమ, మయా దత్తమిదం తోయం గృహాణాచమనం ప్రభో. ఆచమనీయమ్. గోక్షీరదధి సంయుక్తం శర్కరామధుసంయుతం, గృహాణ దేవ సర్వజ్ఞ

సర్వగీర్వాణసేవిత. మధుపర్కమ్. పంచామృతైః కురు స్నానం వేదమన్త్రైః సుసంయుతం, గృహాణ దేవ సర్వజ్ఞ లక్ష్మ్యాసహ జనార్దన. పంచామృతస్నానమ్. నదీనాం చైవ సర్వాసా మానీతం నిర్మలోదకం, స్నానం స్వీకురు దేవేశ మయా దత్తం సురేశ్వర. శుద్ధోదకస్నానమ్. వస్త్రయుగ్మం మయా దత్తం సుసూక్ష్మం స్వర్ణనిర్మితం, గృహాణ దేవదేవేశ సర్వ వేదాన్త గోచర. వస్త్రయుగ్మమ్. సువర్ణ తంతుభి ర్యుక్తం బ్రహ్మణా నిర్మితం పురా, ఆయుష్యవర్ధనం దివ్యం దదామి సురనాయక. యజ్ఞోపవీతమ్. శ్రీగంధం చందనోన్మిశ్రం కర్పూరేణచసంయుతం, విలేపనం సురశ్రేష్ఠ తవ ప్రీత్యై దదామ్యహమ్. గంధాన్ ధారయామి. అక్షతాన్ ధవళాన్ దేవ శాలీయాం స్తండులాన్ శుభాన్, హరిద్రామిశ్రితాన్ తుభ్యం గృహాణా సురసంహార. అక్షతాన్. కరవీరై ర్జాతికుసుమైశ్చంపకై ర్బకుళై శ్శుభైః, శతపత్రైశ్చ కల్హారై రర్చయేత్పురుషోత్తమమ్. పుష్పాణి పూజయామి.

## అథాఙ్గపూజా.

చంచలాయ నమః పాదౌ. చపలాయ నమః గుల్ఫౌ. సుపార్శ్వయే నమః పార్ష్ణిమ్. దీర్ఘజఙ్ఘాయనమః జఙ్ఘే. రమ్భోరవే నమః ఊరూ. పురుషోత్తమాయనమః కటిమ్. పద్మనాభాయనమః నాభిమ్. సువక్షసే నమః వక్షఃస్థలమ్. దీర్ఘ బాహవే నమః బాహూన్. సుకంఠాయ నమః కంఠమ్. కేశవాయ నమః ముఖమ్. సునాసికాయ నమః నాసికామ్. నీలోత్పలశ్యామాయ నమః నేత్రే. నారసింహాయ నమః శిరః. సర్వేశ్వరాయ నమః సర్వాణ్యఙ్గాని పూజయామి. ఇంద్రాయ నమః, అగ్నయే నమః,

యమాయ నమః, నిరృతయే నమః, వరుణాయ నమః, వాయవే నమః, కుబేరాయ నమః, ఈశానాయ నమః.

అథాష్టోత్తరశతనామపూజా.

"ఓమ్"అని మొదటను, "నమః"అని కడపటను జేర్పవలెను.

ఓం విష్ణవేనమః
లక్ష్మీపతయే
కృష్ణాయ
వైకుంఠాయ
గరుడధ్వజాయ
పరబ్రహ్మణే
జగన్నాథాయ
వాసుదేవాయ
త్రివిక్రమాయ
దైత్యాన్తకాయ ౧౦
మధురిపవే
తార్క్ష్యవాహాయ
సనాతనాయ
నారాయణాయ
పద్మనాభాయ
హృషీకేశాయ
సుధాప్రదాయ
మాధవాయ
పుండరీకాక్షాయ
స్థితికర్త్రే ౨౦
పరాత్పరాయ నమః
వనమాలినే
యజ్ఞరూపాయ
చక్రపాణయే
గదాధరాయ
ఉపేన్ద్రాయ
కేశవాయ
హంసాయ
సముద్రమథనాయ
హరయే ౩౦
గోవిందాయ
బ్రహ్మజనకాయ
కైటభాసురమర్దనాయ
శ్రీధరాయ
కామజనకాయ
శేషశాయినే
చతుర్భుజాయ
పాఞ్చజన్యధరాయ
శ్రీమతే
శార్ఙ్గపాణయే ౪౦

జనార్దనాయ నమః
పీతామ్బరధరాయ
దేవాయ
సూర్యచన్ద్రవిలోచనాయ
మత్స్యరూపాయ
కూర్మతనవే
క్రోడరూపాయ
నృకేసరిణే
వామనాయ
భార్గవాయ ౫౦
రామాయ
హలినే
కలికినే
హయవాహనాయ
విశ్వంభరాయ
శింశుమారాయ
శ్రీకరాయ
కపిలాయ
ధ్రువాయ
దత్తాత్రేయాయ ౬౦
అచ్యుతాయ
అనన్తాయ
ముకున్దాయ
దధివామనాయ
శ్రీనివాసాయ నమః
ప్రద్యుమ్నాయ
పురుషోత్తమాయ
శ్రీవత్సకౌస్తుభధరాయ
మురారాతయే
అధోక్షజాయ ౭౦
ఋషభాయ
మోహినీరూపధరాయ
సంకర్షణాయ
పృథవే
క్షీరాబ్ధిశాయినే
భూతాత్మనే
అనిరుద్ధాయ
భక్తవత్సలాయ
నరాయ
గజేంద్రవరదాయ ౮౦
త్రిధామ్నే
భూతభావనాయ
శ్వేతద్వీపసువాస్తవ్యాయ
సూర్యమండలమధ్యగాయ
సనకాదిమునిధ్యేయాయ
భగవతే
శంకరప్రియాయ
నీళాకాన్తాయ

ధరాకాన్తాయ నమః
వేదాత్మనే ౯౦
బాదరాయణాయ [య
భాగీరథీజన్మభూమిపాదపద్మా
సతాం ప్రభవే
స్వభువే
ఘనశ్యామాయ
జగత్కారణాయ
అవ్యయాయ
బుద్ధావతారాయ నమః
శాన్తాత్మనే
లీలామానుషవిగ్రహాయ ౧౦౦
దామోదరాయ
విరాడ్రూపాయ
భూతభవ్యభవత్ప్రభవే
ఆదిదేవాయ
దేవదేవాయ
ప్రహ్లాదపరిపాలకాయ నమః

ఇతి విష్ణ్వష్టోత్తరశతనామపూజాం సమర్పయామి.

(యద్యవకాశః, "విష్ణుసహస్రనామ పూజాం కరిష్యే" ఇతి సంకల్ప్య విష్ణుసహస్రనామపూజాం కుర్యాత్.) దశాఙ్గం గుగ్గులూపేతం సుగంధం చ మనోహరమ్. ధూపం గృహాణ దేవేశ సర్వదేవనమస్కృత. ధూపమాఘ్రాపయామి. ఘృతవర్తిసమాయుక్తం వహ్నినా యోజితం ప్రియం, అజ్ఞాననాశనం దేవ గృహాణ శ్రీమనోహర. దీపం దర్శయామి. ధూపదీపానంతరం శుద్ధాచమనీయమ్. రాజాన్నం సూపసంయుక్తం శాకచోష్య సమన్వితమ్. ఘృతభక్ష్య సమాయుక్తం నైవేద్యం ప్రతిగృహ్యతామ్ మహానైవేద్యమ్ అమూనిఫలవర్యాణిసమ్పూర్ణరసవన్తిచ, స్థాపితాని పురోభాగే గృహాణ జగతః ప్రభో. నానావిధ ఫలాని. శుద్ధాచమనీయమ్. పూగీఫలైస్స కర్పూరైర్నాగవల్లీదళైర్యుతం, ముక్తాచూర్ణసమాయుక్తం తామ్బూలం స్వీకురు ప్రభో. తామ్బూలమ్. తామ్బూలచర్వణానంతరం శుద్ధాచమనీయమ్. నీరాజనం గృహాణేదం పంచవర్తిసమన్వితం,

తేజోరాశిమయం దత్తం గృహాణ త్వం సురేశ్వర. నీరాజనమ్. నీరాజనానన్తరం ఆచమనీయమ్. ప్రదక్షిణంకరిష్యామి సర్వభ్రమనివారణం, సంసారసాగరాన్మాం త్వ ముద్ధరస్వ మహాప్రభో. ప్రదక్షిణనమస్కారాన్. యస్య...ముచ్యతం మంత్రహీనం క్రియాహీనం భక్తిహీనం జనార్దన, యత్పూజితంమయాదేవ పరిపూర్ణం తదస్తుతే. అనయా షోడశోపచారపూజయా భగవాన్ సర్వాత్మకః శ్రీలక్ష్మీనారాయణఃసుప్రీతో సుప్రసన్నో వరదోభవతు. ఆచరితవ్రతకల్పోక్తఫలసిద్ధిరస్తు. ఆచమ్య. పూర్వోక్త...ప్రీత్యర్థంఅర్ఘ్యదానంకరిష్యే. శ్లో.సహస్రార్క ప్రకాశాయ సహస్ర శిరసేనమః, ఇదమర్ఘ్యం మయా దత్తం సంగృహాణ జనార్దన లక్ష్మీ...ఇదమర్ఘ్యం ఏవం ద్వాదశార్ఘ్యాని (12) దద్యాత్. అనేన అర్ఘ్యదానేన లక్ష్మీ...భవతు. త్రివిక్రమాయ దేవాయ వాసుదేవాయ విష్ణవే, సర్వవ్రతఫలాధ్యక్ష వ్రతోక్తఫలదో భవ. ఇతి క్షమార్పణమ్.

ఇతి పూజావిధానం సమాప్తమ్.

---

## ఉద్యాపనప్రకరణమ్.

శ్లో. శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజం,
ప్రసన్నవదనం ధ్యాయే త్సర్వవిఘ్నోపశాన్తయే.

సర్వేభ్యో బ్రాహ్మణేభ్యో నమః. ఆచమ్య. ప్రాణానాయమ్య, శుభేశోభనే...ఏవంగుణ విశేషణవిశిష్టాయాంఅస్యాంశుభతిథౌ మమకల్పోక్తసంపూర్ణఫలావాప్త్యర్థం రజస్సంపర్కోత్పన్న కృతవ్యభిచారాది రహస్యపాపనివృత్త్యర్థం ప్రకాశకృతసమస్తదోషపరిహారార్థం శ్రీలక్ష్మీనారాయణదేవతా ముద్దిశ్య లక్ష్మీనారాయణదేవతా ప్రీత్యర్థం లక్షవర్తివ్రతోద్యాపనాఖ్యం

కర్మ కరిష్యే. తదాదౌ తదఙ్గత్వేన శుద్ధ్యర్థం వృద్ధ్యర్థం శాన్త్యర్థం అభ్యుదయార్థం చ ఏభిర్మహాజనైస్సహ స్వస్తి పుణ్యాహవాచనం కరిష్యే. ఆదౌ నిర్విఘ్నేన పరిసమాప్త్యర్థం మహాగణాధిపతిపూజాం కరిష్యే. ఇతి సంకల్ప్య, గణపతిపూజాం పుణ్యాహవాచనం చ కృత్వా. అథ ప్రాగ్దేశే గోమయేనానులిప్య రంగవల్ల్యాదిభిరలంకృత్య. తదుపరిపీఠంనిక్షిప్య తదుపరి అష్టదళపద్మం లిఖిత్వా, తత్ర శ్వేతవస్త్రద్వయం పరిస్తీర్య (తెల్లని రెండుబట్టలుపఱచి)తదుపరి పంచ ప్రస్థతండులాన్ నిక్షిప్య. (అయిదుమానికలబియ్యముఁబోసి) తన్మధ్యే అష్టదళపద్మం లిఖిత్వా, తత్ర తామ్రలోహప్రధానకలశంనిధాయ, తత్కలశే పంచపల్లవాని నారికేళం చ నిక్షిప్య నూతనవస్త్రమావేష్ట్య (క్రొత్తబట్టచుట్టి) తత్కలశే గంగాజలం పూరయిత్వామంటపస్య ఈశాన్యమారభ్య ప్రాగాదిక్రమేణ త్రయస్త్రింశత్కలశాన్ సప్రతిమాన్ సవస్త్రాన్ నిధాయ, మంటపస్య దక్షిణ దిగ్భాగే కనకవర్తిసహిత కాంస్యపాత్రే లక్షవర్తిదీపారాధనం కుర్యాత్. తత్ర గోఘృతం నిధాయ కాంస్యపాత్రాభావే మృణ్మయపాత్రే దీపారాధనం కుర్వన్తి ఏవంగుణవిశేషణ... తిథౌ మమ ఇహ జన్మని జన్మాన్తరేషు చ సంజాతసమస్తపాపక్షయార్థం విశేషేణ అస్మిన్ జన్మని ప్రథమార్తవదినమారభ్య ఏతావత్పర్యన్తం ఋతుకాలికాశాస్త్రీయనియమలోపేనఅజ్ఞానతో రజస్వలానోన్యస్పర్శాదిదోషేణ చ సంపాదితమహాపాపనివృత్త్యర్థం కామతో నిషిద్ధకాలకృతసురతాదిదోషప్రాయశ్చిత్తార్థం కాయికవాచికమానసికాన్యతమవ్యభిచారపురుష స్త్రీ సంభాషణాదిప్రాయశ్చిత్తార్థం పాతివ్రత్యధర్మలోపప్రాయశ్చి

త్త్వార్థం శరీరారోగ్యసిద్ధ్యర్థం సమస్తదోషపరిహారార్థం శ్రీ లక్ష్మీనారాయణప్రీత్యర్థం స్కాందపురాణోక్త కల్పప్రకారేణ యావచ్ఛక్తి ధ్యానావాహనాది షోడశోపచారపూజాం కరిష్యే. ఆదౌ లక్షవర్తిదీపారాధనం కరిష్యే. తత్రమన్త్రః. ఓమ్. ఉద్దీప్యస్వజాతవేదోపఘ్నం నిర్‌ృతిం మమ, పశూగ్ంశ్చ మహ్యమావహ జీవనం చ దశో దిశ. జ్యోతిష్మతీం త్వా సాదయామి జ్యోతిష్కృతంత్వాసాదయామి జ్యోతిర్విదంత్వా సాదయామి భాస్వతీం త్వా సాదయామి జ్వలన్తీంత్వా సాదయామి మల్మలాభవన్తీం త్వా సాదయామి దీప్యమానాంత్వా సాదయామి రోచమానాం త్వా సాదయామ్యజస్రాంత్వా సాదయామి బృహజ్జ్యోతిషం త్వా సాదయామిబోధయన్తీం త్వా సాదయామి జాగ్రతీం త్వా సాదయామి. ప్రయాసాయస్వాహా ఽఽయాసాయ స్వాహా వియాసాయ స్వాహా సుయాసాయ స్వాహోద్యాసాయ స్వాహా శుచే స్వాహా శోకాయ స్వాహా తప్యత్వై స్వాహా తపతే స్వాహా బ్రహ్మహత్యాయై స్వాహా సర్వస్మై స్వాహా. ఇతి ప్రణమ్య. మంటపస్యోత్తరదిగ్భాగే వంశపాత్రయుగ్మం నిధాయ, పునః సంకల్ప్య. పూర్వోక్తేవంగుణ ...శుభతిథౌలక్షవ్రతోద్యాపనాఙ్గం ప్రతిమాశోధనం కరిష్యే. (దధిసర్పిర్మధుక్షీరైశ్శర్కరేణఫలైస్సహా, ప్రక్షాళనంప్రకుర్వీత ప్రతిమాం శోధయేత్తతః) మన్త్రః. ఆప్యాయస్వ...గథే. ఇతిక్షీరేణ. దధిక్రావ్ణ్ణో...తారిషత్. ఇతిదధ్నా, శుక్రమసి ...రశ్మిభిః ఇతి ఘృతేన. మధువాతాఋతాయతే...భవన్తునః. ఇతి మధునా. తాశ్శర్కరాఅభవన్, తచ్ఛర్కరాణాగ్ం శర్కరత్వం, వజ్రోవైశర్కరాః పశురగ్నిర్యచ్ఛర్కరాభిరగ్నిం పరి

మినోతి, వజ్రేనై వాస్మై పశూన్ పరిగృహ్ణాతి. తస్మాద్వజ్రేణ పశవః పరిగృహీతాః, తస్మాత్ స్థేయా నస్థేయసో నోపహరతేత్రి సప్తాభిః పశుకామస్య ఇతి శర్కరయా ఆపోహిష్ఠామయో... చ నః ఇతి పంచామృతేనశుద్ధోదకేనప్రక్షాళ్య. ఉత్తమాగణ నాథస్య పూజా సంపత్కరీశుభా, భక్తాభీష్టప్రదా తస్మాద్ధ్యాయే త్తం విఘ్ననాయకమ్. ఓం గణానాంత్వాగణపతిగ్ం...సాద సమ్. గణపతిమావాహయామి, అథ పీఠపూజాం కుర్యాత్. ప్రాగ్ద్వారే ద్వారశ్రియై నమః, ధాత్రే నమః, విధాత్రేనమః, దక్షిణద్వారే ద్వారశ్రియై నమః, చండాయ నమః, ప్రచండా యనమః, పశ్చిమద్వారే ద్వారశ్రియై నమః, జయాయనమః, విజయాయనమః, ఉత్తరద్వారే ద్వారశ్రియై నమః, బలాయ నమః, ప్రబలాయనమః, మధ్యే చిచ్ఛక్త్యైనమః, సత్త్వాయనమః, రజసేనమః, తమసేనమః, పత్రేభ్యోనమః, దళేభ్యోనమః, కేసరే భ్యోనమః, తన్మధ్యే కర్ణికాయై నమః, తన్మధ్యే దశకలాత్మనే వహ్నిమండలాయనమః, వహ్నిమండలాధిపతయేబ్రహ్మణేనమః, తన్మధ్యే ద్వాదశకలాత్మనే సూర్యమండలాయ నమః, సూర్య మండలాధిపతయే విష్ణవేనమః, తన్మధ్యే షోడశకలాత్మనే రుద్రా యనమః, షోడశకలాత్మనే చంద్రమణ్డలాధిపతయే సర్వేశ్వరా యనమః, తన్మధ్యే సౌవర్ణమండపాయ నమః, తన్మధ్యే సహస్ర దళపద్మాయ నమః, తన్మధ్యే కల్పవృక్షాయనమః, తన్మధ్యే నవ రత్నఖచితసింహాసనాయనమః. అథత్రయస్త్రింశత్కలశోపరిపృథ క్పృథక్ దేవతానాం ఆవాహనం కుర్యాత్. ఆగచ్ఛదేవదేవేశ లక్ష్మ్యాసహజనార్దన, ఇమాంమయా కృతాం పూజాంగృహాణ సురపూజిత. ఓమ్. నారాయణాయవిద్మహే వాసుదేవాయధీమ

హి, తన్నో విష్ణుః ప్రచోదయాత్. శ్రీలక్ష్మీనారాయణం సాంగం సవాహనం సపరిచ్ఛదమావాహయామి, స్థాపయామి పూజయామి తతః బ్రహ్మమంటపే బ్రహ్మకలశే—శ్లో. బ్రహ్మాణం రక్తగౌరాఙ్గం చతుర్వక్త్రం జగత్ప్రభుం, అక్ష స్రక్కుండికాభీతి వరపాణిం విచింతయే. మన్త్రః. బ్రహ్మ దేవానాం పదవీః కవీనామృషిర్విప్రాణాం మహిషో మృగాణామ్. శ్యేనో గృధ్రాణాగ్ స్వధితిర్వనానాగ్ం సోమః పవిత్రమత్యేతి రేభన్. బ్రహ్మాణం సాంగం...ఆవాహయామి ఇత్యావాహ్య, అథ ఇంద్రాద్యష్టదిక్పాలకా నావాహయేత్. ఇంద్రోఽమరావతీనాథః శచీదేవ్యాస్తు నాయకః, వజ్రాయుధశ్చ ప్రాచీశః తస్య చైరావతో గజః. మంత్రః ఓమ్. ఇంద్రం వో విశ్వతస్పరి హవామహే జనేభ్యః, అస్మాకమస్తు కేవలః. ఇంద్రం లోకపాలక మావాహయామి, స్థాపయామి పూజయామి, శ్లో. అగ్నిస్తేజోవతీవాసీ స్వాహాదేవ్యాః ప్రియః పతిః, మేషారూఢః శక్తిధరః దిశ్యాగ్నేయాం ప్రతిష్ఠితః. మంత్రమ్. అగ్నిం దూతం వృణీమహే హోతారం విశ్వభేషజం, అస్య యజ్ఞస్య సుక్రతుమ్. అగ్నిం లోకపాలక మావాహయామి. శ్లో. యమస్సంయమనీనాథః శ్యామలాయా మనః ప్రియః, దండభృన్మహిషారూఢో దక్షిణస్యాం దిశి స్థితః. మంత్రః. యమాయసోమగ్ సునుత యమాయజుహోతా హవిః; యమగ్ం హ యజ్ఞో గచ్ఛత్యగ్నిదూతో అలంకృతః. యమం లోకపాలకమావాహయామి. కృష్ణాంగనా పురం యస్య దీర్ఘా భార్యా నరో వాహః, శస్త్రమున్తో నిరృతిశ్చనైర్ఋత్యాం దిశి సంస్థితః. పూషాణః పరా...తృష్ణయా సహ. నిరృతిం లోకపాలకమావాహయామి. శ్లో. పురీ

శ్రద్ధావతీ యస్య ప్రియభార్యా చ కాళికా, నక్రవాహః పాశ
ధరో వరుణః పశ్చిమేశ్వరః. మంత్రః. ఓమ్. ఇమం మే వరుణ
...చకే, వరుణం లోకపాలకమావాహయామి. శ్లో. వాయు
ర్గంధవతినాథః కించ తస్యాంజనాప్రియా, సారఙ్గవాహోధ్వజ
భృత్ వాయవ్యాం దిశి వర్తతే. మన్త్రః. ఓమ్. తవ వాయు
వృ...ణీమహే. వాయుంలోకపాలకమావాహయామి. శ్లో.
కుబేరశ్చాలకాయాం తు చిత్రరేఖా ప్రియాంగనా, హయో
వాహః ఖడ్గధర ఉదీచ్యాం దిశివర్తతే. మన్త్రః ఓమ్. సోమో
ధేనుగ్ం సోమో౽ర్వన్తమాశుం, సోమో వీరం కర్మణ్యం
దదాతు, సాదన్యంవిదథ్యగ్ం సభేయం, పితుః శ్రవణం యో
దదాతితస్మై. కుబేరం లోకపాలకమావాహయామి. శ్లో. యశో
వతీశ ఈశానః పార్వతీపరమేశ్వరః, ఈశాన్యాం దిశి సం
భాతి వృషారూఢస్త్రిశూలభృత్. మంత్రః. తమీశానం
జగతస్తస్థుషస్పతిం, ధియం జిన్వ మనసే హూమహేవయం,
పూషా నో యథా వేదసామసద్వృధే రక్షితా పాయురదబ్ధః
స్వస్తయే. ఈశానం లోకపాలకమావాహయామి. శ్లో. ఉత్తుంగ
వృషభారూఢం పద్మపత్రాయతేక్షణం, క్షేత్రపాలమహం
వన్దే సర్వారిష్టస్య శాన్తయే. మన్త్రః. ఓమ్. క్షేత్రస్య పతినా
వయగ్ం హి తేనేవ జయామసి, గామశ్వం పోషయిత్న్వా
సనో మృడాతీదృశే. క్షేత్రపాలకమావాహయామి. శ్లో. అభీ
ష్టమభయం శీఘ్రం మనసా చిన్తయన్నపి, పూజయేత్సర్వకా
ర్యేషు గృహే చ జయసిద్ధయే. మంత్రః. ఓమ్. యత ఇన్ద్రభ
యామహే తతో నో అభయం కృధి, మఘవఞ్ఛగ్ధిత ఉతన్న
ఊతయే విద్విషో విమృధోజహి. అభయంకరమావాహయామి.

శ్లో. ఊర్ధ్వస్థితం మహాకాయ మన్తరిక్షే మరుత్పథే, పూజయే ద్భక్తియుక్తం చ మనోగతవిధాయినమ్. మన్త్రః ఓమ్ ఊర్ధ్వ ఊషుణ ఊతయే తిష్ఠా దేవో న సవితా, ఊర్ధ్వోవాజస్యసని తా యదంజిభిర్వాఘద్భిర్విహ్వయామహే. ఊర్ధ్వపురుషమా వాహయామి. శ్లో. చిత్రవర్ణాం ధరాంసౌమ్యాం సర్వసస్యాల యాం శుభాం, చిన్తయేద్భక్తిమాన్ రక్తబలయుక్తకరా మ్బుజామ్. మన్త్రః. ఓమ్ స్యోనాపృథివిభవానృక్షరానివేశనీ, యచ్ఛానశ్శర్మసప్రథాః పృథివీమావాహయామి శ్లో. మాన దండం కరాబ్జేన వహన్తం భూమిశోధకం, వన్దేఽహం వాస్తు పురుషం శయానం శయనేశుభే. మన్త్రః. ఓమ్ వాస్తోష్పతే ప్రతి జానీహ్యస్మాంత్స్వావేశో అనమీవో భవానః, యత్త్వేమ హే ప్రతితన్నో జుషస్వ శన్న ఏధి ద్విపదే శం చతుష్పదే. వాస్తుపురుషమావాహయామి. శ్లో. గరుత్మద్వాహనారూఢం శఙ్ఖచక్రధరం హరిమ్. పీతామ్బరం హృది ధ్యాయేత్సర్వా భీష్టస్య సిద్ధయే. మన్త్రః. ఓమ్ ఇదం విష్ణుర్విచక్రమే త్రేధా నిదధే పదమ్, సమూఢమస్య పాగ్ంసురే. శ్రీమహావిష్ణు మావాహయామి. శ్లో. క్షీరాబ్ధిపుత్రికే దేవి సర్వదేవసు పూజితే, మత్పూజా గృహ్యతాం దేవి సుస్థిరే కమలా సనే మన్త్రః ఓమ్ సక్తుమివ తితఉనా పునన్తో యత్ర ధీ రా మనసా వాచ మక్రత, అత్రాసఖాయః సఖ్యాని జానతే భద్రైషాం లక్ష్మీర్నిహితాధివాచి. శ్రీమహాలక్ష్మీ మావాహ యామి. శ్లో. జ్వాలామాలాపరివృతం వహ్నిమండలమధ్యగం, ధ్యాయేత్కళాదశయుతం శక్తిధారిణమీశ్వరమ్. మన్త్రః. కద్రుద్రాయ ప్రచేతసే మీఢుష్టమాయ తవ్యసే, వోచేమశం

తమసగ్ం హృదే. రుద్రమావాహయామి. శ్లో. గౌరీం సువర్ణ వర్ణాభాం స్వర్ణపద్మసువాసినీం, పాశాఙ్కుశధరాం భూతి ధరాం చ శివవల్లభామ్. మన్త్రః. ఓమ్. గౌరీమిమాయ సలి లాని దక్షత్యేకపదీ ద్విపదీ సా చతుష్పదీ, అష్టాపదీ నవపదీ. బభూవుషీ సహస్రాక్షరా పరమే వ్యోమన్న్. గౌరీమావాహ యామి. శ్లో. అచ్యుతః కల్పవృక్షశ్చ అనన్తః కామధేనవః, చి న్తామణిస్తు గోవిన్దో నామత్రయముదాహృతమ్. అచ్యుతాయ నమః, అనన్తాయ నమః, గోవిన్దాయ నమః, ఆవాహయామి. స్థాపయామి పూజయామి. తతః కల్పోక్తప్రకారేణ సర్వోప చారైః పూజయేత్.

## లక్షవర్తి క్షీరతర్పణమ్.

ఆచమ్య ఏవంగుణ...తిథౌ శ్రీలక్ష్మీ...త్యర్థంమయాఽ ఽచరితలక్షవర్తివ్రత పరిపూర్తిద్వారా సకలఫలావాప్త్యర్థం లక్షవర్తివ్రతోద్యాపనాఙ్గం యవసహితక్షీరతర్పణం కరిష్యే. ఇతి సంకల్ప్య. నారాయణాయ విద్మహే...చోదయాత్. ఇతి మంత్రేణ 10,000 అయుతసంఖ్యయా క్షీరతర్పణం విప్రైః కార్యం అనేనక్షీరతర్పణేన భగవాన్ సర్వదే...వరదోభవతు ఏతత్ఫలం శ్రీలక్ష్మీనారాయణార్పితమస్తు. ఆచరితవ్రత సంపూర్ణ సకలఫలావాప్తిరస్తు.

## అథ లక్షవ్రతాఙ్గహోమవిధిః.

ఆచమ్య. ఏవంగుణ...తిథౌ శ్రీలక్ష్మీ...త్యర్థం ఆచరితస్య వ్రతస్య పరిపూర్తిద్వారా సకలఫలావాప్త్యర్థం శ్రీలక్ష్మీనా రాయణదేవతాముద్దిశ్య శ్రీలక్ష్మీ...త్యర్థం సమిదాజ్యచరువ్రీ హిభిః చతుర్విధహోమం కరిష్యే. లక్షవర్తివ్రతాఙ్గహో

మార్థమాచార్యం త్వాం వృణే, బ్రహ్మాణం త్వాం వృణే. సమిదాజ్యహోమమస్మదర్థం భవన్తః కుర్వన్తు. చరువ్రీహి హోమమస్మదర్థం భవన్తః కుర్వన్తు. వృతాః స్మః తథా కుర్మః. ఇతి ప్రతివచనం ఋత్విగ్భిర్వాచ్యమ్. తదంగమగ్ని ప్రతిష్ఠాపనం కరిష్యే. శ్వేతతణ్డులచూర్ణేన ప్రాదేశమాత్రం స్థండిలం చతురశ్రమండలం కల్పయిత్వా. ద్వాభ్యాం దర్భాభ్యాముల్లిఖ్య స్థండిలోల్లేఖనాదికం సర్వం కుర్యాత్. అథ ప్రతిష్ఠితేఽగ్నౌ చరుగ్ం శ్రపయిత్వా అభిఘార్య నిధాయ. తత్ర పట్పాత్రప్రయోగవిధిప్రకారేణ కుర్యాత్. (ఆజ్యహోమః.) (ఏకం ద్వే త్రీణిచత్వారి, ఇత్యాజ్యం గృహీత్వా,) అగ్నయే స్వాహా, ఉత్తరార్ధపూర్వార్ధే. అగ్నయ ఇదం న మమ, (ఏకం...త్వారి,) సోమాయస్వాహా, (దక్షిణార్ధపూర్వార్ధే, సోమాయేదం న మమ. తతః స్రుత్యుపస్తీర్య చరుమథ్యాద్విర వదాయ, అభిఘార్య, హవిః ప్రత్యభిఘారయతి. ఓమ్. నారాయణాయ విద్మహే...చోదయాత్స్వాహా. శ్రీవిష్ణవేనారాయణాయేదం న మమ, సక్తుమివతిత ఉనా...వాచిస్వాహా, లక్ష్మ్యై ఇదం న మమ. నారాయణగాయత్ర్యా సహస్రసంఖ్యయా హోమః కార్యః. తతః జయాదిహోమః పూర్ణాహుతిశ్చ కార్యః.

## అథ దశ దానమంత్రాః.

దేశకాలౌసంకీర్త్య. ఏవం...శ్రీలక్ష్మీనారాయణదేవతా ప్రీత్యర్థం మమ సకలపాపక్షయార్థం మదాచరిత లక్షవర్తివ్రత పరిపూర్త్యర్థం తదంగత్వేన. యథాశక్తి దశదానాని కరిష్యే. తతః ప్రతిగృహీతారం బ్రాహ్మణమామన్త్ర్య. శ్రీమహా

విష్ణుస్వరూపస్య బ్రాహ్మణస్య ఇదమాసనం, (సుఖాసనం,) ఇతి ప్రతివచనం, ఇదం పాద్యం, (సుపాద్యం ఇతి ప్ర. వ.) నమోఽస్త్వనంతాయ సహస్రమూర్తయే సహస్రపాదాక్షిశిరోరుబాహవే, సహస్రనామ్నే పురుషాయ శాశ్వతే సహస్రకోటీయుగధారిణే అయంవో గంధః, అలంకారార్థా ఇమేఅక్షతాః, (సంత్వక్షతాః,) సకలారాధనైః స్వర్చితమస్తు. తతః గోదానే గోపూజాం కృత్వా, ఓంభూ...దయాత్. ఇతి జలేన సంప్రోక్ష్య, గవామంగేషు తిష్ఠన్తి భువనాని చతుర్దశ, యస్మాత్తస్మాచ్ఛివం మే స్యాదతః శాన్తిం ప్రయచ్ఛ మే అస్మై బ్రాహ్మణాయ శ్రీమహావిష్ణుస్వరూపాయ యజుశ్శాఖా (ఋక్శాఖా) ధ్యాయినే...సగోత్రాయ...శర్మణే ప్రతిగ్రహీత్రే శ్రీమాణ్... గోత్ర...శాఖియః...శర్మాదాతాధర్మపత్నీసమేతోఽహంమమ సకలపాపక్షయార్థం శ్రీలక్ష్మీనారాయణప్రీత్యర్థం వ్రతపరిపూర్త్యర్థం స్వర్ణశృంగీం రౌప్యఖురాం తామ్రపృష్ఠాం కాంస్యదోహనాం వస్త్రాలంకారసంయుతాం పయస్వినీమిమాం గాం సవత్సాం సదక్షిణాం సతాంబూలాం శ్రీమహావిష్ణుప్రీతిం కామయమానస్తుభ్యమహం సంప్రదదే న మమ. ఇత్యుదకధారాపూర్వందద్యాత్, దేవస్యత్వా...గృహ్ణామి. ఇతి ప్రతిగృహ్ణీయాత్. గోదానసాద్గుణ్యార్థం దక్షిణాతాంబూలదానంతుభ్యమహం సంప్రదదే న మమ. గవ అభావే గోమూల్యం వా దద్యాత్. అథ దశ దానాది విశేషదానాని చ కుర్యాత్. తతఃపరం మనసోద్దిష్టదానాని కుర్యాత్. దశదానాని. గోభూతిలహిరణ్యాజ్యవాసో ధాన్యగుడానిచ, రౌప్యం లవణమిత్యాహు ర్దశదానాః ప్రకీర్తితాః. ఇతి దశధానాదివిషయఃసమాప్తః.

## అథ లక్షవర్తివ్రతకథా.

సుపుణ్యే నైమిశారణ్యే నానాద్రుమలతాయుతే, తత్ర స్థితా మహాభాగాః పుణ్యా బ్రహ్మర్షిసత్తమాః. ఆగతం చ మహాభాగం వేదశాస్త్రార్థకోవిదం, వ్యాసశిష్యం పురాణజ్ఞం పూజయిత్వా యథావిధి. ఊచుః ప్రాంజలయః సర్వే తపసా ద్యోతితప్రభాః. ఋషయ ఊచుః. నారీణాం గోప్యపాపానాం రజస్సంపర్కజాని చ, తాసాం ముక్తిప్రదం గుహ్యం వ్రతంబ్రూహి మహామతే సూతఉవాచ. సాధుఃపృష్టం మహాభాగా యన్మాం పృచ్ఛథ సాదరం, తదిదానీం ప్రవక్ష్యామి శృణుధ్వం మునిపుంగవాః. పురా కైలాసశిఖరే హేమప్రాసాదసత్తమే, రత్నసింహాసనాసీనం శంభుం శాశ్వతమవ్యయమ్. పార్వతీ భక్తిసంయుక్తా ఇదంవచనమబ్రవీత్, పార్వత్యువాచ. దేవదేవ జగన్నాథ నమస్తే కరుణాకర, నమస్తేఽస్తు సురాధ్యక్ష మయి వాత్సల్యమస్తిచేత్. నారీణాం గోప్యపాపానాం పాపాని వివిధాని చ, పరవాసాదిజం పాపం భర్తృనిష్ఠురభాషణాత్ భ్రూణిహత్యాదిజం పాపం గర్భభేదాదిజం తథా, పరమర్త్యాదికామార్థం రజః సంకరజం తథా. అసత్యవచనాత్పాపం నానావిషయకామనాత్, పతివంచనజం పాప మన్యద్బహువిధం భవేత్. సుందరం పురుషం దృష్ట్వా భ్రాతరం పితరం తథా, యోనిర్ద్రవతి నారీణాం తేజః స్పర్శాద్ఘృతం యథా. గర్భవిచ్ఛేదకరణాత్పక్షి భేదాత్తథైవచ, పాపవిక్రయతః పాకద్రవ్యస్యాపహారాత్తథా. పాపాని వివిధాన్యాసాం సంతిలోకే మహామతే, తస్మాత్తాసాం గతిర్నాస్తి కథం ముక్తిర్భవిష్యతి. క్రూరతా పిశునత్వం చ నిర్దయత్వం చ సాహసం, లోలుపత్వం

గృహేదా చేత్కథం తాసాంహి నిష్కృతిః. కేనోపాయేన దేవేశ మయి వాత్సల్యమస్తిచేత్, వద శీఘ్రం మహాదేవ ముక్తిర్భవతి కేన వా. పార్వత్యా వచనం శ్రుత్వా సర్వాసాం ముక్తిదాయకం, ఉవాచ సస్మితం వాక్యం సర్వలోకనమస్కృతః. ఈశ్వర ఉవాచ. సాధు చోక్తం త్వయా భద్రే స్త్రీణాం లోకేన విద్యతే, వ్రతమస్తి శుభేలోకేసర్వసంపత్ప్రదాయకమ్. పార్వత్యువాచ.- కేన చాదౌ పురా చీర్ణం మర్త్యలోకే ప్రకాశితం, కింమంత్రైః పూజ్యతే దేవ కింపుష్పైః కింఫలం భవేత్. కాని మంత్రాణి దేవేశ వ్రతస్యాస్య మహామతే, ఉద్యాపనవిధానం చ త్వయా వాచ్యందయానిధే. బ్రూహి సర్వం సురాధ్యక్ష తత్ర కా నామ దేవతా. ఈశ్వరఉవాచ.-శృణు దేవి ప్రవక్ష్యామి గుహ్యద్గుహ్యతమం శుభం, అనాయాసేన మర్త్యానాం నారీణాంచ విశేషతః. పుత్రపౌత్రధనైశ్వర్యదాయకం సర్వసాధనం, లక్షవర్తివ్రతం నామ సర్వకామఫలప్రదమ్. లక్షవర్తివ్రతం లోకే యా నారీ కురుతే ముదా, లక్షజన్మార్జితం పాపం తత్క్షణాదేవ నశ్యతి. వ్రతస్యాస్య క్రమం వక్ష్యే శృణు పార్వతి సాంప్రతం, ఆషాఢస్య సితే పక్షే దశమ్యాం నియతో వ్రతీ. ఏకవారం తు భుంజీత విష్ణోః ప్రీత్యై శుభాననే, ప్రాతరుత్థాయ నియత ఏకాదశ్యామతంద్రితః. ఆహ్నికం తు తతః కృత్వా వ్రతీ సంతుష్టమానసా, దేవదేవ జగన్నాథ లక్ష్మ్యా సహ జగత్పతే. తవ ప్రీతికరం దివ్యం లక్షవర్తివ్రతం హరే, కరిష్యామి జగన్నాథ అనుజ్ఞాం దాతు మర్హసి. నిర్విఘ్నంకురు దేవేశ దేవదేవరమాపతే, సంకల్పమేవం కృత్వాఽదౌ వ్రతమేతదుపక్రమేత్. మూఢాదిదోషరహితే అఖండాయాం తిథౌ వ్రతీ, ఆషాఢస్య సితే పక్షే ఏకా

దశ్యాముపక్రమేత్. ఉపవాసవ్రతానీహ వ్రతీకుర్యాదనన్యధీః, వర్తయో లక్షసంఖ్యాశ్చ కారయేచ్చ యథాక్రమమ్. కార్తికే శుక్లపక్షే చ ఏకాదశ్యాం సమాపయేత్, ద్వాదశ్యాం కారయేద్దేవి హోమం బ్రాహ్మణభోజనమ్. ఇతరాణి చ వ్రతాని పౌర్ణమాస్యాం సమాపయేత్, లక్షవర్తికృతై ర్దీపై ర్ఘృతనీరాజనైరపి. ప్రత్యహం పూజయే ద్దేవం యావల్లక్షం సమాపయేత్, సువాసినీనాం నారీణాం విధవానాం తథైవ చ. గోప్యాని చైవ పాపాని ప్రకటాని తథైవ చ, ప్రాయశ్చిత్తవిహీనాని దుస్సహాన్యపి వల్లభే. లక్షవర్తిప్రభావేన సర్వే నశ్యంతి నిశ్చితం, కోటయో బ్రహ్మహత్యానా మగమ్యాగమకోటయః, దహ్యన్తే లక్షవర్తీనాం దీపానామవలోకతః. పార్వత్యువాచ.- పూర్వం కయా కృతం చైతద్వ్రతం శంకర మే వద, తత్సర్వం శ్రోతుమిచ్ఛామి కృపాఽస్తి యది తేఽనఘ. ఈశ్వరఉవాచ.- ఇతిహాసం ప్రవక్ష్యామి సర్వపాపహరం శుభం, ఆర్యావర్తే పురా కాచి ద్వేశ్యాఽభూల్లక్షణాహ్వయా. తస్యాభుజఙ్గః శూద్రోఽభూ ద్దాసో నామ యువా బలీ. సా లక్షణా ఋతుస్నాతా స్థితా గోదావరీతటే, అవిదూరే దదర్శాథ బ్రాహ్మణీం మృతభర్తృకాం, బాల్యే వైధవ్యదోషేణ రుదన్తీం కురరీమివ మృతం పతిం పురః స్థాప్య బంధుభిః పరివారితాం, విలపన్తీం తు సా వీక్ష్య శనైస్తాం ప్రత్యపద్యత. లుఠన్తీం భువి కాయేన ముహుర్ముహు స్తీముఖో బహు. దృష్ట్వా సా లక్షణా వాక్యం స్వభుజంగమువాచ హ. కులజానాం చ నారీణాం దశేయమతిదారుణా, పరవశ్యం చ నారీణాం దుఃఖమామరణాంతికమ్. మృతాపత్యం చ వైధవ్యం తథైవాపుత్ర

తా స్త్రియాః, అసహ్యామేతత్త్రితయం వైధవ్యం తత్ర చోత్తరమ్. బాలేయం శోచతేఽతీవ కస్యేదం కర్మణః ఫలం, నివర్త్యతే వా కేనేదం కో వా వేత్తి వదానఘ. ఉవాచ దాసనామాఽసౌ భుజంగశ్చ శుభం వచః, శృణు భద్రే ప్రవక్ష్యామి స్రష్టాఽసృష్టాః పురా ద్విజాః. దేహినాం చైవ లోకానాం హితార్థం మన్త్రకోవిదాః, శాస్త్రజ్ఞానాత్స్వభావాచ్చ జీవినాం చ పురాకృతమ్. జానన్తి కర్మజఫలం వదన్తి చ దృఢవ్రతాః, భుజఙ్గవచనం శ్రుత్వా తథాహీతి చ సా పునః. తత్రాగతం మహావృద్ధం వేదశాస్త్రార్థకోవిదం, యాజకం నామ విప్రేంద్రం జ్వలన్తమివ భాస్కరమ్ పప్రచ్ఛేదం దయాధీనా త్యక్తకౌతుకమానసా, మునే త్వహం దురాచారా కులటా లక్షణాభిధా. తథాపి తే దయాపాత్రం పృచ్ఛన్తీం మాం వద ప్రభో, సాధూనాం సమచిత్తానాం జనాస్సర్వే సమా భువి. దుర్గంధో వా సుగంధో వా యథా వాయోః సమో భవేత్, మునే దశేయం నారీణాం తృతీయాఽతీవ దుస్సహా కర్మణా జాయతే కేన కేన వాఽస్యా నివర్తనమ్. ఏతద్విస్తార్య మే విద్వన్ కృపయా వద సువ్రత. లక్షణావచనం శ్రుత్వా యాజకో వాక్యమబ్రవీత్, దైవే కర్మణి పిత్ర్యే వా నార్యః పాకేషు సంస్థితాః. అకస్మాద్రజసో దోషాత్ స్పృష్టభాండాద్యుపస్కరాః, అజ్ఞానాద్వా భయాద్వాపి కామాల్లోభాత్కృచిత్ స్త్రియః. అవేదయిత్వా గచ్ఛన్తి తేన దుష్యన్తి సత్క్రియాః, క్రియాలోపకరా హ్యేతాః పాపాదస్మాద్దురత్యయాత్. దశామిమాం ప్రాప్నువన్తి సర్వా అపి న సంశయః, బాల్యేఽపి యౌవనే వాపి వార్ధక్యే వా కదాచన. తత్ర యా తు

దురాచారా పరానేవాభికాంక్షతి, శ్వశ్వ్రశ్చపతిబంధూనాం నిత్యం వాచా సుదుఃఖదా. ఏతత్పాపయుతా నారీ యా దూషయతి సత్క్రియాః, బాల్యే వైధవ్యమాప్నోతి సా నారీ నాత్ర సంశయః. యా చానుకూల్యరహితా పతిధర్మేషు సర్వదా, బాల్యే వైధవ్యమాపన్నా రతిహీనా భవత్యలమ్. సర్వాసామపి వైధవ్యనిధానం పుష్పసంభవం, శాన్తింతస్య ప్రవక్ష్యామి కర్మణోఽస్య చ లక్షణే. లక్షవర్తివ్రతం సమ్యక్కర్తవ్యం పాపనుత్తయే, పాపం గచ్ఛతి నారీణామితి వేదవిదో విదుః. పూర్ణశూర్పం సువాసిన్యా దాపయేచ్ఛ ముదాన్వితా, మూలాదశేషం వ్రజతి రజోదోషో న సంశయః నిర్మూలంతు వ్రజత్యాశు లక్షవర్తివ్రతే కృతే, రజసోత్థం మహాత్పాపం నారీణాం తు న సంశయః. ఇతి తద్వచనం శ్రుత్వా పునః పప్రచ్ఛ లక్షణా, మనసా శంకితా భూత్వా సాదరం మునిపుంగవమ్. సాధు సాధు మహాభాగా చిత్తం మే భయవిహ్వలం, లక్షవర్తివ్రతస్యాస్య విధానం కీదృశం వద. కస్మిన్ కాలే ప్రకర్తవ్యం కస్య వా తత్సమర్పణం, ఉద్యాపనం కథం కార్యం కిం ఫలం తస్య వా మునే. తయా పృష్టో యాజకోఽపి లోకానాం హితకామ్యయా, వక్తుం ప్రచక్రమే తస్యా లక్షవర్తివ్రతం శుభం, యాజకః—వాసుదేవే ప్రసుప్తేతు చాతుర్మాస్యాం విశేషతః, ఆషాఢే శుక్లపక్షే తు ఏకాదశ్యాం సమారభేత్. కార్తికే మాసి చేత్కుర్యా ద్వ్రతం మంగళదాయకం, సహస్రగుణితం దత్తం ఫలం మోక్షద మవ్యయమ్. కార్తికే చైవ వైశాఖే మాఘే చైవ విశేషతః, చైత్రేఽపి చ శుభం ప్రోక్తం యథావిభవసారతః. ఉద్యాపనవిధాం వక్ష్యే సర్వదాం సర్వ

మోహినీం, ప్రాతః స్నాత్వా శుచిర్భూత్వా పంచగవ్యం తు ప్రాశయేత్. పుణ్యాహవాచనం కృత్వా ఆచార్యం వరయే త్తతః, ఋత్విగ్భిర్బ్రాహ్మణై ర్యుక్తం కుర్యాత్తర్పణమంజసా. అక్షతైశ్చ యవైర్వాపి లక్ష్మీనారాయణం ప్రతి, దశాంశతః ప్రకుర్వీత వర్తీనాం తర్పణం బుధః తర్పణస్య దశాంశేన హోమం కుర్యాద్యథావిధి, తర్పణోక్తేన మన్త్రేణ పాయసం చ ఘృతాన్వితమ్. సాయంకాలే తు సంప్రాప్తే శుచిర్భూత్వా సమాహితః, గోమయేనానులిప్యాథ చతురశ్రం తు మండలమ్. తన్మధ్యేఽష్టదళం పద్మం పంచవర్ణైస్సుశోభితం, వితానమిక్షుఖండైశ్చ పఞ్చవర్ణైః సుశోభితమ్. తన్మధ్యేవస్త్రమాస్తీర్య తండులాన్ప్రస్థపంచకాన్, తన్మధ్యే కలశం దివ్యం పంచపల్లవశోభితమ్. వస్త్రోపరి న్యసేద్దేవం లక్ష్మీనారాయణం విభుం, బ్రహ్మణః కలశం వస్త్రం నిక్షిపేత్తండులోపరి. త్రయస్త్రింశత్సుశోభాఢ్యాన్ కలశాన్ విన్యసేత్తతః, నిక్షిప్య పంచరత్నాని పంచకోమలపల్లవాన్, ప్రతిమాశోధనం కృత్వా నిక్షిప్య కలశోపరి. ప్రాణప్రతిష్ఠాం కుర్వీత షోడశైరుపచారకైః, యామే యామేతు పూజాం చ కుర్యాజ్జాగరణం నిశి. పరేఽహ్ని ప్రాతరుత్థాయ కుర్యాద్వై దంతధావనం, నద్యాం స్నాత్వా ద్విజవరైః ప్రవిశేద్గృహముత్తమమ్. హోమం చ బ్రాహ్మణైః కార్యం స్వగృహ్యోక్తవిధానతః, పాలాశైః సమిద్భిశ్చైవ చరుణా పాయసేన చ. నారాయణస్య గాయత్ర్యా హోమం కుర్యాద్యథావిధి, తతో జయాదిహోమం చ పూర్ణాహుతిమనంతరమ్. పునఃపూజాం చ నైవేద్యం ధూపనీరాజనాదిభిః,

క్షమార్పణం ప్రకుర్వీత స్తోత్రైరేవంవిధానతః. ఆచార్యాయ సదారాయ దరిద్రాయ కుటుంబినే, శ్రుతిజ్ఞాయ స్మృతిజ్ఞాయ శాంతాయ చ సుశీలినే. సవస్త్రమండపం దద్యాద్వ్రతీ భక్తి సమన్వితః. ఆచార్యం వేదవిదుషం వస్త్రాభరణసంయుతం, గంధ పుష్పాక్షతైర్దివ్యై ర్ధూపైశ్చ పరిశోభితం, హరిం విచిన్త్య మనసా ప్రతిమాం వస్త్రసంయుతామ్. కాంస్యపాత్రం సదీపం చ గాం సవత్సాం పయస్వినీం, స్వర్ణశృంగీం రౌప్యఖురాం కాంస్యదోహనభాజనామ్. సవస్త్రాలంకృతాం గాం చ ఆచా ర్యాయ సమర్ప్య చ, సఫలాం దక్షిణాం దద్యాద్విత్తశాఠ్యం న కారయేత్. బ్రహ్మణః కలశం దద్యాదృత్విజశ్చ ప్రపూజ యేత్, తేనైవ పూజాం కుర్యాచ్చ బ్రాహ్మణానాం స్వశక్తితః. ఋత్విగ్భిః సహ విప్రైశ్చ బంధుభి ర్భోజయేత్తతః, వర్తిసం ఖ్యాదశాంశం తత్తర్పణం కారయేత్సుధీః. తద్దశాంశంతు జుహుయా ద్దశాంశం విప్రభోజనం, దీనాంధకృపణాన్ సం గూన్ భోజయేదన్న కాంక్షిణః. లబ్ధ్వా ప్రసాదం విప్రాణాం స్వయం భుంజీత బంధుభిః, యా చైవం కురుతే నారీ తస్యాః పుణ్యఫలం శృణు. అవాచ్యాన్యపి పాపాని రహస్యేన కృతాని చ, నశ్యన్త్యేతాని సర్వాణి వ్రతస్యాస్య ప్రభావతః. చండాల గామినీవాపి తథాశూద్రాభికుర్మినీ, పితృవ్యమాతులభ్రాతృ పుత్రజామాతృసంగతా, బాలఘ్నీ వా కృతఘ్నీ వా మాతా పితృవధే రతా, గోఘ్నీ వా తస్కరీ వాపి రజస్సంకరకారిణీ. వహ్నిదా గరదా చైవ నిత్యం వాఽప్రియవాదినీ, పత్యౌ జీవతి యా నారీ వ్యభిచారీ భవేత్సదా. ఏవమాది మహా పాపై రావృతాఽపి కులాంగనా, కృత్వా చైతద్వ్రతం పుణ్యం ముచ్యతే నాత్ర సంశయః. వ్రతానాముత్తమం చైవ

స్త్రీణామావశ్యకం త్విదం, లక్షవర్తిప్రదానేన విష్ణోరమిత తేజసః. కోటయో బ్రహ్మహత్యానా మగమ్యాగమకోటయః, తథైవాత్యుగ్రపాపానాం కోటయోఽథ సహస్రశః. నశ్యంతి నాత్ర సందేహో నార్యావాపి నరస్యవా, కిమత్ర బహునోక్తేన నానేన సదృశం వ్రతమ్. పురుషోఽపి వ్రతం కృత్వా పూర్వోక్తైః పాపసంచయైః, ముచ్యతే నాత్ర సందేహో మధుశాసనశాసనాత్. ఏతత్సర్వం మయాఖ్యాతం పృచ్ఛన్త్యాస్తవ మానదే, వ్రతం కురు సుఖం తిష్ఠ యథా తే రోచతే మనః. ఇతి తద్వచనం శ్రుత్వా పునః పప్రచ్ఛ లక్షణా, అజ్ఞానాద్దుష్టభావాద్వా న విశ్వాసో మమైవ చ. ప్రత్యయార్థం తు తద్బ్రహ్మన్ ప్రత్యక్షం కురు మేఽధునా, ఇతి తద్వచనం శ్రుత్వా యాజకో వాక్యమబ్రవీత్. కథం తే ప్రత్యయో బ్రూహీ ఇతి తాం కరుణానిధిః, సా చోవాచ పునర్విప్రం విస్మయోత్ఫుల్లలోచనా. నవవైధవ్యసంయుక్తాకుమారీ భృశదుఃఖితా, అస్యాః పతిః కథం జీవేద్వైధవ్యం నైవ గచ్ఛతి. తథా కురు మునిశ్రేష్ఠ దయా శమవతాం ధనం, ఇతి తద్వచనం శ్రుత్వా విస్మితో యాజకోఽబ్రవీత్. లక్షవర్తిఫలం దివ్యం దిశ తస్యై ముదాయుతా, తేన జీవే దయం నూనం బ్రహ్మహ్యాచ్చ పురాభవే. తస్మాదయం రాజయక్ష్మరోగేణ చ మృతిం గతః, తథాపి వ్రతమాహాత్మ్యాజ్జీవితం పునరేష్యతి. దాపయస్వ హరేర్వర్తిం కాంస్యపాత్రం తథైవ చ, జీవపత్నీ భవేదాశు సత్యమామరణాంతికమ్. లక్షణావచనం శ్రుత్వా జలం స్పృష్ట్వా చ వాగ్యతా, లక్షవర్తివ్రతం కృత్వా దదౌ చాస్యైఫలం ముదా. తస్యపుణ్యప్రభావేన తత్క్షణాదేవచోత్థితః, కుమార్యాకారయామాసవైధవ్యస్యా

పను త్తరయే. ఏతత్పుణ్యప్రభావేన కుమారీ సా చ శోభనా, యావజ్జీవం జీవపత్నీ బభూవ బహుపుత్రకా. తద్బాంధవా స్తదా సర్వే తుష్టుపుస్తాం చ లక్షణాం, యాజకం చైవ సంప్రీత్యా జగ్ము స్తే నిజమందిమ్. లక్షణా చాపి దాసేన భుజంగేన చ సంయుతా, లక్షవ ర్తివ్రతం కృత్వా కలోప్త విధిపూర్వకమ్ ఇహ లోకే సుఖం భుక్త్వా మృతా వైకుంఠ మాప సా, తత స్తు మరణం ప్రాప్తో దాస స్తస్యాః సహాయకృత్. మహారాజకులే జాత శ్చక్రవర్తీ బభూవ హ, సా లక్షణా చ తత్పత్నీ సర్వలక్షణసంయుతా. బభూవ సర్వవిఖ్యాతా జీవపత్నీసుపుత్రికా, లక్షవ ర్తివ్రతస్యాస్య నారీ వా పురుషోఽపివా. సహాయం యదివా కుర్యా త్స్వర్గం గచ్ఛతి నిశ్చితం; నారీ తు తత్ఫలం ప్రాప్య సుభగా భవతి ధ్రువమ్. నరః పూర్ణ ఫలం ప్రాప్య విష్ణులోకే మహీయతే, య ఇదం పుణ్యమాఖ్యానం శృణోతి శ్రద్ధయాన్వితః, తత్ఫలం సమవాప్నోతి విష్ణులోకే మహీయతే. ఇతి శ్రీస్కాందపురాణే ఉమామహేశ్వర సంవాదే లక్షవ ర్తివ్రతకథా సంపూర్ణా.

---

## లక్షవ ర్తివ్రతకథ.

మహాపుణ్యప్రద మైననైమిశారణ్యంబున గొప్పగొప్ప బ్రహ్మర్షులుండిరి. వారికడ కొక్కనాఁడు సకల శాస్త్రార్థవిచక్షణ చణుఁడయినసూతమునీంద్రుఁ డేఁగుదెంచెను. ఆసమయంబున నామునీంద్రులందఱు పురాణముల నెఱిఁగిన సూతమునీంద్రుని యథావిధిగాఁ బూజించి, "ఓమునీంద్రా! స్త్రీలకు రజోదోషంబునఁ బెక్కుపాతకంబు లుద్భవిల్లుచున్నవి, వారి కట్టి పాతకంబులఁ దొలఁగించి ముక్తినొసంగునట్టి యొక్క రహస్యవ్రతంబుఁ

దెలుపు”మని యడిగిరి. అంతట నామునీంద్రుఁడు వారి కిట్లనియె. ఓ మహాత్ములారా! మీరు మంచిసంగతి నడిగితిరి. అది మీకెఱిఁగించెద వినుఁడు. తొల్లి యొక్కనాఁడు పరమేశ్వరుఁడు కైలాసంబున స్వర్ణమయపీఠమునఁగూర్చుండియుండఁగా, పార్వతి మిక్కిలి భక్తిమెఱయ నాథునితో నిట్లనియె. ఓ మహేశా! నీకు పలుమాఱు మ్రొక్కులిడెదను. తమకు నాయెడ వాత్సల్యంబు గలదేని, నాసంశయంబుఁ దీర్పుఁడు. ఏది యన, లోకంబున స్త్రీలకుఁ బరగృహవాసంబునను, పెనిమిటిని దిరస్కరించుటవలనను, భ్రూణహత్య, గర్భభేదము, పరపురుష వాంఛ, అసత్యమాడుట, పరవంచన మొదలగువానివలనఁ బెక్కుతెఱంగులైనపాపంబులు వాటిల్లుచున్నవి. అన్నయేనియు, తమ్ముఁడేనియు, తండ్రియేనియు సుందరపురుషునిఁ గాంచిన స్త్రీలకుఁ జిత్తము చలించునందురు. మఱియు గర్భము ఛేదించుట, పంక్తిభేదము, పాకవిక్రయము, పాకద్రవ్యముల నపహరించుట మొదలగు పాతకంబులును గలుగును. మఱియు, క్రూరత, లోభితనము, కటికితనమును, సాహసమును గలిగియుందురు. ఈపాతకంబులవలన వీరికి ముక్తి యెటు నా కానతిమ్మని యడిగిన నాపరమేశ్వరుఁడు పార్వతిమాటలు విని చిఱునగవు నవ్వుచు నిట్లనియె. ఓసర్వమంగళా, నీవు మంచి ప్రశ్నయడిగితివి. సకలస్త్రీలకుమోక్షప్రదం బగునొక్కవ్రతంబున్నది యని చెప్పెను. ఆమాటలువిని, పార్వతిపరమేశ్వరునిఁ గాంచి, ‘ఓనాథా! ఆవ్రతంబు నెవ్వ రాది నాచరించిరి? ఆవ్రతంబుసేయుటయెట్లు నా కానతియ్యవే’ యని యడిగిన నీశ్వరుఁ డిట్లనియె. ఓపార్వతీ! కడురహస్యమైన యొక్కవ్రతోత్త

మంబు గలదు. దానిమూలమున నెవ్వరైనను, ముఖ్యముగా స్త్రీలు సమస్తపాపంబులనుండి తొలఁగినవారై, సకలసౌఖ్యము లనుభవింతురు. ఆవ్రతోత్తమ మెద్దియన లక్షవర్తి వ్రతంబు నాఁబరగు. ఓదేవీ! యావ్రతవిధానంబు సెప్పెద నాల కింపుము. ఆషాఢశుద్ధదశమినాఁ డొక్కపూట భుజించి, మఱు నాఁ డుదయము స్నానము నాచరించి, నిత్యకర్మములం దీర్చు కొని, తర్వాత, "జగన్నాథా, నేను నేఁడు నీకుఁ బ్రీతికరంబైన లక్షవర్తివ్రతంబును జేయఁదలఁచి యున్నాను. నా కనుజ్ఞ యి"మ్మని విష్ణువుం బ్రార్థించి, మూఢము మొదలగు దోషములు లేని, యాషాఢశుక్లైకాదశి పూర్ణతిథిగా నున్ననాఁ డీవ్రతంబు నుపక్రమింపవలెను. తర్వాత నదిమొదలేకాదశినాఁ డుపవా సంబుచేయుచు, కార్తికశుద్ధఏకాదశినాఁటికి లక్షవర్తులను పూర్తి చేసి, కార్తీకశుక్లైకాదశినాఁడు మంటపారాధనము మొదలగు నవి చేసి, ద్వాదశినాఁడు హోమము, బ్రాహ్మణసంతర్పణము జేయవలయును. బ్రాహ్మణులైనచో ద్వాదశినాఁడును, నితరు లైనచోఁ బున్నమనాఁటితో ముగించి, యానాఁడు హోమా దులను చేసి సమాప్తిచేయవలయును. ఈ లక్షదీపారాధనలు ముగియువఱకుఁ బ్రతిదినము లక్షవర్తినిమిత్తము చేసిన వత్తుల తోను, నేతిదీపములతోను, కర్పూరదీపారాధనములతోను బ్రతిదినము నారాయణునిఁ బూజింపవలయును. ఓప్రియు రాలా! ఈవ్రతమహిమంబుచే సువాసినులుగాని, విధవలుగాని, స్త్రీలుచేసిన సకల రహస్యప్రకటపాపంబులును ప్రాయశ్చిత్త ములు లేనివిసైతము తొలఁగిపోవుచున్నవి. లక్షవర్తిదీపముల దర్శించినమాత్రముననే బ్రహ్మహత్యాది సకల దోషములును

నశించుచున్నవి. అని పరమేశ్వరుఁడు చెప్పఁగా, పార్వతి "మహా దేవా! తొల్లి యీవ్రతం బెవ్వరాచరించిరి? నా కానతి" మ్మని యడుగఁగా, సామహేశ్వరుఁ డిట్లనియె. ఓ దేవీ! నీకొక్క యితిహాసంబుఁ జెప్పెద వినుము. ఆర్యావర్తదేశమున లక్షణ యను నొకయింపుడుకత్తె యుండెను. దానికిఁ బ్రాయపువాఁడ యిన దాసుఁడను పేరుగల యొకవిటుఁడు గలఁడు. ఒక్కనాఁడు లక్షణ ఋతుస్నాతయై గోదావరీతీరమునఁ జేరువను బెనిమిటి శవమును ముందుంచుకొని యేడ్చుచున్న యొక్కకులకాంతను బ్రాహ్మణినిగాంచి, తానచటికిఁబోయి తనతోడవచ్చిన విటునితో నిట్లనియె. కులస్త్రీల కీదశ యతిదారుణమైనది. ఈ యవస్థ పరా ధీనతను గలిగించుచు, మరణపర్యంతము దుఃఖముగలిగించునది. లోకంబున స్త్రీలకుఁ బుట్టినబిడ్డలు చచ్చుటయు, గొడ్రాలుగ నుండుటయు, వైధవ్యమును తీఱనిదుఃఖములు. అందును వైధవ్యదుఃఖము చెప్పితీఱదు. ఈ చిన్నది కడువంతపాలగు చున్నది. ఈచిన్నదాని కిట్టిదశ రాఁ గారణమేమి? ఇది యేపాప కర్మఫలము? ఈదుఃఖ మెట్లు తొలఁగును? అట్టి యుపాయం బెవ్వఁడెఱుఁగును? నాకుఁ జెప్పుమని యడిగెను. అంతట దాసుఁ డును, "ఓ సుందరాంగి! మంత్రవేత్తలగు పెక్కండ్రు బ్రాహ్మ ణోత్తములను బ్రహ్మదేవుఁడు సృజించియున్నవాఁడు. ఆ విప్ర పుంగవు లీమె కెట్టి దుఃఖము సంప్రాప్తమైనదియు చెప్పఁజాలు దురు. వారు శాస్త్రజ్ఞానముచేతను, స్వభావముచేతను నట్టి సంగతుల నెఱుఁగఁగలరు." అట్లయిన సరియని గ్రహించి, యచ్చటికెచ్చటనుండియో వచ్చిన శాస్త్రార్థవేత్తయగు మహా వృద్ధుఁడైన యాజకుఁడను నొక బ్రాహ్మణోత్తమునికి మ్రొక్కి,

కడువినయంబుదోఁప నామునిపుంగవుని నడిగెను. 'ఓమునీంద్రా, నేను జాతిచే వేశ్యను. చెడునడత గలదానను. నన్ను లక్షణ యందురు. వాయువు సుగంధ దుర్గంధములను సమముగా గ్రహించునట్లు నన్ను హీనురాలనని యెంచక, నాప్రశ్నల కుత్తరమియ్యఁ గోరెదను. ఓ మునీంద్రా, స్త్రీలకే మహాదుఃఖవది యైన వైధవ్య మోర్వరానిదిగా నున్నది. ఏల యిట్టిదుఃఖము సంప్రాప్తమగును? ఇది యెట్లు తొలఁగును? ఈవిషయంబు నాకు విస్తరించి చెప్పుమని యడిగెను. లక్షణపలుకులు విని యాజకుఁడు లక్షణ కిట్లనియె. ఓ లక్షణా, స్త్రీలు దైవపితృ కార్యములకై వంటవార్పులు సేయు సమయమునందే యకస్మాత్తుగా రజస్సు గనఁబడినయెడల, భయముననో, కామముననో, లోభముననో, యీసంగతిఁ దెలుపక, పనిముట్లనన్నిటిని దాఁకి యపరిశుద్ధముల్గా గావించుచుందురు. దాన సత్కర్మము లన్నియు చెడిపోవుచుండును. వీ రిట్లు సత్కార్యములకు లోపము గలిగించువారు గనుక, వీరు బాల్య యౌవనవార్ధక్య ములలో నెప్పుడో యొక్కవు డీయవస్థను బొందుచున్నారు. దురాచార పరాయణురాలై, పరపురుష వాంఛగలదై అత్త మామలకును, తనమగనికిని, బంధువులకును నిష్ఠురపు మాట లచే గడుదుఃఖము గలిగించు నాయతివయు, ఈరజోదోషము గలయతివయు బాల్యముననే వైధవ్యము నొందుచున్నారు. మఱియు భర్తకనుకూలముగాక యుండునట్టిస్త్రీయు వైధవ్యము నొంది, సౌఖ్యహీనురాలగుచున్నది. ఈదోషములెల్ల స్త్రీలకు రజోదోషముననే కలుగుచున్నవి. లక్షణా! ఈరజోదోషము దొలఁగుటకు శాంతిని చెప్పెద నాలకింపుము. స్త్రీలు లక్షవర్తి

వ్రతంబుచేసి, సువాసినులకు పూర్తిగా మూసివాయనము లిచ్చిన, ఈరజోదోషంబు నిస్సంశయముగాఁ దొలఁగును. అని యాజకుఁడు చెప్పఁగా, లక్షణ యాజకుంగూర్చి, మహాత్మా! నా మనంబు తత్తరపడుచున్నది. ఆలక్షవర్తివ్రతవిధానంబెట్లు? దాని నెట్లుచేయవలసినది? ఆవ్రతమువలన నెవ్వరికిఁ దృప్తిగలుగును? ఉద్యాపన మెట్లు చేయవలెను? ఆవ్రతంబు చేయుటవలన ఫలం బేమి యని యడిగెను. అంత యాజకుఁడు లోకానుగ్రహముఁ గోరి యిట్లనిగెు. ఓలక్షణా వినుము. చాతుర్మాస్యలయందీవ్రత మునుజేయవలెను. ఆషాఢశుక్లైకాదశినాఁడారంభించి, కార్తిక శుక్లైకాదశినాఁడు వ్రతంబు నాచరించినయెడల వేయింతల ఫలంబు గలుగును. కార్తిక, వైశాఖ, మాఖ, చైత్రములం దైనను జేయనచ్చును. దీనికుద్యాపనక్రమ మెట్లనిన, వ్రతదినం బున వేఁకువ లేచి స్నానముచేసి, నిత్యకృత్యములను దీర్చు కొని, పంచగవ్యము దీసికొనవలెను. తర్వాత వ్రతోపక్రమము జేయునప్పుడు మొదట పుణ్యాహవాచనము, ఆచార్యముచేసి, ఋత్విక్కులచే యవలతోఁగాని, అక్షతలతోఁగాని పదివేలు శ్రీ లక్ష్మీనారాయణప్రీత్యైకై. తర్పణముచేయింపవలయును తర్పణ మున పదియవవంతు ఘృతపాయసముచే హోమము చేయింప వలయును. సాయంకాలమున స్త్రీ స్నానముచేసి, మడిగట్టుకొని పరిశుద్ధురాలై, నాలుగుమూలలు దీర్చినమంటపము నొక్క దానిని నిర్మించి దానినడుమ నైదురంగులతో నెన్మిదిదళముల పద్మమువేసి, చెఱకుగడలతోను, కొండగోఁగులతోను చాంది రిని గట్టి దానినడుమ వస్త్రముఃపఱిచి, ద్రైదుకుంచముల బియ్య్య ముపోసి, దానినడుమ కలశమునుంచి, పంచపల్లవములువేసి,

వస్త్రముపై. లక్ష్మీనారాయణప్రతిమలుంచి, యాబియ్యముపై బ్రహ్మకలశమును, ముప్పదిమూఁడు చక్కఁగా నలంకరించినకలశములను, ప్రతిమలను స్థాపించి, ఇంద్రాద్యష్టదిక్పాలకులతోఁ గూడ నావాహనముచేసి, యాకలశములందు నయిదురత్నములను, చిగుళ్లను దెచ్చియుంచి, ప్రతిమాశోధనగావించి, లక్ష్మీనారాయణ ప్రాణప్రతిష్ఠచేసి, షోడశోపచారపూజలను నాలుగుజాములందును జేయుచు రాత్రి జాగరణము చేయవలయును. ముప్పదిపలముల కంచుఘృతపాత్రయందు ఆవునేయి నిండుగాపోసి, బంగారు వెండి వత్తులువేసి, దూదివత్తివేసి, మంటపావాహనమునకు ముందుగా దీపారాధనముచేసి, పిమ్మట ప్రతియామంబునను బూజచేయుచు, నృత్తగీతవాద్యములతోను, సత్సంగములతోను, వేదఘోషములతోను, రాత్రి జాగరణముచేసి, మఱునాఁడు వేఁకువలేచి దంతధావనంబుచేసికొని, నదీతీరంబునకు వెళ్లి స్నానమాచరించి, బ్రాహ్మణులు స్వస్తివాచనము చేయుచు వెంబడింపఁగా, స్వగృహంబునకువచ్చి చేరవలెను. తర్వాత బ్రాహ్మణులతోఁగూడి, తకుతమసూత్రములందుఁ జెప్పినరీతిగా, మోదుగుసమిధలతోను, హవిస్సుతోను, పాయసముతోను, ఆజ్యముతోను నారాయణగాయత్రితో 1000 మాఱులు హోమంబు గావించి, తర్వాత జయాది హోమంబును, పూర్ణాహుతిని జేసి, పునఃపూజ, ధూపదీప నైవేద్య తాంబూల నీరాజనాదులొసఁగి, పలువిధంబులైన స్తోత్రములుచేసి, క్షమార్పణము చేయవలెను. సకలశాస్త్రముల నెఱిఁగిన వృద్ధబ్రాహ్మణుఁడైనయాచార్యునికి వస్త్రాదులతోఁ గూడిన మంటపమునొసఁగి, గోదానంబునుచేసి, యాగోవు

తోడ కంచుచెంబును, ఆవుదూడను, బంగారుతోకొమ్ములు, వెండితోగిట్టలు చేయించి యియ్యవలయును. తర్వాత బ్రహ్మకు కలశము నొసఁగి తర్వాత ఋత్విక్కులకుఁ దనశక్తివంచనలేక కలశవస్త్రప్రతిమాదుల నొసఁగి, బంధుజనంబులను, ఋత్విక్కులను భోజనాదులచే తృప్తినొందింపవలెను. లక్షవర్తులలో పదియవవంతు (10,000) తర్పణము, వానిలోపదియవవంతు (1000) హోమమును, దానిలో పదియవవంతు (100) బ్రాహ్మణులకు సంతర్పణమును గావింపవలయును. గ్రుడ్డి, కుంటి, కురూపి, పేద, సాదలకు నన్నముపెట్టి, బ్రాహ్మణులయానతివడసి తాను భుజింపవలయును. ఈవ్రతంబును భక్తితోఁజేసినస్త్రీ, చండాలగమనము, శూద్రగమనము మొదలగు చేయరానిపాపంబు లజ్ఞానముతో చేసినను, వానినుండి విముక్తురాలగుచున్నది. ఈ వ్రతమహిమము నీకు సవిస్తరంబుగాఁజెప్పితి నని చెప్పఁగా, లక్షణ యాజకుంజూచి, నీమాట నేను నమ్మఁజాలను. దానికిఁ దగిన దృష్టాంతంబుఁ జూపుమని యడిగెను. అప్పలుకులు యాజకుండు విని, "నీకెట్లు నమ్మకము గలుగును?" అని యడుగఁగా, "అయ్యా, యీయతివ నూతన వైధవ్యంబుఁ బొంది నదై, మిక్కిలి తపించుచున్నది. దీనిమగం డెట్లు జీవించును? ఈ చిన్నదాని కెట్లు వైధవ్యంబు దొలంగును? నా కట్టి కార్యంబు చేసి చూపు" మని యడుగఁగా, యాజకుం డాశ్చర్యమొంది, ఓలక్షణా, ఈతఁడు పూర్వజన్మంబున బ్రహ్మహత్య చేసెను. దాని వలన నీతఁ డీజన్మమున క్షయరోగముచే మృతినొందెను. నీవు లక్షవర్తివ్రతంబు చేసినఫలమును దీనికిమ్ము. దీనిమగండు పునర్జీవితుఁడగును. లక్ష్మీనారాయణప్రతిమను, కాంస్యపాత్రమును

నాచార్యునకు దానంబుచేయుము. దీనిమగండు జీవింపఁగలఁ డని చెప్పఁగా, లక్షణ లక్ష్మవర్తివ్రతంబు గావించి, యాఫలంబు నాబ్రాహ్మణస్త్రీ కొసంగెను. అంత దానిపెనిమిటి పునర్జీవితుఁ డయ్యెను. ఆచిన్నదియు బ్రదికియున్నంతకాలము సువాసినిగ నుండి పెక్కండ్రుపుత్త్రులం బడసి సౌఖ్యముతో నుండెను. ఆ చిన్నదానిబంధుగులందఱు లక్షణను బహువిధంబులఁ బొగడి, తమతమయిండ్లకేగిరి. లక్షణయు తనవిటునితో నింటికివచ్చి, లక్ష్మవర్తివ్రతం బాచరించి యిహలోకంబున సుఖంబు లను భవించి, యంతమున వైకుంఠము నొందెను. దానివిటుండు మృతినొంది యొక్కదేశమునకు చక్రవర్తియాయెను. ఆలక్ష ణయు వానికిఁ బత్నియై, మిక్కిలి కీర్తిచెంది దీర్ఘసువాసిని గాను, బహుపుత్రవతిగాను నుండెను. ఈలక్ష్మవర్తివ్రతంబు చేసినవారును, సహాయపడువారును, ఈకథ విన్నవారును, చదివినవారును విష్ణులోకంబు నొందుదురు. అని యిట్లు పర మేశ్వరుఁడు పార్వతికిఁ జెప్పఁగాఁ బరమేశ్వరునివాక్యము లాలించి యాదేవి కడుసంతుష్టురాలయ్యెను.

స్కాందపురాణమున లక్ష్మవర్తివ్రతకథ

సంపూర్ణము.



# త్రికార్తివ్రతము.

శుక్లాంబరధరం విష్ణుం...శాంతయే. ఆచమ్య. శుభే... శుభతిథౌ మమ సమస్తపాపక్షయార్థం ధర్మార్థకామమోక్ష చతుర్విధఫలపురుషార్థసిద్ధ్యర్థం సర్వాభీష్టసిద్ధ్యర్థం శ్రీసాంబ సదాశివదేవతాముద్దిశ్య, శ్రీసాం...త్యాప్రీత్యర్థం ఉమామహే శ్వరధ్యానావాహనాది షోడశోపచారపూజాం చ కరిష్యే. తదంగత్వేన కలశపూజాం కరిష్యే. ఇతి సంకల్ప్య. కలశ పూజాం కృత్వా. కలశోదకేన పూజాద్రవ్యాణి దేవమంటప మాత్మానం సంప్రోక్ష్య. ఆదౌ గణపతిపూజాం కృత్వా. అథ ఉమామహేశ్వరప్రాణప్రతిష్ఠాం కరిష్యే. ఇతి సంకల్ప్య. శ్లో. శిరః శ్రోత్రం తథా నాసా మోష్ఠం జిహ్వాం తథైవ చ, కంఠం కుక్షిం చ హృదయం కటిబాహూ తథాఽంగుళీః, ఊరూ జానూ చ పాదాంతం తత్తన్న్యాసం వినిర్దిశేత్. అసునీతే... హ్వయతే. స్థిరో భవ...కురు. అథ ధ్యానమ్. ఉమయాసహి తం దేవం కైలాసశిఖరే స్థితం, గిరిజాహృదయానందం ధ్యాయే చిత్తే సదాశివమ్. ఉమామహేశ్వరం ధ్యాయామి. హృత్పద్మకర్ణికా మధ్యాదుమయా సహశంకర, ఆగచ్ఛావాహ యామ్యద్య ప్రసీద గిరిజాపతే. ఆవాహనమ్. ఆసనం పరమం దివ్యం నవరత్నసమన్వితం, సౌవర్ణప్రభయా యుక్తం ముక్తా ప్రాలంబశోభితం, ఆసనమ్. గంగాదిసర్వతీర్థేభ్య ఆనీతాచ్ఛసు శీతలాత్, పానీయాదద్య తే పాద్యం దదామి శశిభూషణ. పాద్యం. జగద్రక్షానిపుణయోర్హస్తయోర్గిరిజాధిప, దదా మ్యర్ఘ్యం గృహాణేదం కరుణాకర శంకర. అర్ఘ్యం. మయాదత్తేన దేవేశ శీతలేన సువారిణా, కురుష్వాచమనం శంభో వాసుకి

కృతభూషణ. ఆచమనీయమ్. దధినా మధునా శంభో గోఘృతేన సశర్కరమ్, దుగ్ధేన మిశ్రితేనేదం మధుపర్కం దదామి తే. మధుపర్కమ్. గోక్షీరై ర్నారికేళైశ్చ ఘృతేన మధునా శివ, పంచామృతస్నానమిదం శర్కరాగాంగవారిభిః. పంచామృతస్నానమ్. మన్దాకినీజలైర్దివ్యైర్మహాదేవ దయానిధే, స్నానం కురు జగన్నాథ శివావామాంకసంస్థితమ్. శుద్ధోదకస్నానమ్ కుందేందు శంఖధవళం ముక్తికాజాలరంజితం, దుకూలం తే ప్రయచ్ఛామి గృహాణ పరమేశ్వర. వస్త్రయుగ్మమ్. కాంచనేన చ రత్నైశ్చ రంజితం రాజశేఖర, ఉపవీతం గృహాణేదం చంద్రశేఖర శంకర. యజ్ఞోపవీతమ్. సమస్తగంధద్రవ్యాణాం దేవత్వమసి జన్మభూః, భక్త్యా సమర్పితం ప్రీత్యా మయా గంధాది గృహ్యతామ్. పరిమళద్రవ్యాణి కర్పూరాగరు కస్తూరీమిశ్రితం శీతలం శుభం, గంధం దాస్యామి దేవేశ ఉమానాథ నమోఽస్తుతే. శ్రీగంధం సమర్పయామి. మిశ్రితైర్ముక్తికాజాలై రక్షతై శ్శంఖసన్నిభైః, పూజయామి మహాదేవ గంధోపరిమహామతే. అక్షతాన్ సమర్పయామి. మాల్యాదీని సుబిల్వాని మాలత్యాదీని చ ప్రభో, మయాఽఽనీతాని పుష్పాణి పూజార్థం ప్రతిగృహ్యతామ్ పుష్పాణి. అథ ఇంద్రాది లోకపాలకపూజాం చ కుర్యాత్.

## అథాంగపూజా.

మహేశ్వరాయ నమః పాదౌ పూజయామి. ఈశ్వరాయ నమః జంఘే పూజయామి. కామరూపాయ నమః జానునీ పూజయామి. హరాయ నమః ఊరూ పూజయామి. త్రిపురాంతకాయ నమః గుహ్యం పూజయామి. భవాయ నమః

కటిం పూజయామి. గంగాధరాయ నమః నాభిం పూజయామి. మహాదేవాయ నమః ఉదరం పూజయామి. పశుపతయే నమః హృదయం పూజయామి. పినాకినేనమః హస్తౌ పూజయామి శివాయ నమః భుజౌ పూజయామి. శితికంఠాయ నమః కంఠం పూజయామి. విరూపాక్షాయనమః ముఖం పూజయామి. త్రినేత్రాయ నమః నేత్రాణి పూజయామి. రుద్రాయ నమః లలాటం పూజయామి. శర్వాయ నమః శిరః పూజయామి. చంద్రమౌళయే నమః మౌళిం పూజయామి. పశుపతయే నమః సర్వాణ్యంగాని పూజయామి. అథ శివాష్టోత్తరశతనామపూజాం కరిష్యే. *ఉమామహేశ్వరాయ నమః శివాష్టోత్తరశతనామ పూజాం సమర్పయామి.

శ్లో. కృష్ణాగరుసుధూపేన ధూపయామి తవామితం, మృత్యుంజయ మహాదేవ మాయామయమిదం ప్రభో. ధూపం సమర్పయామి. అనేకవర్తియుక్తేన గోఘృతాక్తేన శంకర, దీపయామి సుదీపేన త్వామజ్ఞానవినాశనమ్. దీపం సమర్పయామి. చామీకరసుపాత్రేషు స్థాపితం దివ్యముత్తమం, పరమాన్నం ప్రదాస్యామి భుక్ష్వ దేవ మహేశ్వర. నైవేద్యం సమర్పయామి. కోమలాగ్రైర్నాగవల్లీదళైః పూగఫలైర్యుతం, తాంబూలం దాపయామ్యద్య గృహాణ పరమేశ్వర. తాంబూలం సమర్పయామి. కర్పూరఖండయుక్తేన గోఘృతేనసుదీపితం, నీరాజనం ప్రదాస్యామి సర్వలోకమహేశ్వర. కర్పూరనీరాజనం సమర్పయామి. తులసీబిల్వపత్రాఢ్యం వేదమంత్రైః సుసుమం,

---

* శివాష్టోత్తరశతనామావళి వ్రతరత్నాకరము మొదటిభాగమున కేదారేశ్వరవ్రతమునందు చూచుకొనునది.

త్రితం, మంత్రపుష్పం మహాదేవ దాస్యామి గిరిజాపతే, మంత్ర పుష్పం సమర్పయామి. ప్రదక్షిణం కరిష్యామి సర్వపాపభయాపహం, అనుగృహ్ణీష్వ మాం దేవ భవసాగరతారక. ప్రదక్షిణం సమర్పయామి. యస్య స్మృత్యాచ నామోక్త్యా...వరదో భవతు. ఇతి పూజావిధానం సమాప్తమ్

శ్లో. శుక్లాంబర...శాంతయే ఆచమ్య. శుభే...ఏవంగుణ విశేషణవిశిష్టాయామస్యాం శుభతిథౌమమ సమస్తపాపక్షయార్థం ధర్మా...పురుషార్థసిద్ధ్యర్థం సర్వాభీష్టసిద్ధ్యర్థం శ్రీసాంబశివదేవతాముద్దిశ్య సాంబశివదేవతా ప్రీత్యర్థం శ్రీసాంబశివషోడశోపచారపూజాం చ కరిష్యే. తదంగకలశపూజాం గణాధిపతి పూజాం చ కృత్వా అథ ప్రాగ్దేశే గోమయేనానులిప్య రంగవల్ల్యాదిభిరలంకృత్య. చతుష్కోణేషు పీఠం నిక్షిప్య, తదుపరి అష్టదళపద్మం లిఖిత్వా, తతః నూతనవస్త్రమాచ్ఛాదయ్య, పంచప్రస్థ తండులాన్ = (అయిదుకుంచముల బియ్యము) నిక్షిప్య తత్ర అష్టదళం పద్మం విలిఖ్య, తత్ర తామ్రకలశం నిధాయ, పునస్సంకల్ప్య, ఏవంగుణ...శుభతిథౌ శ్రీసాంబశివదేవతా... ప్రీత్యర్థం త్రికాత్రివ్రతోద్యాపనాంగ ప్రతిమాశోధనాధికం కరిష్యే. దధిసర్పిర్మధుక్షీరైః శర్కరేధ ఫలైః సహ, ప్రక్షాళనం ప్రకుర్వీత ప్రతిమాం శోధయేత్తతః. పంచామృతమంత్రైః ఆపోహిష్ఠేతి మంత్రేణ చ ప్రతిమాం శోధయేత్. అథ పీఠపూజాం కరిష్యే. ప్రాగ్ద్వారే ద్వారశ్రియై నమః, ధాత్రే నమః, విధాత్రే నమః, చిచ్ఛక్త్యై నమః, క్రియాశక్త్యై నమః, దుర్గాయై నమః, గణపతయే నమః, క్షేత్రపాలకాయ నమః, తన్మధ్యే వాస్తుపురుషాయ నమః, దక్షిణద్వారే ద్వారశ్రియై

పర్యంతం శ్రీ మంగళగౌరీవ్రతం కరిష్యే అద్య శ్రీమంగళ గౌరీదేవతాముద్దిశ్య శ్రీ మంగళగౌరీదేవతాప్రీత్యర్థం సంభ వద్భిర్ద్రవ్యైః, సంభవతా నియమేన ధ్యానావాహనాదిషోడ శోపచారపూజాం కరిష్యే.

అని సంకల్పోదకమును విడువవలయును.

## కలశపూజా.

తదంగకలశారాధనం కరిష్యే. కలశం శుద్ధోదకైః ఆపూర్య, గంధపుష్పాక్షతైరభ్యర్చ్య, అభిమంత్రయేత్.

ఆచమనము చేయుపాత్రగాక, వేరొక వెండిపాత్రగాని, కంచుపాత్రగాని తెచ్చి యందు శుద్ధోదకముల నుంచి గంధపుష్పగోరోచనకర్పూరకేసర్యాది ద్రవ్యములతో సువాసితము లగునట్లొనర్చి యాకలశము నభిమంత్రింపవలయును. అనఁగాఁ గుడిచేతియంగుళ్యములతోఁ గలశోదకములను తాకుచు నిట్లుఁ బఠింపవలయును.

శ్లో. కలశస్య ముఖే విష్ణుః కంఠే రుద్రస్సమాశ్రితః,
మూలే తత్ర స్థితో బ్రహ్మా మధ్యే మాతృగణాస్స్మృతాః,
కుక్షౌ తు సాగరాస్సర్వే సప్తద్వీపా వసుంధరా,
ఋగ్వేదోఽథ యజుర్వేదః సామవేదో హ్యథర్వణః,
అంగైశ్చ సహితాస్సర్వే కలశాంబు సమాశ్రితాః,
గంగే చ యమునే కృష్ణే గోదావరి సరస్వతి,
నర్మదే సింధో కావేరి జలే ఽస్మిన్ సన్నిధిం కురు.

ఆయాంతు శ్రీమంగళగౌరీపూజార్థం మమ దురితక్షయకారకాః, కలశోదకేన పూజాద్రవ్యాణి దేవీ మాత్మానం చ సంప్రోక్ష్య.

అని కలశోదకములతోఁ బూజాద్రవ్యములపై నీళ్లు చల్లి, తన శిరస్సుపై మార్జనముచేసికొని స్వర్ణముతోఁగాని పసుపుతోఁగాని చేసి సిద్ధపరుపఁబడిన గౌరీమూర్తిపైఁ జల్లవలయును.

ఆం హ్రీం క్రోం యం రం లం వం శం షం సం హాం క్షం హాం సః, శ్రీ మంగళగౌరీదేవతా స్థిరా భవతు, సుప్రసన్నా భవతు, వరదా భవతు.

అని గౌరీదేవతా ప్రతిష్ఠాపనము చేయవలయును.

దీపమును ముట్టించి, యిట్లు నమస్కరింపవలయును.

శ్లో. దీపస్త్వం బ్రహ్మరూపోఽసి జ్యోతిషాం ప్రభురవ్యయః,
సౌభాగ్యం దేహి పుత్రాంశ్చ సర్వాన్ కామాంశ్చ దేహి మే.

దీపదేవతాభ్యో నమః, అని దీపమును పుష్పాదులతో నర్చింపవలయును.

చేతులు జోడించి యంజలియందుఁ బుష్పముల నుంచుకొని శ్రీమంగళగౌరీధ్యానము నిట్లు చేయవలయును.

ధ్యానమ్.

శ్లో. సకుంకుమవిలేపనామళికచుంబికస్తూరికాం
సమందహసితేక్షణాం సశరచాపపాశాంకుశాం,
అశేషజనమోహినీం అరుణమాల్యభూషాంబరాం
జపాకుసుమభాసురాం జపవిధౌ స్మరేదంబికామ్.

శ్లో. దేవీం షోడశవర్షీయాం శశ్వత్ సుస్థిరయౌవనాం
బింబోష్ఠీం సుదతీం శుద్ధాం శరత్పద్మనిభాననాం,
శ్వేతచంపకవర్ణాభాం సునీలోత్పలలోచనాం

జగద్ధాత్రీం చ దాత్రీం చ సర్వేభ్యః సర్వసంపదాం,
సంసారసాగరే ఘోరే జ్యోతీరూపాం సదా భజే.

అని శ్రీమంగళగౌరీదేవతను ధ్యానించి పుష్పాంజలి నీయవలయును. అనంతర మిట్లు పూజింపవలయును.

శ్లో. కల్లోలోల్లసితామృతాబ్ధిలహరీమధ్యే విరాజన్మణి
ద్వీపే కల్పకవాటికాపరివృతే కాదంబవాట్యుజ్జ్వలే,
రత్నస్తంభసహస్రనిర్మితసభామధ్యేవిమానోత్తమే
చింతారత్నవినిర్మితం జనని తే సింహాసనం భావయే.

హ్రీం శ్రీమంగళగౌరీదేవతాయై నమః నవరత్నఖచిత సింహాసనం సమర్పయామి.

అని శ్రీగౌరికి సింహాసనమును భావించి పుష్పము లుంచ వలయును.

శ్లో. ఏణాంకానలభానుమండలలసచ్ఛ్రీచక్రమధ్యే స్థితాం
బాలార్కద్యుతిభాసురాం కరతలైః పాశాంకుశౌ బిభ్రతీం,
చాపం బాణమపి ప్రసన్నవదనాం కౌసుంభవస్త్రాన్వితాం
తాంత్వాంచంద్రకళావతంసమకుటాంచారుస్మితాంభావయే.

హ్రీం శ్రీమంగళగౌరీదేవతాయై నమః ఆవాహనం సమర్పయామి.

అని దేవిని చిరునవ్వుతోనున్నట్లు భావింపవలయును.

శ్లో. ఈశానాదిపదం శివైకఫలదం రత్నాసనం తే శుభం
పాద్యం కుంకుమచందనాదిభరితంచార్ఘ్యం సరత్నాక్షతైః,
శుద్ధైరాచమనీయకం తవ జలైర్భక్త్యా మయా కల్పితం
కారుణ్యామృతవారిధే తదఖిలం సంతుష్టయే కల్పతామ్.

హ్రీం శ్రీమంగళగౌరీదేవతాయై నమః పాదయోః పాద్యం సమర్పయామి.

అని కలశోదకములతో గౌరీపాదములను గడిగినట్లు భావించి పుష్పముతోఁ జల్లవలయును.

హ్రీం శ్రీమంగళగౌరీదేవతాయై నమః హస్తయోః అర్ఘ్యం సమర్పయామి.

అని కలశోదకములతో గౌరీహస్తములను గడిగినట్లు భావించి పుష్పముతోఁ జల్లవలయును.

హ్రీం శ్రీమంగళగౌరీదేవతాయై నమః ముఖే ఆచమనీయం సమర్పయామి.

శ్రీగౌరి ఆచమనము చేయుచున్నట్లు భావించి కలశోదకమును బుష్పముతో నీయవలయును.

శ్లో. లక్ష్యే యోగిజనస్య రక్షితజగజ్జాలే విశాలేక్షణే
ప్రాలేయాంబుపటీరకుంకుమలసత్కర్పూరమిశ్రోదకైః,
గోక్షీరైరపి నారికేళసలిలైః శుద్ధోదకైర్మంత్రితైః
స్నానం దేవి ధియా మయైతదఖిలం సంతుష్టయే కల్పతామ్.

హ్రీం శ్రీమంగళగౌరీదేవతాం పంచామృతైః పుష్పోదకైః, సుగంధోదకైః, శుద్ధోదకైశ్చ స్నాపయామి.

అని యాయా ద్రవ్యములతో దేవిని స్నానము చేయించవలెను. పరిశుభ్రమగు వస్త్రముతో గౌరిదేవిని తుడిచి పీఠమందు తిరిగి యుంచవలయును.

శ్లో. హ్రీంకారాంకితమంత్రలక్షితతనో హేమాచలాత్సంచితైః
రత్నైరుజ్జ్వలముత్తరీయసహితం కౌసుంభవర్ణాంశుకం,

ముక్తాసంతతియజ్ఞసూత్రమమలం సౌవర్ణతంతూద్భవం
దత్తం దేవి ధియా మయైతదఖిలం సంతుష్టయే కల్పతామ్.

హ్రీం శ్రీమంగళగౌరీదేవతాయై నమః కంచుకసహిత కౌసుంభవస్త్రయుగ్మం సమర్పయామి.

హ్రీం శ్రీమంగళగౌరీదేవతాయై నమః స్వర్ణయజ్ఞోపవీతం సమర్పయామి.

అని గౌరికి వస్త్రములను, రవికను, ఉత్తరీయమును, యజ్ఞోపవీతమును సమర్పించినట్లు భావించి పుష్పముల నుంచవలయును.

శ్లో. హంసై రప్యతిలోభనీయగమనే హారావళీముజ్జ్వలాం
హిందోళద్యుతిహీరపూరితతరే హేమాంగదే కంకణే,
మంజీరౌ మణికుండలే మకుటమప్యర్ధేందుచూడామణిం
నాసామౌక్తికమంగుళీయకటకౌ కాంచీమపి స్వీకురు.

హ్రీం శ్రీమంగళగౌరీదేవతాయై నమః నవరత్నమయాభరణాని సమర్పయామి.

అని యాభరణములను భావించి, పుష్పముల నుంచవలయును

శ్లో. సర్వాంగే ఘనసారకుంకుమఘనశ్రీగంధపంకాంకితం
కస్తూరీతిలకం చ ఫాలఫలకే గోరోచనాపత్రకం,
గండాదర్శనమండలే నయనయోర్దివ్యాంజనం తేఽర్పితం
కంఠాబ్జే మృగనాభిపంకమమలం త్వత్ప్రీతయే కల్పతాం.

హ్రీం శ్రీమంగళగౌరీదేవతాయై నమః దివ్యశ్రీచందనం సమర్పయామి, తిలకం ధారయామి, అంజనమర్పయామి.

అని చందనాదుల నీయవలయును.

శ్లో. కల్హారోత్పలమల్లికామరువకైః సౌవర్ణపంకేరుహైః
జాజీచంపకమాలతీవకుళకైః మందారకుందాదిభిః,
కేతక్యాకరవీరకైః బహువిధైః క్లప్తాస్స్రజో మాలికాః
సంకల్పేన సమర్పయామి వరదే సంతుష్టయే కల్ప్యతాం.

హ్రీం శ్రీమంగళగౌరీదేవతాయై నమః పుష్పమాలికాః సమర్పయామి. నానావిధపరిమళపత్రైః పుష్పైశ్చ పూజయామి.

అని పుష్పమాలల సమర్పించి కుసుమములతో నీక్రింద వ్రాయఁబడిన నామములను బఠింపుచుఁ బూజింపవలయును.

అథ అంగపూజా:—ఉమాయై నమః పాదౌ పూజయామి, గౌర్యై నమః జంఘే పూజయామి, పార్వత్యై నమః జానునీ పూజయామి, జగన్మాత్రే నమః ఊరూ పూజయామి, జగత్ప్రతిష్ఠాయై నమః కటింపూజయామి, మూలప్రకృత్యైనమః నాభిం పూజయామి, అంబికాయై నమః ఉదరం పూజయామి, అన్నపూర్ణాయై నమః స్తనౌ పూజయామి, శివసుందర్యైనమః వక్షః పూజయామి, మహాబలాయై నమః బాహూన్ పూజయామి, వరప్రదాయై నమః హస్తాన్ పూజయామి, కంబుకంఠ్యై నమః కంఠం పూజయామి, బ్రహ్మవిద్యాయై నమః జిహ్వాం పూజయామి, శాంకర్యై నమః ముఖం పూజయామి, శివాయై నమః నేత్రే పూజయామి, రుద్రాణ్యై నమః కర్ణౌ పూజయామి, సర్వమంగళాయై నమః లలాటం పూజయామి, సర్వేశ్వర్యై నమః శిరః పూజయామి, మంగళగౌర్యై నమః సర్వాణ్యంగాని పూజయామి.

శ్రీమాత్రే నమః, శ్రీమహారాజ్ఞ్యై నమః, శ్రీమత్సింహాసనేశ్వర్యై నమః, చిదగ్నికుండసంభూతాయై నమః, దేవకార్యసముద్యతాయై నమః, ఉద్యద్భానుసహస్రాభాయై నమః, చతుర్బాహుసమన్వితాయై నమః, రాగస్వరూపపాశాఢ్యాయై నమః, క్రోధాకారాంకుశోజ్జ్వలాయై నమః, మనోరూపేక్షుకోదండాయై నమః, పంచతన్మాత్రసాయకాయై నమః, నిజారుణప్రభాపూరమజ్జద్బ్రహ్మాండమండలాయై నమః, చంపకాశోకపున్నాగసౌగంధికలసత్కచాయై నమః, కురువిందమణిశ్రేణీకనత్కోటీరమండితాయై నమః, అష్టమీచంద్రవిభ్రాజదలికస్థలశోభితాయై నమః, ముఖచంద్రకళంకాభమృగనాభివిశేషకాయై నమః, వదనస్మరమాంగల్యగృహతోరణఝిల్లికాయై నమః, వక్త్రలక్ష్మీపరీవాహచలన్మీనాభలోచనాయై నమః, నవచంపకపుష్పాభనాసాదండవిరాజితాయై నమః, తారాకాంతితిరస్కారినాసాభరణభాసురాయై నమః, కదంబమంజరీక్లృప్తకర్ణపూరమనోహరాయై నమః, తాటంకయుగళీభూతతపనోడుపమండలాయై నమః, పద్మరాగశిలాదర్శపరిభావికపోలభువే నమః, నవవిద్రుమబింబశ్రీన్యక్కారిరదనచ్ఛదాయై నమః, శుద్ధవిద్యాంకురాకారద్విజపంక్తిద్వయోజ్జ్వలాయై నమః, కర్పూరవీటికామోదసమాకర్షద్దిగంతరాయై నమః, నిజసల్లాపమాధుర్యవినిర్భర్త్సితకచ్ఛప్యై నమః, మందస్మితప్రభాపూరమజ్జత్కామేశమానసాయై నమః, అనాకలితసాదృశ్యచిబుకశ్రీవిరాజితాయై నమః, కామేశబద్ధమాంగల్యసూత్రశోభితకంధరాయై నమః, కనకాంగదకేయూరకమనీయభుజాన్వితాయై నమః, రత్నగ్రైవేయచింతాకల్లోలముక్తాఫలాన్వితాయై నమః, కామే

శ్వరప్రేమరత్నపణ ప్రతిపణ స్తన్యై నమః, నాభ్యాలవాల రోమాళిలతాఫలకుచద్వయ్యై నమః, లక్ష్యరోమలతాధారతా సమున్నేయమధ్యమాయై నమః, స్తనభారదళన్మధ్యపట్టబద్ధవళి త్రయ్యై నమః, అరుణారుణకౌసుంభవస్త్రభాస్వత్కటీతట్యై నమః, రత్నకింకిణికారమ్యరశనాదామభూషితాయై నమః, కామేశజ్ఞాతసౌభాగ్యమార్దవోరుద్వయాన్వితాయై నమః, మాణిక్యమకుటాకారజానుద్వయవిరాజితాయై నమః, ఇంద్రగోపపరిక్షిప్తస్మరతూణాభజంఘికాయై నమః, గూఢగుల్ఫాయై నమః, కూర్మపృష్ఠజయిష్ణుప్రపదాన్వితాయై నమః, నఖదీధితి సంఛన్ననమజ్జనతమోగుణాయై నమః, పదద్వయ ప్రభాజాల పరాకృత సరోరుహాయై నమః, సింజానమణిమంజీరమండిత శ్రీ పదాంబుజాయై నమః, మరాళీమందగమనాయై నమః, మహాలావణ్యశేవధయే నమః, సర్వారుణాయై నమః, అనవద్యాంగ్యై నమః, సర్వాభరణభూషితాయై నమః, శివకామేశ్వరాంకస్థాయై నమః, శివాయై నమః, స్వాధీనవల్లభాయై నమః, సుమేరుశృంగ మధ్యస్థాయై నమః, శ్రీమన్నగరనాయికాయై నమః, చింతామణి గృహాంతస్థాయై నమః, పంచబ్రహ్మాసనస్థితాయై నమః, మహాపద్మాటవీసంస్థాయై నమః, కందబవనవాసిన్యై నమః, సుధాసాగర మధ్యస్థాయై నమః, కామాక్ష్యై నమః, కామదాయిన్యై నమః, దేవర్షిగణసంఘాతస్తూయమానాత్మవైభవాయై నమః, శ్రీమన్మంగళగౌరీదేవతాయై నమో నమః.

శ్లో. హంతారం మదనస్య నందయసి యైరంగైరనంగోజ్జ్వలై
ర్యైర్భృంగావళినీలకుంతలభరైర్బధ్నాసి తస్యాశయం,

తానీమాని తవాంబ కోమలతరాణ్యామోదలీలాగృహా
ణ్యామోదాయదశాంగగుగ్గులుఘృతైర్ధూపైరహంధూపయే.
హ్రీం శ్రీమంగళగౌరీదేవతాయైనమః ధూపమాఘ్రాపయామి.
అని ధూపమును వేయవలయును.

శ్లో. లక్ష్మీముజ్జ్వలయామి రత్ననివహైర్భాస్వత్తరే మందిరే
మాలారత్నవిడంబితైర్మణిమయస్తంభేషు సంభావితైః,
చిత్రైర్హాటకపుత్రికాకరధృతైర్గవ్యైర్ఘృతైర్వర్ధితై
ర్దివ్యైర్దీపగణైర్ధియా గిరిసుతే త్వత్ప్రీతయే కల్పతామ్.
హ్రీం శ్రీమంగళగౌరీదేవతాయై నమః దీపం దర్శయామి.
అని దీపమును వెలిఁగించి చూపింపవలయును.

శ్లో. హ్రీంకారేశ్వరి తప్తహాటకకృతైః స్థాలీసహస్రైర్భృతం
దివ్యాన్నం ఘృతసూపశాకభరితం చిత్రాన్నభేదం తథా,
దుగ్ధాన్నం మధుశర్కరాదధియుతం మాణిక్యపాత్రే స్థితం
మాషాపూపసహస్రమంబ సఫలం నైవేద్యమావేదయే.
హ్రీం శ్రీమంగళగౌరీదేవతాయై నమః మహానైవేద్యం సమర్పయామి.

అని తనకుఁ గుడివైపున నీళ్లుచల్లి చతురశ్రమండలమును జేసి యందు నైవేద్యమునకు వండినపదార్థము లుంచిన వెండిపళ్లెమును, నేతిగిన్నెను, పెరుగుగిన్నెను, సెనగలు, పండ్లు మొదలగునవి యుంచినపాత్ర నుంచి, వానిపై కలశోదకములను జల్లి యా యుదకములతోడనే పాత్రలకుఁ జుట్టును జల్లి 'అమృతమస్తు' అని, పుష్పముతోఁ గలశోదకమును పదార్థములయం దుంచి 'అమృతోపస్తరణమసి,' అని, పుష్పముతోఁ గలశోదకమును గౌరి కివ్వవలయును. అనంతరము 'ప్రాణాయ

స్వాహా, అపానాయ స్వాహా, వ్యానాయస్వాహా, ఉదానాయ స్వాహా, సమానాయ స్వాహా' అని ఎడమచేయి యానించిన కుడచేతిలో పుష్పముంచుకొని శ్రీ గౌరీదేవతకు నైవేద్య సమర్పణము చేయవలయును.

మధ్యే మధ్యే ఉదకపానీయం సమర్పయామి, అమృతాపిధానమసి ఉత్తరాపోశనం సమర్పయామి, హస్తౌ ప్రక్షాళయామి, పాదౌ ప్రక్షాళయామి, శుద్ధాచమనీయం సమర్పయామి.

అని అయిదుపర్యాయములు పుష్పముతో నుదకమ్ము నుంచవలయును.

శ్లో. సచ్ఛాయైర్వరకేతకీదళరుచా తాంబూలవల్లీదళైః
పూగైర్భూరిగుణైస్సుగంధిమధురైః కర్పూరఖండోజ్జ్వలైః
ముక్తాచూర్ణవిరాజితైర్బహువిధైర్వక్త్రాంబుజామోదకైః
పూర్ణా రత్నకళాచికా తవ ముదే న్యస్తా పురస్తాదుమే.

హ్రీం శ్రీమంగళగౌరీదేవతాయై నమః. ముఖమండనార్థం తాంబూలం సమర్పయామి.

అని సమస్తసుగంధద్రవ్యములు వేసి సిద్ధపరిచిన విడెము లుంచిన పళ్లెమును దేవియెదుట నుంచవలయును.

శ్లో. కన్యాభిః కమనీయకాంతిభిరలంకారామలారార్తికా
పాత్రే మౌక్తికచిత్రపఙ్క్తివిలసత్కర్పూరదీపాళిభిః,
తత్తత్తాళమృదంగగీతసహితం నృత్యత్పదాంభోరుహాం
మంత్రారాధనపూర్వకంసువిహితం నీరాజనం గృహ్యతాం.

హ్రీం శ్రీమంగళగౌరీదేవతాయైనమః ఆనందనీరాజనం సమర్పయామి. అని కర్పూరహారతి నిచ్చుచు, పాటలఁ బాడ వలయును.

శ్లో. వరాంకుశౌ పాశమభీతిముద్రాం
కరై ర్వహన్తీం కమలాసనస్థాం,
బాలార్కకోటిప్రతి(మాం)భాం త్రినేత్రాం
భజేఽహమంబాం జగదీశ్వరీం తామ్.

శ్లో. సర్వమంగళమాంగల్యే శివే సర్వార్థసాధికే,
శరణ్యే త్ర్యంబకే దేవి నారాయణి నమోఽస్తు తే.

హ్రీం శ్రీమంగళగౌరీదేవతాయై నమః సువర్ణదివ్య మంత్రపుష్పం సమర్పయామి. అని పుష్పాంజలి నీయవలయును.

శ్లో. లక్ష్మీర్మౌక్తికలక్షకల్పితసితచ్ఛత్రం తు ధత్తే రసా
దింద్రాణీ చ రతిశ్చ చామరవరౌ ధత్తే స్వయం భారతీ,
వీణా మేణవిలోచనాస్సుమనసో నృత్యంతి సంరాగవ
ద్భావై రాంగికసాత్త్వికైః స్ఫుటతరంమాత స్తదాకర్ణ్యతామ్.

హ్రీం శ్రీమంగళగౌరీదేవతాయై నమః ఛత్రం సమర్ప యామి. అని పుష్పము లుంచవలయును.

చామరై ర్వీజయామి. అని చామరములతో వీవ వలయును.

గీతం శ్రావయామి. అని మాధుర్యమగు గానము చేయవలయును.

నానావిధరాజోపచారభక్త్యుపచారాన్ సమర్పయామి. అని పుష్పము లుంచవలయును.

శ్లో. హ్రీంకారత్రయసంపుటేనమనునోపాస్యే త్రయీమాళిభిః
వాక్యైర్లక్ష్యతనో తవ స్తుతివిధౌ కో వా క్షమేతాంబికే,
సల్లాపాః స్తుతయః ప్రదక్షిణశతం సంచార ఏవాస్తు మే
సంవేశో నమసస్సహస్రమఖిలం సంతుష్టయే కల్పతామ్.

హ్రీం శ్రీమంగళగౌరిదేవతాయై నమః నమస్కారాన్ సమర్పయామి. అని నమస్కరింపవలయును.

## స్తవము.

ఈ స్తవమును నిర్మలమనస్కులై శ్రీమంగళగౌరిని స్మరించుచుఁ బఠింపవలయును.

శ్లో. శ్రీమంత్రాక్షరమాలయాగిరిసుతాం యఃపూజయేచ్చేతసా
సంధ్యాసు ప్రతివాసరం సునియతస్తస్యామలం స్యాన్మనః,
చిత్తాంభోరుహమంటపే గిరిసుతా నృత్తం విధత్తే సదా
వాణీ వక్త్రసరోరుహే జలధిజా గేహే జగన్మంగళా.

శ్లో. రక్ష రక్ష జగన్మాతర్దేవి మంగళచండికే,
హారికే విపదాం రాశేర్హర్షమంగళకారికే.
హర్షమంగళదక్షే చ హర్షమంగళదాయికే,
శుభే మంగళదక్షే చ శుభే మంగళచండికే.
మంగళే మంగళార్హే చ సర్వమంగళమంగళే,
సతాం మంగళదే దేవి సర్వేషాం మంగళాలయే.
పూజ్యే మంగళవారే చ మంగళాభీష్టదేవతే,
పూజ్యే మంగళభూపస్య మనువంశస్య సంతతమ్.
మంగళాధిష్ఠాతృదేవి మంగళానాం చ మంగళే,
సంసారమంగళాధారే మోక్షమంగళదాయిని.

సారే చ మంగళాధారే పారే చ సర్వకర్మణాం,
ప్రతిమంగళవారే చ పూజ్యే మంగసుఖప్రదే.
పుత్రాన్ దేహి ధనం దేహి సౌభాగ్యం సర్వమంగళే,
సౌమంగల్యం సుఖం జ్ఞానం దేహి మే శివసుందరి.

అని స్తుతించి శ్రీమంగళగౌరికి ఫలముల నీయవలయును.

శ్లో. మంత్రహీనం క్రియాహీనం భక్తిహీనం మహేశ్వరి,
తత్సర్వం క్షమ్యతాం దేవి కాత్యాయని నమోస్తు తే.

సర్వం శ్రీమంగళగౌరీదేవతార్పణమస్తు అనయా మయా కృతయా పూజయా శ్రీమంగళగౌరీదేవతా సుప్రీతా సుప్రసన్నా వరదా భవతు. అని జలాక్షతలను వదలవలయును.

అనంతరము సెనగలు, బెల్లము, క్రొత్తరవిక, ఫలములు, పుష్పములు, దక్షిణలు మొదలగు ద్రవ్యములతో నింపిన వెదురుపాత్ర నొకదానిని బ్రాహ్మణునకు వాయన మీయవలయును. శ్రీమంగళగౌరీదేవతకు నివేదించిన సెనగలు మొదలగు మంగళద్రవ్యములను,

"కాత్యాయినీ శివా గౌరీ సావిత్రీ సర్వమంగళా,
సువాసినీభ్యో దాస్యామి వాయనాని ప్రసీదతు"

అని పఠించుచు సువాసినీస్త్రీలకును, తనతల్లికిని వాయనముల నీయవలయును.

అనంతరము పదునారువత్తులువేసిన యావునేతిదీపములను వెలిగించి, కథాశ్రవణమును జేయుచు, కాటుక సంపాదింపవలయును. దేవీప్రసాదమగు పుష్పమును శిరస్సున, కుంకుమను నుదుటను, కాటుక కండ్లను ధరించి సువాసినీలకు మృష్టాన్న మిచ్చి తృప్తిపరుపవలయును.

పూజావిధానము సంపూర్ణము.

# శ్రీమంగళగౌరీవ్రతకథ.

పాండవాగ్రేసరుండగు ధర్మజుండు శ్రీకృష్ణపరమాత్మ వలన ననేకపుణ్యగాథలను విని సంతుష్టాంతరంగుఁడై వైధవ్య నిరాకరణమగువ్రతము నొకదాని నుపదేశింపుమని వేఁడెను. అంత శ్రీకృష్ణుఁ డిట్లని చెప్పఁదొడఁగెను. ఓధర్మరాజా! సర్వ లోకపాలనియగుఁబరాశక్తి యనుగ్రహమునగాని వైధవ్యము దొలంగదు. ఆమె మంగళగౌరి యనునామమున వెలయుచు ముత్తైదువలచేఁ బూజింపఁబడుచున్నది. ఆమెను బ్రతిమంగళ వారమునఁ బూజింపవలయును. విశేషించి శ్రావణమాసమున మంగళవారములయందుఁ దప్పక పూజింపవలయును. ఆమె హారిద్రా, కుంకుమ, పుష్ప, సుగంధాది మంగళద్రవ్యముల యందును, గోఘృతముతో వెలిఁగింపఁబడిన దీపమున జ్యోతీ రూపమున నెల్లపుడు ప్రకాశించుచుండును. కాన నామెను జ్యోతీరూపమున ధ్యానించి పూజింతురు. త్రిపురాసురసంహార సమయమున నామె నీశ్వరుఁడు పూజించి జయమొందెను. అంగారకుఁ డీదేవతను బూజించుటచేఁ దారామండలమున నొక గ్రహరాజమై విరాజిల్లుచు, మంగళవారమున కధిపతియై యున్నాఁడు. మనువంశమున మంగుఁడను ప్రభు వీజననిం బూజించి పుత్రపౌత్ర సంపత్సమృద్ధి కలిగి తడవు కాలము సుఖ మనుభవించెను. ఈమాతయొక్క మహిమాతిశయములఁ దెలుపగల పురాతనేతిహాసము పెద్దలవలన వినిన దొకటి కలదు. దాని నేవిన్న విధమున నీకు విపులముగఁ దెలిపెదను. వినుము.

పూర్వము కుండిన నగరమున బహుధనవంతుఁడును, దేవబ్రాహ్మణభక్తివిశ్వాసయుతుండును నగు ధర్మపాలుఁడను

వర్తకుఁడు నివసించియుండెను. అతఁడు పత్నీయుక్తుఁడై, యెల్లపుడు ధర్మాచరణతత్పరుఁడై యుండెడివాఁడు. కాని సంతానహీనతచే మిగుల వగపొందుచుండెను. ఆనగరమునకుఁ బ్రతిమధ్యాహ్నసమయమున, భస్మశోభితదేహుఁడును, రుద్రాక్షమాలావిరాజితకంఠుఁడును, జటామండలధారియునగు భిక్షు వేతెంచి, యన్నమును యాచించి కొంపోవుచుండెడివాఁడు కాని యాతఁడీధర్మపాలుని యన్నమును స్వీకరించక నిరాకరించు వాఁడు. ఇట్లు గొన్నిదినములుగడవ నావర్తకుని భార్య దుఃఖించుచు తనభర్తకు నీ వృత్తాంతమును దెలిపెను. అంత నావర్తకుఁడు భార్యతో నిట్లనియెను. "ఇకముందు భిక్షు వరుదెంచునపుడు వస్త్రాంచలమున గుప్తపరచి సువర్ణములనిమ్ము" వల్లె యని యామెయు భిక్షువునకు భర్త చెప్పిన విధమునఁ జేసెను భిక్షు వదిచూచి, 'నీకు సంతానహీనమగుఁగాక' యని శపించెను. అంత నామె దుఃఖించి శాపమునుండి తరించు నుపాయము ననుగ్రహింపుఁడని వినయమున వేడికొన నంత నాభిక్షువు దయార్ద్రహృదయుఁడై "ఓకుమారీ! ఇపుడు నేఁ జెప్పున దంతయు నీభర్తకు వినిపించి యట్లుఁ జేయింపుము. సర్వము శుభ మగును. నీభర్త నీలవస్త్రధారియై యొక్కనీలాశ్వము నెక్కి యరణ్యమార్గమునఁ బోవలయును. అట్లుబోవ నానావిధ పశుపక్షి మృగాదులతో రమ్యమగు నాయరణ్యమం దెచట నీ నీలాశ్వ మలసటనొంది భువిఁబడునో, యచట దిగి త్రవ్వవలయును. అందు నానారత్నమాణిక్యఖచితస్వర్ణ దేవాలయ మొకటి గానుపించును. అందు భక్తవత్సల యగుభవానీ వసించుచుండును. ఆమెను పూజించిన మిమ్ముల నుద్ధరింపఁ గలదు." అని యానతిచ్చెను. సంతోషప్రదములగు నాభిక్షు

వాక్యములను విని యామె భిక్షుపాదారవిందములకు పునః పునః ప్రణామముల నాచరించెను. ఇంతలో భిక్షు వంతర్ధాన మొందెను. అనంతర మీవృత్తాంత మంతయుఁ దన భర్తకు వినుపింప నాతఁ డంగీకరించి నీలవస్త్రధారియై నీలాశ్వము నొక దానినెక్కి యరణ్యమార్గమునఁ బోవంబోవ నానావిధపశుపక్షి మృగాదులతో రమ్యమును భయంకరమును నగునా యరణ్య మధ్యమున రక్తనీలోత్పలములతోడను, చక్రవాక ద్వంద్వ ములతోడను విరాజిల్లెడు సరస్సు నొకదానిఁ గాంచి యందు స్నానతర్పణాదుల నొనర్చి మరల యశ్వము నెక్కి యాయర ణ్యముఁ బ్రవేశింప నందు నీలాశ్వ మలసటజెంది క్రింద బడెను. అంత గుఱ్ఱమును దిగి, యచ్చోట త్రవ్వ నారంభింపఁ గొలఁదికాలముననే నానారత్నవిరాజిత మగు నొక దేవా లయమును నందు భవానీదేవిని జూచి విస్మయమునొంది యుప దేశ వాక్యముల స్మరించి విధ్యుక్తవిధానమున నానావిధోప చారములఁ బుష్పధూపదీపనైవేద్యాదులతోఁ బూజించి దేవీ మంత్రమును జపించుచు సగుణధ్యానతత్పరుఁడై యున్న ధర్మ పాలుని జూచి భవాని సంతసించి "నీభక్తికి మెచ్చితి. వరమడు గుము. నీకు బహుళ మగుధన మిచ్చెదను గైకొను" మని యెను. అంత ధర్మపాలుఁడు "అమ్మా! నీయనుగ్రహమున బహుళమగు ధనము కలదు. పితృతారకమగు పుత్రసంతా నము ననుగ్రహింపుము. సంతానహీనుఁడ నగుటచే నాయింట నేభిక్షువు నన్నము నంగీకరింపఁడు. ఇది కడు కష్టముగ నున్నది" అని విన్నవించెను. అంత నాదేవి, "ధర్మపాలా, నీకు సుఖప్రద మగు సంతానప్రాప్తిలేదు. అయినను కోరికొనుము. వైధవ్యము గల కన్య కావలయునా? దీర్ఘాయుష్మంతుఁడు, నంధుఁడు,

వ్యర్థుఁడు నగుఁబుత్రుఁడు కావలయునా? అల్పాయుష్మంతుఁ డును, సుగుణాన్వితుండును నగుఁబుత్రుఁడు కావలయునా?" అని ప్రశ్నించెను. "తల్లీ! అల్పాయుష్మంతుఁడును సుగుణాన్వి తుఁడును నగుకొమరు నిమ్ము. నేను కృతకృత్యుఁడనై నా పిత రుల నుద్ధరింతును." అని ధర్మపాలుఁ డడిగెను. అంత నా దేవి "ఓయీ! నాపార్శ్వమునం దొక గణపతి కలఁడు. అతని నాభియం దడుగిడి యాసమీపమున నున్న చూతవృక్షము నుండి యొకఫలము కోసుకొని నీభార్య కిమ్ము. ఆమె దాని భుజింపఁ దప్పక పుత్రుని గనును. సంశయ మక్కఱ లేదు." అని సెలవిచ్చెను. ధర్మపాలుఁ డట్లే గణపతి నాభియందుఁగాలు పెట్టి చెట్టునుండి మామిడిపండ్లనుకోసి తనయొడి నింపుకొనిదిగె ను. కాని దిగి చూచుకొన నొక్కఫలముమాత్రమే యందుండఁ గని యాశ్చర్యమొందెను. గణపతి ధర్మపాలుని యకృత్యము నకుఁ గినిసి "నీకుఁ బుట్టెడు కొమరుఁడు పదునాఱవయేట సర్ప దష్టుఁడై మృతినొందు" నని శపించెను. ఫలమును గ్రహించి ధర్మపాలుఁ డింటికిఁజేరి తనపత్ని కాఫలము నిచ్చి జరిగిన యుదంతము నంతయు వినిపించెను. ఆపెయు ఫలమును భుజించి భర్తతో సుఖముగనుండి భవానీ యనుగ్రహమున గర్భమును దాల్చి నవమాసానంతరము శుభముహూర్తమున నొకకుమా రుని గనెను. పుత్రజననము కాగానే ధర్మపాలుఁడు జాత కర్మయు, నాటి పండ్రెండవదినమున శివుఁడనునామకరణమును, నాఱవమాసమున నన్నప్రాశనమును, మూడవయేట చూడాకర్మ మును, నెనిమిదవయేట యుపనయనమును జేసెను. ఆకొమ రుఁడు క్రమమున విద్యాబుద్ధుల నార్జించుచు మాతాపితరుల కానందదాయకుఁడై యుండెను. శివునకుఁ బదియవ వత్సరము

రాగాఁ బతివ్రత యగు నాతని తల్లి వివాహముఁజేయుట యుక్త మని భర్తతో నివేదించెను. వివాహముతో నాతని యాయుష్య మభివృద్ధి నొందునని యామె కోరెను.

ధర్మపాలుఁ డామెవాక్యములు విని "అయ్యా! మన కొమరుఁడు కాశీకిఁబోయి గంగాస్నాన మాచరించి విశ్వేశ్వ రాన్నపూర్ణల దర్శించి రావలయు నని సంకల్పించితిని. పోయి రానిమ్ము. అనంతరము వివాహమునుగూర్చి యోచింతము." అని యనెను.

అట్లు భార్యతోఁ జెప్పి సమ్మతిపరచి శివునకుఁ పదాఱవ యేడు రాగానే పిల్లవానిని, యాతని మేనమామను బహు ధనముతోఁ గాశికిఁ బ్రయాణము చేయించి పంపెను. వారిరువు రను త్రోవలోఁ బల్లెలు పట్టణములఁ జూచుచు విరివిగ ధర్మ ముల నాచరించుచుఁ బ్రతిష్ఠాపుర మనుపట్టణముఁ జేరి యట నొక యారామమున విడిసిరి. అచ్చటి కానగరమందలి కన్యక లనేకులు క్రీడించుటకై వచ్చిరి. అందు సుశీల యనునొకకన్య యొకసఖితోఁ బోరాడ నాసఖి సుశీలను 'రండ, ముండ' యని తిట్టెను. అంత నా సుశీల యిట్లనియెను—"ఓసఖి! నీవు నన్ను వ్యర్థముగఁ దిటుచున్నావు. నాతల్లి మానవతి మంగళగౌరీ వ్రతము నాచరించుచున్నది. ఆమంగళగౌరీప్రసాదమున మా కుటుంబమునగాని మాబంధువుల కుటుంబములలోగాని యెవ్వరు ముండలుకాఁజాలరు. అయిన నేకన్యను. ఏభయమును లేదు." ఆ సమీపముననున్న శివుని మేనమామ సుశీలావాక్య ముల విని విస్మయమంది "ఆహా! ఈసుమంగలియగు కన్య నా మేనల్లునికి భార్యయగునేని తప్పక చిరంజీవియగును. ఈ కా ర్యము నెట్లయిన ఘటింపవలయు"నని నిశ్చయించుకొనెను. సుశీ

లయ్యెఁ దనసఖులతో నింటికిఁ జనియెను. ఆ వణిజయాత్రికులు సుశీలాగృహమును దెలిసికొని యాగృహారామముననే యొక తటాకసమీపమున బసచేయుట కేర్పరచుకొనిరి. ఆ సమీపముననే సుశీలాపితరులచే నర్చింపఁబడు పార్వతీపరమేశ్వరాలయ మొకటి కలదు. సుశీల తండ్రి హరి యనువాఁడు. పరమేశ్వరాజ్ఞల ననుసరించి సర్వవ్యవహారములను నడపువాఁడు. అతఁ డొకనాఁడు తనభార్య యగుమానవతితోఁగూడి పార్వతీపరమేశ్వరుల దర్శించి, తన కుమార్తె యగుసుశీలకుఁ దగిన వరుఁ డెవఁడని వినయముతో నంజలి ఘటియించి యంబికను బ్రార్థించెను. ఇట్టిసమయమున నచటనే సుశీల నెట్లయిన తన మేనల్లునకు వివాహముఁజేయింప సంకల్పించిన మేనమామ యాయాలయమువెనుకనుండి "శివనాముఁడగు నొక పథికుఁడు నీ కిచటనే దొరుకఁగలఁడు. అతఁడే తగినవరుఁ" డని గూఢుఁడై పల్కెను. ఇది యంబికావాక్యమే యని విశ్వసించి హరి శివనామకపథికునకై వెదకుచుండ వణిజయాత్రికు లిద్దఱు హరిని సమీపించిరి. హరి వారి యోగక్షేమముల విచారింప శివనామకపథికుఁ డాతఁ డని దెలిసెను. ఆతఁడే తనకుమార్తె యగు సుశీలకుఁ దగిన వరుఁడని యంబికావాక్యముల స్మరించెను. హరియొక్క వాక్యమును ముఖవైఖరిని గుర్తించుచుండిన వణిజుఁడు సుశీలను దన మేనయల్లున కీఁదగునని నివేదించెను. హరి యందులకు సమ్మతించి వివాహసుముహూర్తమును నిశ్చయించి సుశీలాశివులకు వివాహలగ్నము గావించెను. సుశీలాశివులకు వివాహమాయెను. సుశీలకు మానవతియు, శివునకు మేనమామయు శ్రీమంగళగౌరీమాహాత్మ్యమును విశదీకరించి, శ్రీదేవీస్మరణమును వారలచేఁ జేయించిరి.

క్షారలవణవర్జ్యముగ భుజించి సుశీలాశివులు దర్భా
స్తరణములపై బ్రహ్మచర్యవ్రతులై శయనించిరి. అంత నర్ధ
రాత్రియందు సుశీలకు స్వప్నమందు మంగళగౌరి, తనతల్లి
రూపమున కానుపించి "ఓసుశీలా! నీభర్త యల్పాయుష్మంతుఁడు.
అతనియాయు వీరాత్రితో తీర నున్నది. ఇంకొకక్షణమున
కృష్ణసర్పమొకటి వచ్చి యాతని గఱచును. కావున నీకొక
యుపాయమును జెప్పెద వినుము. లెమ్ము. ఒకఘటము తెచ్చి
యందు పా లుంచి, యద్దాని నాసర్పమున కెదుట నుంచుము.
అయ్యది దానిం బ్రవేశింప నీవు నీవస్త్రమును నాఘటమునకు
గట్టిగా కట్టియుంచి, యుదయమున నీతల్లి కాఘటమును వాయ
నముగ నిమ్ము. నీభర్తకు గండము తప్పుననెను. "సుశీల యా
దేవివాక్యములను విని భయమంది, తెలివి దెచ్చుకొని చూడ
గనే బుసలకొట్టుచు కృష్ణసర్ప మొకటి తనభర్తను సమీపిం
చుటఁ జూచెను. ధైర్య మవలంబించి త్వరితముగ ఘటము
నొకదానిం దెచ్చి, యందు పా లుంచి, మంగళగౌరిని స్మరిం
చుచు నాసుశీల యాపాముకు నెదుట నుంచెను. అంత నాపా
ముందుఁ బ్రవేశింప వెంటనే సుశీల తనవస్త్రమును చీల్చి, ఘట
మునకు గట్టిగాఁ గట్టియుంచెను. అంత కొంతవడికి శివుఁడు
మేల్కాంచి, తన కాకలి యగుచున్నందున నేమైన బెట్టుమని
సుశీల నడిగెను. ఆమెయు ముదమున నొక బంగరుపళ్లెరమున
భక్ష్యముల నుంచి యాతని భుజింపఁజేసెను. అతఁ డాభక్ష్య
ముల భుజించి, తనయంగుళీయకము నొకదానిని యట పడ
వైచి పాత్ర నొకచో గుప్తముగఁ దాచెను. అనంతర మిద్దఱు
యథాపూర్వముగ సుఖముగ నిదురించిరి. తెల్లవారకముందే
శివుడు మేల్కాంచి యెవరికిఁ జెప్పకయే మేనమామం [illegible]

వెడలిపోయెను. సుశీలయు లజ్జతోఁగూడినదై శివుఁడు విడచిన యంగుళీయకమును భద్రపఱుచుకొని తల్లిం జేరెను. అంతట నా శివునివేషము ధరించి, సాకొచ్చివుఁడే హరియింటికి వచ్చి పెండ్లికొమరుఁడై నిలిచెను. ఇతఁడే యతఁడని యంద ఱను కొనుచుండిరి. భేద మెవ్వరికిం దోఁపలేదు. సుశీలయు స్నాన మాచరించి, స్వప్నమున మంగళగౌరి యానతిచ్చిన విధమునఁ దా గుప్తపరచియుంచిన ఘటమును దెచ్చి, తల్లికి వాయన మిచ్చెను. దాని విచ్చిచూడ నం దొకముత్యాలహార ముండెను. తల్లి యా ముత్యాలహారమును సుశీల కిచ్చెను. అనంతరము క్రీడాకాలమున సుశీలను వరునితోఁ గ్రీడింపఁ దల్లి యాజ్ఞా పింపఁ దన పాణిగ్రహణ మొనరించి, తనతో నిదురించిన వరుఁ డీతఁడు కాఁడని సుశీల నిరాకరించెను. ఆతఁ డారాత్రి తెల్ల వారకముందే తనను విడచిపోయె నని సుశీల వక్కాణించెను. ఎప్పటికైన నాతఁడు కాశికిఁ బోయి మరల రాగలఁడనియు, నాతని దాను గుర్తింపఁగలుగుదు ననియు, నందుల కుపాయ ముగ నావీట నొకయన్నసత్రమును వేయించవలయుననియు నందుఁ దాను వచ్చెడు నతిథుల కందఱకుఁ బాదప్రక్షాళన మొనరించునియమం దుందుననియు సుశీలచెప్పెను. ఇంతలో మాయావరుఁ డంతర్ధాన మొందెను. అందఱు విస్మయ మొంది సుశీలావాక్యముల విశ్వసించిరి. మానవతియు హరియు సుశీల చెప్పిన విధమున నన్నసత్రము వేయించిరి. అందుఁ బ్రత్యహము సుశీల తనభర్తవిడిచిన యంగుళీయకమును ధరించి యతిథులకుఁ బాదప్రక్షాళన మొనరించు చుండెను. మానవతి జలపాత్రను ధరియించి, ప్రక్షాళనోదకము నిచ్చుచుండెను. సుశీలాసోదరులు చందనము నిచ్చుచుండిరి. హరి భోజనానంత

రము తాంబూలాదికము నిచ్చుచుండెను. ఇట్లాకుటుంబీకు లందఱు అతిథిసేవాతత్పరులై యుండిరి.

ఆనాఁడు వివాహమందిరమునుండి వెడలిపోయిన శివుఁడును, నాతని మేనమామయు సుఖముగ వారణాసీపురముం జేరి గంగోదకంబుల స్నానమాడి విశ్వేశ్వరాన్నపూర్ణల దర్శించి విధ్యుక్తముగ నారాధించి హరిద్వారముఁ జేరి భాగీరథిం గ్రుంకులిడి యచ్చటచ్చట గల భిక్షువులకుఁ బీతాంబరాదుల నిచ్చి వారలచే "చిరంజీవ" యని యాశీర్వచనముల నందుకొని దేవతల కందఱకు నమస్కరించుచు స్తుతులచేఁ గీర్తించుచు సంతసమున స్వగృహోన్ముఖులైరి. మార్గమధ్యమున నొకరాత్రి శివున కొకస్వప్నమాయెను. స్వప్నమందుఁ దనకుఁ బ్రాణాపాయ సమయ మాసన్నమైనట్లును, నాసమయమున యమదూతలును, మంగళగౌరియు సమావేశులై యుద్ధమొనరించినట్లును, తుదకు మంగళగౌరి జయమొంది తన ప్రాణముల నిల్పినట్లును గన్పడిన దని వృత్తాంతమును దన మేనమామకుఁ జెప్ప నాతఁడు శ్రీ మంగళగౌరీస్మరణమును మఱువకుండు మని హెచ్చరించెను. మార్గమధ్యమున ప్రతిష్ఠాపురముం జేరి పూర్వము విడిసినతటాక ప్రాంతముననే వంట జేసికొన నుద్యుక్తులైరి. హరి సేవకులు వారిం జూచి తమప్రభువు పెట్టుచున్న యన్నసత్రమునకుఁ బొండని ప్రార్థించిరి. 'మేము యాత్రికులము, పొరుగిండ్లకుఁబోనొల్లము' మని వారు నిరాకరించిరి. సేవకులవల్ల వీరి వృత్తాంతమును, గుఱుతులను విని హరి నూత్న వస్త్రాదులను హస్త్యశ్వములను సగౌరవముగఁ బంప వార లంగీకరించి, హరిగృహముం జేరిరి. శివునిపాద ప్రక్షాళన మొనరించుచు, నితఁడే నావరుఁ డని సుశీల లజ్జతోఁ దనతల్లికిం జెప్పెను. సుశీల శివునియానవా

లుంగరముం జూపి, మానవతీహరులను మెప్పించెను. శివుఁడు హరిగృహముంజేరి తా దాచియుంచిన ఫలాహార పాత్రమును దెచ్చి యంజలియెదుట నుంచెను. హరి సంతసించి యథావిధిగ బూజించి వివాహపరిసమాప్తి గావింపించి స్వర్ణవస్త్రాదుల నిచ్చి గౌరవించెను. శ్రావణమాసము రాగానే సుశీల మంగళవారములయందు శాస్త్రోక్తవిధానమున మంగళగౌరీవ్రతము నాచరించెను. అనంతరము మానవతీహరుల సెలవుగైకొని శివుఁడు సుశీలను వెంటనిడుకొని తనమేనమామతో స్వనివాసమగుకుండిన నగరముం జేరెను. సుశీల వినయమ్మున నత్తమామలకు నమస్కరించెను "అమ్మా! అల్పాయుష్మంతుఁ డగు నాకొమరున కీట్లాయుష్యాభివృద్ధి యాయె" నని ధర్మపాలునిపత్ని కోడలిని బ్రశ్నించెను. "నాతల్లి మానవతిని, దండ్రి హరిని, నత్తమామలగుమిమ్ములను, మీ కొమరుఁడగు శివుని, మమ్ములరక్షించు మంగళగౌరిని దప్ప యన్య మెరుగను" అని సుశీల ప్రత్యుత్తర మిచ్చెను. శ్రీమంగళగౌరీమాహాత్మ్యము నందఱు కీర్తించిరి సుశీలాశివులు పుత్రపౌత్ర సంపత్సమృద్ధిమంతులై చిరకాలము సమస్తభోగముల ననుభవించి తుదకు శ్రీపురముం జేరి సుఖించిరి. కావున నోధర్మరాజా! శ్రీమంగళగౌరీప్రసాదమున వైధవ్యనిరాకరణ మతిసులభము. నూత్నవివాహితలు మంగళగౌరీవ్రతము నాచరించి యావజ్జీవసౌమంగల్యము నంది సుఖింతురు.

శ్లో. స్వస్తి ప్రజాభ్యః పరిపాలయంతాం
న్యాయ్యేన మార్గేణ మహీం మహీశాః,
గోబ్రాహ్మణేభ్యశ్శుభమస్తు నిత్యం
లోకాస్సమస్తాః సుఖినో భవన్తు.

మంగళగౌరీవ్రతకథ సంపూర్ణము.

## వ్రతోద్యాపనము.

ఈవ్రతము వివాహమైన వత్సరమునుండియు ప్రారంభించి యయిదువత్సరములు చేయవలయును. అయిదవవత్సరమున శ్రావణమంగళవారమునందుఁ బగలు యథావిధిగ మంగళగౌరీపూజన మాచరించి దంపతు లుపవసించి రాత్రి మంటపాదికమును నిర్మించి యందుఁ బదునాలుకలశములను స్థాపింపవలయును. ఆకలశములయం దుమామహేశ్వరులను బ్రహ్మను గణపతిని స్కందుని శచీపురందరులను సప్తమాతృకలను లక్ష్మీనారాయణులను సావిత్రిని సమస్తదేవతలను నవగ్రహములను బూజింపవలయును. అశక్తులగువారైదింటి నుంపవలయును. లేకున్న రెండైన నుంపవలయును. ప్రతియామమునందు జాగరణయుక్తులై పూజింపవలయును. మరునాఁడు సుస్నాతులై స్వశాఖోక్తవిధానమున్న బెల్లము, జీలకఱ్ఱ, పరమాన్నము, నెయ్యి, రావిసమిధలు, దూర్వాంకురములు వీనితో హోమము జేయవలయును. "సర్వమంగళమాంగల్యే" అను మంత్రము ప్రధానము. పదునాలువెదురుపాత్రలయందు మంగళద్రవ్యముల నుంచి సువాసినీలకు వాయనముల నివ్వవలయును. "ఉద్దీప్యస్వ" అనుమంత్రముతోఁ బదునాలువత్తుల దీపముల పదునాలింటిని వెలిఁగింపవలయును. సువాసినీలను దంపతులను భోజనచందనతాంబూలాదులతోఁ బూజింపవలయును.

---

# తులసీపూజావ్రతము.

ఆచమ్య, ఆత్మనస్సర్వాభీష్టసిద్ధ్యర్థం జ్ఞానప్రాప్తిద్వారా మోక్షఫలావాప్త్యర్థం చ భర్త్రా సహ అఖండితసుఖసౌభాగ్య సంతత్యాయురారోగ్యైశ్వర్యాభివృద్ధిద్వారా తులసీదేవతా ప్రీత్యర్థం చ బృందావనే తులసీపూజాం కరిష్యే కలశం గన్ధ పుష్పాదిభిరభ్యర్చ్య దీపం ప్రజ్వాల్య ధ్యాయేత్. దీపస్త్వం బ్రహ్మరూపోఽసి జ్యోతిషాం ప్రభురవ్యయః, సౌభాగ్యం దేహి పుత్రాంశ్చ సర్వాన్కామాంశ్చ దేహిమే. ఇతి దీపదేవ తాభ్యో నమః సకలపూజాపరిపూర్ణార్థే గన్ధాక్షతపుష్పాణి సమర్పయామి.

అథ తులసీధ్యానమ్.

శ్లో. ధ్యాయేచ్చ తులసీం దేవీం శ్యామాం కమలలోచనాం,
ప్రసన్నాం పద్మవదనాం వరాభయచతుర్భుజామ్.
కిరీటహారకేయూరకుండలాదివిభూషణాం,
ధవళాంశుకసంయుక్తాం పద్మాసననిషేవితామ్.
ప్రియాంచ సర్వదా విష్ణోః సర్వదేవనమస్కృతామ్.

ఇట్లు ధ్యానించిన పిదప పూజను ప్రారంభించవలెను.

దేవి త్రైలోక్యజనని సర్వలోకైకపావని,
ఆగచ్ఛ వరదే మాతః ప్రసీద తులసిప్రియే.

(ఐం ఈం సౌః శ్రీం తులస్యై నమః. ఆవాహనం సమర్పయామి.)

శ్లో. సర్వదేవమయే దేవి సర్వదా విష్ణువల్లభే,
దేవి స్వర్ణమయం దివ్యం గృహాణాసనమవ్యయే.

(ఐం ఈం సౌః శ్రీం తులస్యై నమః. నవరత్నఖచిత సింహాసనం సమర్పయామి)

సర్వే దేవే యథా స్వర్గే తథా త్వం భువి సర్వదా,
దత్తం పాద్యం గృహాణేదం తులసి త్వం ప్రసీద మే

(ఐం ఈం సౌః శ్రీం తులస్యై నమః. పాదయోః పాద్యం సమర్పయామి.)

గన్ధపుష్పసమాయుక్తం సర్వేషాం ప్రీతిదాయకం,
అర్ఘ్యం గృహాణ త్వం దేవి దైత్యాంతకరణప్రియే.

(ఐం ఈం సౌః శ్రీం తులస్యై నమః. హస్తయోరర్ఘ్యం సమర్పయామి.)

కర్పూరవాసితం తోయం సువర్ణకలశే స్థితం,
దత్త మాచమనీయం చ గృహాణ హరివల్లభే.

(ఐం ఈం సౌః శ్రీం తులస్యై నమః శుద్ధాచమనీయం సమర్పయామి)

స్వర్ణపాత్రే సమానీతం దధిఖండమధుప్లుతం,
మధుపర్కం గృహాణేదం మయా దత్తం సురేశ్వరి.

(ఐం ఈం సౌః శ్రీం తులస్యై నమః. మధుపర్కం సమర్పయామి.)

పంచామృతం మయానీతం పయోదధిఘృతం మధు,
సహ శర్కరయా దేవి స్నానార్థం ప్రతిగృహ్యతామ్.

(ఐం ఈం సౌః శ్రీం తులస్యై నమః. పంచామృత స్నానం సమర్పయామి.)

గంగాగోదావరీకృష్ణాపయోష్ణ్యాద్యాపగాస్తథా,
ఆయాన్తు తా స్సదా దేవ్యా స్తులసీస్నానకర్మణి.

(ఐం ఈం సౌః శ్రీం తులస్యై నమః. మలాపకర్షణ స్నానం సమర్పయామి.)

గఙ్గా సరస్వతీ రేవా పయోష్ణీ నర్మదాజలైః,
స్నాపితాఽసి యథా దేవి తథా శాంతిం కురుష్వ మే.

(ఐం ఈం సౌః శ్రీం తులస్యై నమః శుద్ధోదకస్నానం సమర్పయామి.)

కృష్ణా సరస్వతీ కాలీ తుఙ్గభద్రా శచీ తథా,
భాగీరథీ పార్వతీ చ రమా నారాయణీ కృపీ,
సుభద్రా ద్రౌపదీ సాధ్వీ మాతా చైవాప్యరుంధతీ,
సావిత్రీ కాళికాఽహల్యా స్నాపయిష్యన్తు సర్వదా.
ఆభిః కృతాభిషేకా త్వం దదాస్యధికమంగళం,
అతస్త్వాం స్నాపయిష్యామి తులసీ విష్ణువల్లభే.
శాన్తి స్సుశాన్తి శ్శాన్తి ర్భవతు, అమృతాభిషేకోఽస్తు.

(ఐం ఈం సౌః శ్రీం తులస్యై నమః. అభిషేకం సమర్పయామి.)

అభిషేకాన్తే ఆచమనీయం సమర్పయామి.

క్షీరోదమథనోద్భూతే చంద్రలక్ష్మీసహోదరే,
గృహ్యతాం పరిధానార్థమిదం క్షౌమాంబరం శుభే.

(ఐం ఈం సౌః శ్రీం తులస్యై నమః. వస్త్రం సమర్పయామి.)

కంచుకీముపవస్త్రం చ నానారత్నైస్సమన్వితం,
గృహాణ త్వం మయా దత్తం తులసి భవహారిణి:

(ఐం ఈం సౌః శ్రీం తులస్యై నమః. కంచుకీముపవస్త్రం సమర్పయామి)

కేసరాగరుసంయుక్తం చందనాదిసమన్వితం,
కస్తూరికాసమాయుక్తం కుంకుమం ప్రతిగృహ్యతామ్.

(ఐం ఈం సౌః శ్రీం తులస్యై నమః. కుంకుమం సమర్పయామి.)

అక్షతాంశ్చ మహాదేవి తులసి భాగ్యదాయికే,
అర్పయామి సదా భక్త్యా సుఖసంతతిలబ్ధయే.

(ఐం ఈం సౌః శ్రీం తులస్యై నమః అక్షతాన్ సమర్పయామి.)

హరిద్రాం కుంకుమం చైవ సిందూరం కజ్జలాన్వితం,
మయా నివేదితం భక్త్యా గృహాణ పరమేశ్వరి.

(ఐం ఈం సౌః శ్రీం తులస్యై నమః. సౌభాగ్యద్రవ్యం సమర్పయామి.)

మాల్యాదీని సుగన్ధీని మాలత్యాదీని సత్తమే,
మయా హృతాని పూజార్థం పుష్పాణి ప్రతిగృహ్యతామ్.

(ఐం ఈం సౌః శ్రీం తులస్యై నమః. పుష్పాణి సమర్పయామి)

## తులసీ అష్టోత్తరశతనామావళిః.

హ్రాం శ్రీతులసీదేవ్యై నమః
శ్రీసఖ్యై

శ్రీభద్రాయై
శ్రీమనోజ్ఞానపల్లవాయై

పురందరసతీపూజ్యాయై
పుణ్యదాయై
పుణ్యరూపిణ్యై
జ్ఞానవిజ్ఞానజనన్యై
తత్త్వజ్ఞానస్వరూపిణ్యై
జానకీదుఃఖశమన్యై ౧౦
జనార్దనప్రియాయై
స్మరకల్మషసంహర్త్ర్యై
స్మరకోటిసమప్రభాయై
పాంచాలీపూజ్యచరణాయై
పాపారణ్యదవానలాయై
కామితార్థప్రదాయై
గౌరీశారదాసంసేవితాయై
వందారుజనమందారాయై
నిలింపాభరణాసక్తాయై
లక్ష్మీచంద్రసహోదర్యై ౨౦
సనకాదిమునిధ్యేయాయై
కృష్ణానందజనిత్ర్యై
చిదానందస్వరూపిణ్యై
నారాయణ్యై
సత్యరూపాయై
మాయాతీతాయై
మహేశ్వర్యై
శుభప్రదాయై
వదనచ్ఛవినిర్ధూతరాకా
[పూర్ణనిశాకరాయై
రోచనాపంకతిలకలసన్నిటల
[భాసురాయై ౩౦
శుద్ధాయై
పల్లవోష్ఠ్యై
పద్మముఖ్యై
ఫుల్లపద్మదళేక్షణాయై
చాంపేయకలికాకారనాసా
[దండవిరాజితాయై
మందస్మితాయై
మంజులాంగ్యై
మాధవప్రియభామిన్యై
మాణిక్యకంకణాకారాయై
మణికుండలమండితాయై
ఇంద్రసంపత్కార్యై
శక్త్యై
ఇంద్రగోపనిభాంశుకాయై
క్షీరాబ్ధితనయాయై
క్షీరసాగరసంభవాయై
శాంతికాంతిగుణోపేతాయై
బృందానుగుణసంపత్త్యై
పూతాత్మాయై
పూతనాదిస్వరూపిణ్యై

యోగిధ్యేయాయై ౫౦
యోగానందవిధాయై
చతుర్వర్గప్రదారామాయై
చతుర్వర్ణైకపావనాయై
త్రిలోకజనన్యై
గృహమేధిసమారాధ్యా
సదనాంగణపావనాయై [యై
మునీంద్రహృదయావాసా
మూలప్రకృతిసంజ్ఞికాయై
బ్రహ్మరూపిణ్యై
పరంజ్యోతిషే ౬౦
అవాఙ్మానసగోచరాయై
పంచభూతాత్మికాయై
పంచకాలాత్మికాయై
యోగాచ్యుతాయై
యజ్ఞరూపిణ్యై
సంసారదుఃఖశమన్యై
సృష్టిస్థిత్యంతకారిణ్యై
సర్వప్రపంచనిర్మాత్ర్యై
వైష్ణవ్యై
మధురస్వరాయై ౭౦
నిరీశ్వరాయై
నిర్గుణాయై
నిత్యాయై
నిరాటంకాయై
దీనజనపాలనతత్పరాయై
రణత్కింకిణికాజాలరత్న
[కాంచీలసత్కట్యై
చలన్మంజీరచరణాయై
చతురాననసేవితాయై
అహోరాత్రకారిణ్యై
ముక్తాహారభరాక్రాంతాయై
ముద్రికారత్నభాసురాయై
సిద్ధిప్రదాయై
అమలాయై
కమలాయై
లోకసుందర్యై [యై
హేమకుంభకుచద్వయా
లసితకుంభద్వయాయై
చంచలాయై
లక్ష్మ్యై
శ్రీకృష్ణప్రియాయై ౮౦
శ్రీరామప్రియాయై
శ్రీవిష్ణుప్రియాయై
శంకర్యై
శివశంకర్యై
శ్రీతులస్యై
కుందకుట్మలరదనాయై

పక్వబింబోష్ఠ్యై
శరచ్చంద్రికాయై
చారిపేయనాసికాయై
కంబుసుందరగళాయై ౧౦౦
తటిల్లతాంగ్యై
మత్తబంభరకుంతలాయై
నక్షత్రనిభనఖాయై
రంభానిభోరుయుగ్మాయై
సైకతశ్రోణ్యై
మందకంఠీరవమధ్యాయై
కీరవాణ్యై
శ్రీమహాతులస్యై నమః

(ఐం ఈం సౌః శ్రీం తులస్యై నమః.)
అష్టోత్తరశతనామపూజాం సమర్పయామి.

వనస్పతిరసోద్భూతో గంధాఢ్యో గంధ ఉత్తమః,
ఆఘ్రేయస్సర్వదేవానాం ధూపోఽయం ప్రతిగృహ్యతామ్.
(ఐం ఈం సౌః శ్రీం తులస్యై నమః ధూపమాఘ్రాపయామి.)
వైశ్వానరప్రజ్వలితం ఘృతకార్పాసనిర్మితం,
దీపం భక్త్యా గృహాణేదం త్రైలోక్యధ్వాన్తనాశికే.
(ఐం ఈం సౌః శ్రీం తులస్యైనమః దీపం సమర్పయామి.)
అన్నం చతుర్విధం స్వాదు రసైష్షడ్భిస్సమన్వితం,
నైవేద్యం గృహ్యతాం దేవి తులసి మాధవప్రియే.
(ఐం ఈం సౌః శ్రీం తులస్యై నమః నైవేద్యం సమర్పయామి)

(అత్ర ప్రాణాయ నమః, అపానాయ నమః, వ్యానాయ నమః, ఉదానాయ నమః, సమానాయ నమః, ఏవముచ్చార్య నైవేద్యం సమర్పయేత్.)

నైవేద్యాన్తే ఆచమనీయం సమర్పయామి, మధ్యే మధ్యేపానీయం, ఉత్తరాపోశనం, హస్తప్రక్షాళనం, కరోద్వర్తనార్థే చందనం చ సమర్పయామి.

ఇదం ఫలం మయా దేవి స్థాపితం పురతస్తవ,
తేన మే సఫలావాప్తిర్భవేజ్జన్మని జన్మని.
(ఐం ఈం సౌః శ్రీం తులస్యైనమః ఫలం సమర్పయామి.)
పూగీఫలం మహద్దివ్యం నాగవల్లీదళైర్యుతం,
కర్పూరైలాసమాయుక్తం తాంబూలం ప్రతిగృహ్యతామ్
(ఐం ఈం సౌః శ్రీం తులస్యైనమః తాంబూలం సమర్ప
యామి )
హిరణ్యగర్భగర్భస్థం హేమబీజం విభావసోః,
అనంతపుణ్యఫలదమతశ్శాంతిం ప్రయచ్ఛమే.
(ఐం ఈం సౌః శ్రీం తులస్యై నమః. దక్షిణాం సమర్ప
యామి.)
నీరాజయామి సతతం హరివల్లభేఽద్య
కర్పూరవర్తిభిరలం సుఖదాయికే త్వాం,
పాదౌ భజామ్యవిరతం తవ దేవి మాయే
వంశాయ సౌఖ్యమపి దేహి బలం చ పూర్ణమ్.
(ఐం ఈం సౌః శ్రీం తులస్యై నమః. కర్పూరార్తిక్యం
సమర్పయామి )
యాని కాని చ పాపాని జన్మాంతరకృతాని చ,
తాని సర్వాణి నశ్యన్తి ప్రదక్షిణపదేపదే.
నమస్తే గార్హపత్యాయ నమస్తే దక్షిణాగ్నయే,
నమ ఆహవనీయాయ తులస్యై తే నమోనమః.
(ఐం ఈం సౌః శ్రీం తులస్యై నమః. ప్రదక్షిణనమ
స్కారాన్ సమర్పయామి )
విష్ణుప్రియకరే దేవి తులసి సుఖదాయకే,
పుష్పాంజలిం ప్రయచ్ఛామి పతేరాయుష్యవర్ధిని!

(ఐం ఈం సౌః శ్రీం తులస్యై నమః మంత్రపుష్పాంజలిం సమర్పయామి.)

గంధప్రసూనసంయుక్తం ఫలముద్రాదిశోభితం,
అర్ఘ్యం దదామి తులసి తవ ప్రీత్యై నమోనమః.

(ఐం ఈం శ్రీం తులస్యైనమః అర్ఘ్యత్రయం సమర్పయామి.)

అథ ప్రార్థనా.

సౌభాగ్యం సంతతిం దేవి ధనం ధాన్యం చ మే సదా,
ఆరోగ్యం శోకశమనం కురు మే మాధవప్రియే.
అభీష్టఫలసిద్ధిం చ సదా దేహి హరిప్రియే,
దేవైస్త్వం నిర్మితా పూర్వమర్చితాఽసి మునీశ్వరైః,
అతో మాం సర్వదా భక్త్యా కృపాదృష్ట్యా విలోకయ,
పతేరాయుశ్చ భాగ్యం చ సదా దేహి హరిప్రియే
పూతనాభయసంత్రాసాద్రక్షితశ్చ యథా హరిః,
తథా సంసారసంత్రాసాద్రక్ష మే వంశముత్తమమ్.

ఏవమనన్యమనసా తులసీం ధ్యాత్వా నమస్కారాన్ సమర్పయేత్. అనయా మయా కృతపూజయా, యథాశక్త్యా శ్రీతులసీదేవతా ప్రీయతాం న మమ.

ఇతి శ్రీతులసీ నిత్యపూజా విధిస్సమాప్తః.

తులసీ ప్రదక్షిణమంత్రము.

యాని కాని చ పాపాని జన్మాంతరకృతాని చ,
తాని తాని ప్రణశ్యంతి ప్రదక్షిణపదేపదే.

అని స్త్రీలు ౧౦౮ ప్రదక్షిణములను చేయవలయును.

# సంతానగోపాలపూజా వ్రతము.

ఆచమ్య: మమ సత్సంతానఫలావాప్త్యర్థం శ్రీసంతాన ప్రదగోపాలకృష్ణదేవతాముద్దిశ్య గోపాలదేవతా ప్రీత్యర్థం సంతానప్రదగోపాలకృష్ణదేవతాపూజాం కరిష్యే. తదంగ కలశారాధనం కరిష్యే. కలశపూజాం కృత్వా. శ్రీసంతాన గోపాలకృష్ణం ధ్యాయేత్:—

విజయేన యుతో రథస్థితః ప్రసమానీయ సముద్రమధ్యతః,
అదదాత్తనయాన్ద్విజన్మనే స్మరణీయో వసుదేవనన్దనః.

(అని ధ్యానించి క్రమముగ పూజింపవలయును.)

క్లీం దేవకీసుత గోవింద వాసుదేవ జగత్పతే,
దేహి మే తనయం కృష్ణ త్వామహం శరణం గతా.

(క్లీం శ్రీం సుతప్రద గోపాలకృష్ణాయ నమః ఆవాహనం సమర్పయామి)

క్లీం దేవకీసుత గోవింద వాసుదేవ జగత్పతే,
దేహి మే తనయం కృష్ణ త్వామహం శరణం గతా.

(క్లీం శ్రీం సుతప్రదగోపాలకృష్ణాయ నమః, ఆసనం సమర్పయామి)

క్లీం దేవకీసుత గోవింద వాసుదేవ జగత్పతే,
దేహి మే తనయం కృష్ణ త్వామహం శరణం గతా.

(క్లీం శ్రీం సుతప్రద గోపాలకృష్ణాయ నమః, పాద్యం సమర్పయామి)

క్లీం దేవకీసుత గోవిన్ద వాసుదేవ జగత్పతే,
దేహి మే తనయం కృష్ణ త్వామహం శరణం గతా.

(క్లీం శ్రీం సుతప్రద గోపాలకృష్ణాయ నమః, అర్ఘ్యం సమర్పయామి.)

క్లీం దేవకీసుత గోవిన్ద వాసుదేవ జగత్పతే,
దేహి మే తనయం కృష్ణ త్వామహం శరణం గతా.

(క్లీం శ్రీం సుతప్రద గోపాలకృష్ణాయ నమః, శుద్ధోదకస్నానం సమర్పయామి.)

క్లీం దేవకీసుత గోవిన్ద వాసుదేవ జగత్పతే,
దేహి మే తనయం కృష్ణ త్వామహం శరణం గతా.

(క్లీం శ్రీం సుతప్రద గోపాలకృష్ణాయ నమః, వస్త్రయుగ్మం సమర్పయామి, తతశ్శుద్ధాచమనీయం సమర్పయామి.)

క్లీం దేవకీసుత గోవిన్ద వాసుదేవ జగత్పతే,
దేహి మే తనయం కృష్ణ త్వామహం శరణం గతా.

(క్లీం శ్రీం సుతప్రద గోపాలకృష్ణాయ నమః, యజ్ఞోపవీతం సమర్పయామి, తతశ్శుద్ధాచమనీయం సమర్పయామి.)

క్లీం దేవకీసుత గోవిన్ద వాసుదేవ జగత్పతే,
దేహి మే తనయం కృష్ణ త్వామహం శరణం గతా.

(క్లీం శ్రీం సుతప్రద గోపాలకృష్ణాయ నమః, గంధం సమర్పయామి.)

క్లీం దేవకీసుత గోవిన్ద వాసుదేవ జగత్పతే,
దేహి మే తనయం కృష్ణ త్వామహం శరణం గతా.

(క్లీం శ్రీం సుతప్రద గోపాలకృష్ణాయ నమః, అక్షతాన్ సమర్పయామి.)

క్లీం దేవకీసుత గోవిన్ద వాసుదేవ జగత్పతే,
దేహి మే తనయం కృష్ణ త్వామహం శరణం గతా.

(క్లీం శ్రీం సుతప్రద గోపాలకృష్ణాయ నమః, పుష్పాణి సమర్పయామి.)

### శ్రీకృష్ణాష్టోత్తరశతనామావళిః.

ఓం శ్రీకృష్ణాయ నమః
కమలానాథాయ
వాసుదేవాయ
సనాతనాయ
వసుదేవాత్మజాయ
పుణ్యాయ
లీలామానుషవిగ్రహాయ
శ్రీవత్సకౌస్తుభధరాయ
యశోదావత్సలాయ
హరయే ౧౦

చతుర్భుజాత్త చక్రాసిగదా
శంఖాద్యుదాయుధాయ
దేవకీనందనాయ
శ్రీశాయ
నందగోపప్రియాత్మజాయ
యమునావేగసంహారిణే
బలభద్రప్రియానుజాయ
పూతనాజీవితహరాయ
శకటాసురభంజనాయ
నందవ్రజనానందినే

సచ్చిదానందవిగ్రహాయ
నవనీతవిలిప్తాంగాయ
నవనీతనటాయ
అనఘాయ
నవనీతనవాహారాయ
ముచికుంద ప్రసాదకాయ
షోడశస్త్రీసహస్రేశాయ
త్రిభంగినే
మధురాకృతయే
శుకవాగమృతాబ్ధీందవే
గోవిందాయ ౩౦
యోగినాంపతయే
వత్సవాటచరాయ
అనంతాయ
ధేనుకాసురభంజనాయ
తృణీకృతతృణావర్తాయ
యమళార్జునభంజనాయ
ఉత్తాలతాళభేత్రే
తమాలశ్యామలాకృతయే
గోపగోపీశ్వరాయ
యోగినే ౪౦
కోటిసూర్యసమప్రభాయ
ఇలాపతయే
పరంజ్యోతిషే
యాదవేంద్రాయ
యదూద్వహాయ
వనమాలినే
పీతవాససే
పారిజాతాపహారకాయ
గోవర్ధనాచలోద్ధర్త్రే
గోపాలాయ ౫౦
సర్వపాలకాయ
అజాయ
నిరంజనాయ
కామజనకాయ
కంజలోచనాయ
మధుఘ్నే
మధురానాథాయ
ద్వారకానాయకాయ
బలినే
బృందావనాంతసంచారిణే
తులసీదామభూషణాయ
శ్యమంతకమణేర్హర్త్రే
నరనారాయణాత్మకాయ
కుబ్జాకృష్ణాంబరధరాయ
మాయినే
పరమపూరుషాయ
ముష్టికాసురచాణూరమల్ల
యుద్ధవిశారదాయ
సంసారవైరిణే

కంసారయే
మురారయే ౭౦
నరకాంతకాయ
అనాదిబ్రహ్మచారిణే
కృష్ణావ్యసనకర్శకాయ
శిశుపాలశిరచ్ఛేత్రే
దుర్యోధనకులాంతకాయ
విదురాక్రూరవరదాయ
విశ్వరూపప్రదర్శకాయ
సత్యవాచే
సత్యసంకల్పాయ
సత్యభామారతాయ ౮౦
జయినే
సుభద్రాపూర్వజాయ
జిష్ణవే
భీష్మముక్తిప్రదాయకాయ
జగద్గురవే
జగన్నాథాయ
వేణునాదవిశారదాయ
వృషభాసురవిధ్వంసినే
బాణాసురకరాంతకాయ
యుధిష్ఠిరప్రతిష్ఠాత్రే ౯౦
బర్హిబర్హావతంసకాయ
పార్థసారథయే
అవ్యక్తాయ
గీతామృతమహోదధయే
కాళీయఫణిమాణిక్యరంజితశ్రీపదాంబుజాయ
దామోదరాయ
యజ్ఞభోక్త్రే
దానవేంద్రవినాశకాయ
నారాయణాయ
పరబ్రహ్మణే ౧౦౦
పన్నగాశనవాహనాయ
జలక్రీడాసమాసక్తగోపీవస్త్రాపహారకాయ
పుణ్యశ్లోకాయ
తీర్థపాదాయ
వేదవేద్యాయ
దయానిధయే
సర్వదేవాత్మకాయ
సర్వగ్రహరూపిణే
పరాత్పరాయ ౧౦౮

శ్రీకృష్ణాష్టోత్తరశతనామావళిస్సమాప్తా.

క్లీం దేవకీసుత గోవిన్ద వాసుదేవ జగత్పతే,
దేహి మే తనయం కృష్ణ త్వామహం శరణం గతా.

(క్లీం శ్రీం సుతప్రదగోపాలకృష్ణాయ నమః, ధూపమాఘ్రాపయామి.)

క్లీం దేవకీసుతగోవిన్ద వాసుదేవ జగత్పతే,
దేహి మే తనయం కృష్ణ త్వామహం శరణం గతా.

(క్లీం శ్రీం సుతప్రదగోపాలకృష్ణాయ నమః, దీపం దర్శయామి ధూపదీపానంతరం శుద్ధాచమనీయం సమర్పయామి.)

క్లీం దేవకీసుత గోవింద వాసుదేవ జగత్పతే,
దేహి మే తనయం కృష్ణ త్వామహం శరణం గతా.

(క్లీం శ్రీం సుతప్రదగోపాలకృష్ణాయ నమః, నైవేద్యం సమర్పయామి)

ప్రాణాయ నమః, అపానాయ నమః, వ్యానాయ నమః, ఉదానాయనమః, సమానాయనమః, మధ్యేమధ్యే పానీయం సమర్పయామి ఉత్తరాపోశనం సమర్పయామి, హస్తౌ ప్రక్షాళయామి, పాదౌ ప్రక్షాళయామి, శుద్ధాచమనీయం సమర్పయామి.

క్లీం దేవకీసుత గోవింద వాసుదేవ జగత్పతే,
దేహి మే తనయం కృష్ణ త్వామహం శరణం గతా.

(క్లీం శ్రీం సుతప్రదగోపాలకృష్ణాయనమః, తాంబూలం సమర్పయామి)

క్లీం దేవకీసుత గోవింద వాసుదేవ జగత్పతే,
దేహి మే తనయం కృష్ణ త్వామహం శరణం గతా.

(క్లీం శ్రీం సుతప్రద గోపాలకృష్ణాయనమః, నీరాజనం సమర్పయామి.)

క్లీం దేవకీసుత గోవింద వాసుదేవ జగత్పతే,
దేహి మే తనయం కృష్ణ త్వామహం శరణం గతా.

(క్లీం శ్రీం సుతప్రదగోపాలకృష్ణాయనమః, మంత్ర పుష్పం సమర్పయామి.)

క్లీం దేవకీసుత గోవింద వాసుదేవ జగత్పతే,
దేహి మే తనయం కృష్ణ త్వామహం శరణం గతా.

(క్లీం శ్రీం కృష్ణాయ నమః, ప్రదక్షిణనమస్కారాన్ సమర్పయామి.

ఫలసమర్పణమ్.

క్లీం దామోదరాయ విద్మహే వాసుదేవాయ ధీమహి,
తం నః కృష్ణః ప్రచోదయాత్.
ఇత్యుక్త్వా పుష్పాక్షతాన్ జలేన సహ విసృజేత్.

అనయా పూజయా భగవాన్ సంతానగోపాలకృష్ణః
ప్రీయతాం. ప్రసాదం శిరసా గృహ్ణామి.
పూజానంతరం మూలమంత్రం ప్రత్యహ
మష్టోత్తరశతం జపేత్.

తత్క్రమః.

అస్య శ్రీకృష్ణాష్టాదశాక్షరీమహామంత్రస్య, నారద భగవాన్ఋషిః శిరసి, గాయత్రీఛందః ముఖే, శ్రీకృష్ణో దేవతా హృదయే, క్లీం బీజం బీజే, స్వాహా శక్తిః హృదయే, ఓం కీలకం పాదయోః, శ్రీకృష్ణప్రసాదసిద్ధ్యర్థే జపే వినియోగః.

కరహృదయాదిన్యాసః.

౧. క్లీం అఙ్గుష్ఠాభ్యాం నమః.
౨. గ్లాం తర్జనీభ్యాం నమః
3. హుంఫట్ మధ్యమాభ్యాం నమః
౪. క్లాం అనామికాభ్యాం నమః
౫. ఓం కనిష్ఠికాభ్యాం నమః
౬. గ్లీం కరతలకరపృష్ఠాభ్యాం నమః
౧. క్లీం హృదయాయ నమః
౨. గ్లాం శిరసే స్వాహా
3. హుంఫట్ శిఖాయై వషట్
౪. క్లాం కవచాయ హుమ్.
౫. ఓం నేత్రత్రయాయ వౌషట్
౬. గ్లీం అస్త్రాయ ఫట్
ఓం భూర్భువస్సువరోమితి దిగ్బంధః.

అథ ధ్యానశ్లోకాః.

౧. స్తనంధయ స్తం జననీముఖాబ్జం
విలోక్య మన్దస్మితముజ్జ్వలాంగం,
స్పృశంతమన్యం స్తనమంగులీభ్యాం
వందే యశోదాంకగతం ముకుందమ్.

౨. శంఖచక్రగదాపద్మధరం శ్యామం చతుర్భుజం,
దేవకీతనయం కృష్ణం పీతవాసస మచ్యుతం.

3. సమర్పయంతం విప్రాయ నష్టానానీయ బాలకాన్,
మయూరబర్హశిరసం ధ్యాయేత్సౌదామినీనిభం.

అథ లమిత్యాదిపంచపూజాం గురుపూజాం చ కుర్యాత్.

లం పృథివీతత్త్వాత్మనే శ్రీగోపాలకృష్ణాయనమః, గంధం పరికల్పయామి.

హం ఆకాశతత్త్వాత్మనే శ్రీగోపాలకృష్ణాయ నమః, పుష్పం పరికల్పయామి.

యం వాయుతత్త్వాత్మనే శ్రీగోపాలకృష్ణాయ నమః, ధూపం పరికల్పయామి.

రం తేజస్తత్త్వాత్మనే శ్రీగోపాలకృష్ణాయ నమః, దీపం పరికల్పయామి.

వం అమృతతత్త్వాత్మనే శ్రీగోపాలకృష్ణాయ నమః, అమృతనైవేద్యం పరికల్పయామి.

## గురుపూజా.

గురుర్బ్రహ్మా గురుర్విష్ణు ర్గురుర్దేవో మహేశ్వరః,
గురుస్సాక్షాత్పరబ్రహ్మ తస్మై శ్రీగురవే నమః.
మంత్రోపదేష్టారం మనసా సంస్మృత్య ప్రణమేత్..

## మూలమంత్రము.

ఐం క్లీం శ్రీం కృష్ణాయ గోవిందాయ గోపీజనవల్లభాయ స్వాహా (ప్రత్యహము ౧౦౮ మార్లు జపించవలయును.)

మంత్రగాయత్రీ—క్లీం దామోదరాయ విద్మహే వాసుదేవాయ ధీమహి, తం నః కృష్ణః ప్రచోదయాత్.

---

చెన్నపురి : వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్‌వారి
'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము.
P. I. Card Q. H. No. Ms. 22. 10—1—1946.

| | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|
| యజుర్వేదసంధ్యావందనము, మూలము, సస్వరము ... | 0 | 3 |
| డిటో పురుషసూక్తము, శ్రీసూక్తము, ఆంధ్రటీకాతాత్పర్యము | 0 | 6 |
| డిటో ఆబ్దికమంత్రములు ... | 0 | 8 |
| శ్రీవైష్ణవాహ్నికము, చిన్నసైజు ... | 0 | 6 |
| శ్రీవైష్ణవశ్రాద్ధప్రయోగము ... | 0 | 6 |
| సూర్యనమస్కారము, చిన్నసైజు ... | 0 | 2 |
| రుద్రము—నమకము, చమకము, సస్వరము, చిన్నసైజు... | 0 | 3 |
| రుద్రాధ్యాయము, సటీక ... | 1 | 8 |
| సత్యనారాయణవ్రతకల్పము, క్రొత్తకూర్పు ... | 0 | 8 |
| వ్రతరత్నాకరము, ప్రథమభాగము ... | 0 | 12 |
| ,, ద్వితీయభాగము ... | 1 | 8 |
| వ్రతచూడామణి, (సంస్కృతము) చక్కనిప్రతి ... | 2 | 8 |

## జ్యోతిషగ్రంథములు.

| | | |
|---|---|---|
| అఱువది (గత) సంవత్సరముల పంచాంగము (1867-1926) | 10 | 0 |
| అష్టకవర్గు, సాంధ్రతాత్పర్యము ... | 0 | 4 |
| ఆరూఢరత్నసిద్ధాంజనము ... | 0 | 12 |
| కాలామృతము, మేలుప్రతి ... | 2 | 0 |
| కృష్ణవాస్తుశాస్త్రము, అను వాస్తుసారసంగ్రహము ... | 0 | 12 |
| కేరళప్రశ్నము, సాంధ్రతాత్పర్యము ... | 0 | 4 |
| గౌళిశాస్త్రము, తెలుఁగు ... | 0 | 3 |
| నష్టప్రశ్నము, ప్రశ్నశాస్త్రము, తాత్పర్యసహితము ... | 0 | 6 |
| జలార్గళశాస్త్రము, ఆంధ్రటీకాసహితము ... | 0 | 6 |
| జాతకచంద్రిక, గోపాలరత్నాకరము, సాంధ్రతాత్పర్యము... | 0 | 12 |
| జ్యోతిషార్ణవనవనీతము ... | 2 | 0 |
| క్షత్రచూడామణి, చక్కనిప్రతి ... | 0 | 6 |
| [illegible]ప్పబంధము, సాధారణప్రతి ... | 0 | 8 |

| | | ప్రతి 1-కి రూ. | అ |
|---|---|---|---|
| …ద్యోగరత్నాకరము, తెనుగువచనము | … | 0 | 12 |
| …జ్జాతకము, ఆంధ్రటీకాతా॥ వ్యా॥ సహితము | … | 5 | 8 |
| వాస్తువు ,, | … | 0 | 3 |
| …సూత్రములు ,, | … | 0 | 6 |
| …ర్థచంద్రిక, ఆం॥ టీకా॥ తా॥ | … | 1 | 0 |
| …స్త్రదర్పణము, సటీక | … | 1 | 8 |
| పారాశర్యము, సాంధ్ర తాత్పర్యము | … | 0 | 12 |
| శాస్త్రము, (శిఖినరసింహశతకము) | … | 0 | 4 |
| …తి, సాంధ్ర తాత్పర్యము | … | 1 | 8 |
| …తశాస్త్రము, సాంధ్ర తాత్పర్యము | … | 0 | 14 |
| తాచకము ,, | … | 0 | 12 |
| …ాల (వర్షఫణి) ,, | … | 0 | 4 |
| …స్తసర్వస్వము ,, | … | 0 | 4 |
| …శ్నప్రశ్నరత్నావళి, నెపోలియన్ అనుష్ఠించిన …ప్రశ్నగ్రంథమునకు తెనుగు | … | 0 | 4 |
| …మారగృహవాస్తువు, సాంధ్ర తాత్పర్యము | … | 0 | 4 |
| …మారశిల్పిశాస్త్రము ,, | … | 0 | 4 |
| శాస్త్రము ,, | … | 0 | 3 |
| …రచింతామణి | … | 1 | 0 |
| …తాత్పర్యము | … | 3 | 8 |
| …స్త్రము, సటీక | … | 0 | 6 |
| తెనుగుపద్యకావ్యము | … | 0 | 6 |
| …ల, సాంధ్ర తాత్పర్యము | … | 0 | 12 |

అనేక సంస్కృతాంధ్రగ్రంథములు, నిఘంటువులు, గణిత…ములు, శతకములు మావద్ద దొరకును.

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్,
292, ఎస్ప్లనేడ్, మదరాసు.